ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథమాల
( ౨౧-వ ప్రచురణము )

# వ్యాసమంజరి

కర్త
కట్టమంచి రామలింగారెడ్డి




035,1M80,1
G9R



వాల్తేరు
౧౯౩౯

PRINTED BY
MR. A. LAKSHMANASWAMY NAIDU
AT THE SARASWATHI POWER PRESS, RAJAHMUNDRY
ORDER NO. 1269—1939

సర్వస్వామ్యసంకలితము ] [ వెల రు ౧-౮-౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథమాల
(౨౧-వ ప్రచురణము)

# వ్యాసమంజరి

కర్త
కట్టమంచి రామలింగారెడ్డి




వాల్తేరు
౧౯౩౯

PRINTED BY
MR. A. LAKSHMANASWAMY NAIDU
AT THE SARASWATHI POWER PRESS, RAJAHMUNDRY
ORDER NO. 1263—1939

సర్వస్వామ్యసంకలితము] [వెల రు ౧-౮-౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విషయసూచిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఉపోద్ఘాతము

ఆంధ్రసారస్వతము, భారతరూపమున సుప్రతిష్ఠితమైనది మొదలు ఆఱేడుశతాబ్దులు, బహుళముగా చంపూకావ్యములును, సకృత్తుగా నిర్వచనప్రబంధములును వెలసినవేకాని, పేరుగల ఒక్క వచనగ్రంథ మైనను తలసూపలేదు. గద్యపద్యాత్మకములైన చంపువులు ఉభయ తారకములగును గదా యన్న నిబ్బరముచేతనో, గద్యము పద్యము వలె ధారణాయోగ్యము కాదన్న అనుమానముచేతనో, పద్యరచనవలె గద్యరచన యశోదాయకము కాదన్న నిరసనభావముచేతనో, మన పూర్వకవులు ప్రత్యేకవచనరచలను ఆదరింపరైరి. కానిచో, సంస్కృత మున ఉత్తమగద్యకావ్యములగు కాదంబరి దశకుమార చరిత్రలు సయి తము, తెనుగున చంపువులుగానే అవతరించుటకు హేతువుండదు.

ఇట్లుండగా, వచనగ్రంథముల అభావమువలని లోటును గ్రహిం చి, దక్షిణాంధ్రకవులు ఆ కొఱతను తీర్పనమకట్టిరి. మధుర, తంజా వూరు, మైసూరు మొదలగు సంస్థానాధీశ్వరులు, 17, 18 శతాబ్దు లలో పెక్కువచన గ్రంథములు వ్రాయించుటే కాక, వారిలో కొందఱు స్వయముగా కొన్ని రచించిరి. కాని, అవి ఆంధ్రభారతభాగవతాది పురాణేతిహాసములకును, మఱికొన్ని పూర్వప్రబంధములకును దండా న్వయప్రాయములగు వచనరూపములే కాని, స్వతంత్రరచనలు కావు. అందుచే, వానికి, చారిత్రకప్రాధాన్యమున్నంత సాహిత్యప్రతిష్ఠ లేదు.

అసలు స్వతంత్రవాఙ్మయశాఖగా పరిగణింపదగిన వచనావిర్భా వము, మనభాషలో అధునాతనమే యని నిస్సంశయముగా చెప్ప వచ్చును. ఆంగ్లేయులు మనకొసగిన విద్యాసంస్కారమువలన మనభా షకు కల్గిన మేలేమైన ఉన్నయెడల అది యిదొక్కటే. వారిభాషలో ఉన్నంత కావ్యప్రక్రియావైవిధ్యము మనభాషలో పూర్వములేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారి వాఙ్మయము చదివి, ఆరుచిగ్రహించిన పిమ్మటనే మనవారు తద నుకరణముగా, నవలలు—కథానికలు—వ్యాసములు మొదలగు నానా వచనగ్రంథములను రచింపమొదలిడిరి. ఈ నూతనగద్య గంగావతరణ మునకు చిన్నయసూరి భగీరథుని వంటివాడు. దాని నానాముఖాప్రతి హతప్రవాహగతికి కారణభూతుడు వీరేశలింగముపంతులుగారు. వచన ప్రపంచమున పంతులుగారు త్రొక్కని దారిలేదు. ధారాళమును, తేట తెల్లమును అయినశైలిలో వారు వ్రాసిన శతాధికవచనములు వారి గద్యతిక్కన బిరుదమును సార్థకముచేసెను. ఆ రచనలన్నిటిలో కవుల చరిత్ర చిరస్థాయియై, వారికీర్తిని చిరస్థాయిగా కాపాడగలదు. పూర్వ కవుల జీవితాంశములను, చారిత్రకపరిశోధనపూర్వకముగా నిర్ణయించు తలంపుతో పంతులుగారు సల్పిన కృషి అనన్యసామాన్యము. కాని వారాసించిన ముఖ్యప్రయోజనము ఆయాకవుల కాలనిర్ణయము మాత్రమే. ఆ కవుల గ్రంథవిమర్శనమునెడ వారికంత దీక్షలేదు. ప్రసంగ వశమున గ్రంథగుణమునుగూర్చియు ఏ కొలదిపాటి ప్రశంసయేని ఉన్నను, అది విమర్శనమనిపించుకొన దగినట్లుండదు. యథార్థమైన ఆంధ్రకావ్యవిమర్శప్రారంభము కవులచరిత్ర పుట్టుకకు తరువాత జరిగి నది. ఆ మహారంభమునకు ప్రథమాచార్యులుగా పేర్కొనదగినవారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు.

శబ్దసాధుత్వాసాధుత్వనిర్ణయమే గ్రంథవిమర్శనమనెడిభ్రమతో పండితులొకరితో నొకరు వాగ్యుద్ధములు చేయుదినములలో, భావు కులదృష్టిని శాబ్దికచర్చనుండి తాత్త్వికమీమాంసకు మరల్చిన రసికులు రెడ్డిగారు. కావ్యమునకు శబ్దము ఆధిభౌతికాంశము మాత్రము. అది బాహిరము. దాని ఆధ్యాత్మికాంశము తద్గతకళాసౌందర్యము. అది ఆంతరము. విమర్శమార్గమును బాహిరజగత్తునుండి ఆంతరజగత్తునకు కొనిపోయిన ప్రథమాంధ్రవిమర్శగ్రంథము రెడ్డిగారి కవిత్వతత్త్వవిచా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రము. మనభాషలో ఈ గ్రంథరాజమునకు ప్రతిబింబములుగా ఇటీవల అనేకతత్త్వవిచారములు పుట్టినవి. అవన్నియు ఇంచుమించు ఈ మాతృస్తన్యమును గ్రోలిన శిశువులే. కళాపూర్ణోదయపరామర్శమును నిమిత్తముగా గైకొని, వీరాగ్రంథమున మన కపూర్వములైన అనేక కళాధర్మములను ప్రతిపాదించి, వ్యాఖ్యాన మొనర్చిరి. అట్లే ఆధునిక కవుల నాదరించి ప్రోత్సహించుతలంపున వారిఖండకావ్యములకు పెక్కింటికి తొలిపలుకులు వ్రాయుచు, విమర్శసారస్వతమును మఱికొంత వృద్ధికి తెచ్చిరి. ఒకవంక భారతకళాపూర్ణోదయాది ప్రాచీనకావ్యముల నారాధించుట, ఇంకొకవంక బాలకవుల భావగీతములను ఆదరించుట! ఈ ప్రాచీన నవీనతాసమరసభావము నిజముగా ప్రశంసార్హము. దేశకాల నిరపేక్షమైన గుణగ్రహణపారీణత అచ్చపు సహృదయతగలవారికిగాని ఉండదు. అదిలేకయే ప్రాచీనతాభిమానులు నవ్యకవిత్వమును, నవీనతాభిమానులు ప్రాచీనకవిత్వమును నిరంతరము శపించుచున్నారు.

ఆధునికకవిత్వములో నైనను, సరసతతోపాటు నియమబద్ధత కలదానినే వీరు కొనియాడుదురుగాని, విశృంఖల విహార మొనర్చు దానిని మెచ్చరు. సముచితనియమపరిపాలనము, నిరర్థకబంధవిచ్ఛేదము, అస్వతంత్రతాతిరస్కారము—ఇవియే వీరు పదింపదిగా సాంఘికాచారవిషయమునను, కావ్యమర్యాదావిషయమునను బోధించుధర్మములు. వీరి ఉపన్యాసములలో, వ్యాసములలో, ఈ ధర్మత్రయమే ఆత్మగా భాసించుచుండును.

విమర్శకులలో వీరికెంత ప్రాధాన్యమున్నదో, వ్యాసరచయితల లోను అంత ప్రాధాన్యమున్నది. సాహిత్యాంగముగా పరిగణింపదగిన వ్యాసరచన ఆంగ్లభాషలోవలె మనభాషలో ఇంకను పరిణతావస్థకు రాకున్నను, జరిగినంతవరకు దానిపెంపునకు కారణభూతులైన విద్వాంసులలో వీరొకరు. గ్రంథములకు పీఠికలు వ్రాసినను, పత్రికలకు వ్యాస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు వ్రాసినను, తాత్త్వికముగా విషయచాలనమొనర్చి, పటుత్వము గల భాషలో సోపపత్తికమైన సిద్ధాంతముచేయు నేర్పు వీరివాక్కునకు సహజగుణము. వీరివ్యాసములకు ఇదియే ప్రథమాలంకారము. రెండవది వానిశైలి. విషయౌన్నత్యముతో పాటు అర్థగాంభీర్యమును, దాని కనుగుణమగు శైలియు ఉన్నప్పుడే, వ్యాసము సర్వాంగసుందరముగా నుండును. అర్థగాంభీర్యములేనిచో పేలవతయు, శైలీసంపన్నత లేనిచో నీరసతయు తటస్థించి వ్యాసమునకు తీరనిలోటు కలుగును. వీరి వ్యాసములలో అర్థమెంత గంభీరముగా నుండునో, శైలియు అంత సురుచిరముగా నుండును. ఆశైలియు, విషయవిభేదమునుబట్టి ఒక్కయెడ ఆలంకారికముగా, ఒక్కయెడ ప్రాస్తావికముగా, ఒక్కయెడ తార్కికముగా మారుచుండును. ఏ రూపము తాల్చినను, దానిపటుత్వము, సొగసుదనము, పోవు. నన్నయసూరనలను ప్రశంసించుచో, శైలియెంత ఆలంకారికముగా నున్నదో తాతతండ్రుల ముచ్చటలు చెప్పుచో అంత ప్రాస్తావికముగా నున్నది. ఇన్ని అవాంతరరూపభేదములు పొందుచున్నను, దానికి ఆత్మీయమైన మూలధర్మమును విడనాడదు. వీరిశైలికి ఆత్మీయాంశము బుద్ధిగమ్యత. నానాశాస్త్రనిష్ణాతమును, విజ్ఞానసాంద్రమును, సమ్యగ్యోజనాయుతమును ఐన మేధస్సున బుట్టిన భావములుగలరచన బుద్ధిగమ్యము గాక ఇంకొకవిధముగా నుండదు, ఉండదగదు.

నూతనశాస్త్రపరిచయమువలననో, అన్యసంప్రదాయసంపర్కమువలననో, ఒక సంఘములో గాని, ఒక వ్యక్తిలోగాని అపూర్వభావములు పొడమునపుడు వానిని వ్యక్తీకరించుటకు పూర్వస్థితమైన సాధారణభాష చాలదు. అట్టియెడ నూతనపదజాలము సృష్టించుటో అన్యదేశ్యములు ప్రయోగించుటో, పూర్వపదములనే, లక్షణార్థమున వాడుటో తప్పనిసరియగును. ఈ మూడుపద్ధతులలో అన్యదేశ్యపద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రయోగము భాషాస్వచ్ఛతకు ఉపహతికల్పించును. రెడ్డిగారు అట్టి స్వచ్ఛతాభ్రంశమును బొత్తిగా ఒల్లరు. మఱి, పూర్వపదములనే అపూర్వార్థములకు తగినట్లు మలతురు. ఈ దుర్ఘటనియమమును అసిధారావ్రతముగా పరిపాలించుట చేతనే వీరు తమశైలిని స్వచ్ఛతామహితముగా నొనర్పగల్గిరి. అన్యభాషాపదకళంకితముకాని, అచ్చపు స్వభాషలో, శాస్త్రగ్రంథమైన అర్థశాస్త్రమునే చిన్ననాడు వ్రాయగల్గిన వీరికి వ్యాసములు వ్రాయుట యేమిలెక్క.

ఈ విధముగా నానాగుణశోభితములైన వీరి వ్యాసములన్నియు —అప్పుడప్పుడు అవసరమును బట్టి అనేక కాలముల వ్రాసినవి—ఒక్కచో చేర్చి, సమగ్రసంపుటముగా ప్రకటించుట భాషకు మేలు సేతయని మిత్రులు హెచ్చరించగా, శ్రీరెడ్డిగారు ఆమోదించుటయే కాక, ఈ వ్యాసమంజరిని విశ్వకళాపరిషత్తునకు సొత్తుగా దానమొనర్చి, వారి కృతజ్ఞతకు పాత్రులైరి. మఱియు తమ తమ గ్రంథములకు పీఠికలుగానున్న వ్యాసములను, ఈ సంపుటిలో చేర్చుకొనుటకు అనుమతించిన కవులకు విశ్వవిద్యాలయము పరమున కృతజ్ఞత తెలుపుచున్నాను.

ఈ వ్యాసములన్నిటిని సేకరించి, ప్రకటించుభారము నేను పూనితిని. వ్యాసములను విషయభేదమును బట్టి ఖండములుగా వర్గీకరించుటయు, వ్రాతతప్పులు దిద్దుటయు తప్ప నేను పడినపాటేమియు లేదు. నాకు అచ్చుప్రూఫులు దిద్దు నేర్పులేదు; అలవాటు అంతకు మున్నె లేదు. అయినను, శక్తివంచనలేక చేతనైనంతవఱకు, సవరించితిని. ఇంకేవేని పొరపాట్లున్నవేమో, పాఠకులు మన్నింతురు గాక.

వాల్తేరు
22–9–1939

పింగళిలక్ష్మీకాంతం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీరాజరాజనరేంద్ర వర్థంతి మహోత్సవము

## అధ్యక్షుని వచనము



సభాసదులైన రాజమహేంద్రవర మహాజనులకును, దక్కిన మహాశయులకును, నమస్కృతులు సమర్పించి చేయు విజ్ఞాపనము.

మన మిప్పుడు జరుపు వర్థంతి హిందూజనులలో నపూర్వమైనది. పురాణపురుషులఁ బూజించుట మన యాచారములలో నొక్కటియైనను, చారిత్రకపాత్రల స్మరించుట కాదు. కావున నేఁటి యుత్సవ మపూర్వమైన యాచారపరిణామము. సత్యములైన చరిత్రాంశముల జ్ఞప్తికిఁ దెచ్చి వ్యాపింపఁజేయునట్టి మహోత్సవములఁ జేయుటలో మీరు మొదటివారు. మీరు చూపినమార్గము నెల్లరు ననుసరింతురుగాక! కేవలపరార్థములైన పండుగలఁ జేయునట్లు మన మేల ఐహికశ్రేయోనిమిత్తములైనవానిని జేయమో తెలియకున్నది. మనయందుఁ జరిత్రజ్ఞానాసక్తి లేదనుట కిదియు నొక నిదర్శనమా? ఇఁకముందైన నీలోపము నివారిత మగునుగాక!

ఈ యపూర్వవర్థంతిసమయమున నన్నగ్రాసనస్థుని జేసి సత్కరించినందులకు మీకు మనఃపూర్వకముగ వందనములఁ జేయుచున్నాను. “చెట్టు పెట్టి పెంచినవాఁ డొకఁడు: దాని ఫలము ననుభవించినవాఁడు వేఱొకఁడు.” అన్నట్లున్నది. ఇప్పుడు మనకు నాశ్రయమైన యితిహాసవృక్షమును బెట్టి పోషించినవారిలో నే నొక్కఁడను గాను. మఱియెవ్వరు ప్రముఖు లనినఁ బ్రథములు — అనఁగాఁ గాలక్రమముగాఁ బరిగణించినచో — కందుకూరి వీరేశలింగముగారు. వారి కవులచరిత్ర యితిహాసశోధనలకు దారిచూపిన యుద్యమములలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదటిది. అట్టివారి జన్మస్థానమున నిట్టి పండుగ జరుగుట నిశ్శ్రేయసకము కానేరదుకదా! గుణమునుబట్టి చూచిన నగ్రగణ్యు లనఁదగిన వారు ఆంధ్రులచరిత్ర కర్త లగు చిలుకూరి వీరభద్రరావుగారు. వీరి వలె నిష్పక్షపాత మైన విమర్శనశక్తిని బ్రకటించినవారు మన దేశమున ననేకులు లేరు. ఆ శక్తికిఁ దగిన శ్రమను దీసికొని యెంత చక్కఁగ, నెంత పూర్ణముగ మన చరిత్రమును సువ్యక్తము చేసి యున్నారో, దానిని దెలుపుటకు నాకు నర్హత చాలదు. వీరితోఁ దుల దూఁగఁ దగిన శోధకశిఖామణులు కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు గారును, జయంతి రామయ్యపంతులుగారును. ఈ సుదినమునఁ గుల దేవతలట్లు కొలువఁదగిన వార లింకను ననేకు లున్నారు గాని, వారి నందఱను బేర్కొని ప్రశంసించుటకుఁ జాలినంత జ్ఞానముగాని, కాలము గాని లేనందున విడువవలసినవాఁడ నైతిని; క్షమింపుడు. రాజరాజ నరేంద్రుని గూర్చియు, నతనికాలమున దివ్యతేజస్సన నొప్పియున్న నన్నయభట్టిని గూర్చియు, నీ విద్వత్ శోధకులు శాసనాదిపరీక్షలఁ జేసి, నిర్ధారణచేసిన విషయములుకదా, యీనాఁటి విందు! ఈయుత్సవమను కృతికి నాయకులు రాజరాజును, నన్నయ్యయు: కృతికర్తలు మీ యైతిహాసికమండలివారు. వారి కృతియు, నన్నయయొక్క కృతి వలె నూతనప్రపంచము నొండు సృష్టికిఁ దెచ్చునుగాక!

"నిత్యమైన ధనము నిర్మలకీర్తియ" అనియు,

క. "ఇలఁ గీర్తి యెంతకాలము
గలిగి ప్రవర్తిల్లు నంతకాలంబును ని
త్యులకారె కీర్తిగల పు
ణ్యులు, కీర్తివిహీనుఁ డెందునుం బూజ్యుండే?"

అనియు నన్నయ వ్రాసిన భారత భాగమునఁ జెప్పబడి యున్నది. కీర్తియ యమృతత్వమని వీరి తాత్పర్యము. బౌద్ధుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్కయు మతమునందు నిదియ యమృతత్వమని యున్నది. కీర్తిచే శాశ్వతులైన వారిలో రాజరాజొక్కఁడు. సప్తసంతానములలో, ననఁగాఁ బేరును నిలుపు వస్తువులలోఁ, గావ్యము స్థిరతమము. అందును నన్నయభట్టి యొక్క కృతివంటి దాని యమృతత్వమును వర్ణింప సాధ్యమా! ఒక్క చావే కాదు, ముదిమియు లేనిది. నవ్యతయను గుణముచే రామణీయకమును వహించి నిత్యయౌవన మయినది. ఈ కావ్యము తేజస్సు తనయందుఁ బ్రతిఫలించుటఁ జేసి రాజనరేంద్రునిపేరు పూర్ణిమాచంద్రబింబమువలె ఆంధ్రప్రపంచమున వెలుఁగుచున్నది. భాషతో గాని యయ్యది యస్తమింపదు.

ఆ చాళుక్యరాజును గుఱించి నేనెక్కువగఁ జెప్పఁదలచుకొన లేదు. నేనయి కనిపెట్టిన నూతనాంశము లెవ్వియును లేవు. ఒరులు చెప్పినది చెప్పుట యీ సభకు మర్యాద కాదు. నందంపూడి శాసనము మొదలగు నాధారముల వల్లఁ దేలు విషయము లివ్వి:— తండ్రి విమలాదిత్యుఁడు; తల్లి చోళరాజు పుత్రియైన కుండవాంబ; భార్యయుఁ జోళవంశజయ; ఆపె పేరు అమ్మంగదేవి; పట్టాభిషేక దినము ౧౦౨౨ వ సంవత్సరము, ఆగష్టునెల ౧౬ వ తేది; రాజ్య మేలిన కాలము ౧౦౬౩ వ సంవత్సరము వఱకు. ఇతనికిఁ బూర్వము వేంగీదేశము చోడుల యధీనములోఁ గొంతకాల మున్నట్లును, పిమ్మట నరాజకతా బాధితమైనట్లును దెలియవచ్చెడిని. ఆ కాలమున నొక్క రాజ్యతంత్రముల యందకాదు, సంఘ మతాది ప్రకృతుల యందును గల్లోలములు ప్రబలియుండినవి. విజాతీయులైన శత్రువుల దండయాత్రల వల్ల నేమి, బౌద్ధజైనాది మతముల వ్యాప్తిచే నేమి, వేదతిరస్కార భూయిష్ఠములైన కౌత్సచార్వాకాది వాదములచే నేమి, హిందూమతము యొక్క ప్రాణము లనఁదగిన వర్ణధర్మములు కష్టస్థితికి వచ్చినవి. రాజరాజు యొక్క పరిపాలనము బ్రాహ్మణమత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పునరుద్ధారణ కాలముతో సమన్వయించినది. పునరుద్ధారణకు నీతఁడు సర్వవిధముల సహాయము చేయుటయ కాక, రాజ్యము యొక్క విస్తీర్ణ మును బెంచినవారిలో నొక్కఁడై రణకీర్తి గడించిన వాఁడని యందమా, దానికిఁ దగిన యాధారములు లేవు. నిజమే కాని, భారతములో "పరమండలంబుల ధరణిపతుల। నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును బలిమి నీయని భూమి వలయ పతుల। నుక్కడఁగించుచు" అనియు, నందంపూడి శాసనములో "యస్యస్ఫార భుజాకృపాణ దళితారాతీభ కుంభస్థల। ప్రోన్ముక్తామల వృత్త మౌక్తిక చయస్సం గ్రామ రంగాంతరే" అనియు వర్ణన లుండుట; ఇవి మామూలు ప్రశంసలని తోచెడిని. తన పరాక్రమ శక్తిని వినియోగించినవాఁడని చెప్పుటకుఁ దగిన నిదర్శనములు లేవు. వీని బిరుదము లన్నియు మనకుఁ దెలియును. "సర్వలోకాశ్రయ — శ్రీవిష్ణువర్ధన మహారాజాధిరాజ — రాజపరమేశ్వర — పరమభట్టారక — పరమమాహేశ్వర—" ఇత్యాదులు. ఇవన్నియును వంశమునకుఁ జెందినవే కాని తనయందు మాత్రము ప్రయుక్తములైనవి యెవ్వియుఁ గానము. క్రొత్తరాజ్యములు సంపాదించిన వాఁడైనచో, దానిని సూచించెడు విశేష బిరుదములను దాల్చి యుండును. అది యాచారము. అట్టిది లేనందున, రణ శూరతచేతఁ బ్రసిద్ధికి వచ్చిన వాఁడని జెప్పుటకు సాధ్యము కాదు.

మఱి నందంపూడి మొదలగు శాసనములలోను, భారతము లోను గల వీని వర్ణనములఁబట్టి చూచిన, వర్ణధర్మముల పునరుజ్జీవనము తనయొక్క ముఖ్యవ్యాపార మైనట్లనుమానింపవలసి యున్నది. 'రాజ రాజెట్టి మాహాత్మ్యము కలవాఁ డనగా "వివిధాగమవిహితశ్రముఁడు," "సమస్త వర్ణాశ్రమధర్మరక్షణ మహామహిముఁడు," "విప్రకులము నెల్లఁ బ్రోచుచు, నగ్రజన్ములకు ననుగ్రహమున మహాగ్రహారంబు" లిచ్చువాఁడు. దీనికిఁ దార్కాణముగా మనకు దొరకిన వీని ముఖ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాసనము లన్నియు బ్రాహ్మణదాన శాసనములే. మఱియు నందంపూడి శాసనములో "నిజపవిత్ర చరిత్రతోయైః ప్రక్షాళయంతి కలికాల కళంకపంక," మనియు, భారతములోను, నారీతిని "కలికాలజదోషతుషార సంహతిన్ । దన యుదయ ప్రభావమున దవ్వుగఁజోపి" అనియు నొక్కి వక్కాణింపఁబడి యున్నది. "ఆదిరాజనిభుఁడు," "ఆదిక్షత్రి చరిత్ర" "కలియుగ పవిత్ర" ఇత్యాది విశేషణములును ఆ యర్థమ సూచించుచున్నవి. కలియుగ మనఁగా, బ్రాహ్మణ తిరస్కారము, శూద్రవిజృంభణము—ఇత్యాది వర్ణధర్మ భంగములు గల కాలము కాని, వేఱుకాదని చరిత్రవేదులకుఁ జెప్పవలయునా? కలికాలముయొక్క పాపములలో నిదియ ప్రధానము. చూడుఁడు, ఆరణ్యపర్వములోఁ గలియుగ ధర్మవర్ణనము (ఇక్కడ ధర్మ మనఁగా స్వభావము కాఁబోలు.)

"వైరమున నశేషవర్ణులు నన్యోన్య
పీడసేయుచును విభిన్నబుద్ధి
నొక్కఁ డొకని మేరనుండక వర్ణ సం
కరము సేయఁగలరు కలియుగమున."

మఱియు, "ద్రవిడాభీరతురుష్కబర్బరపులింద వ్యాప్తిదుష్ట" మగునఁట. క్షత్రియులు నశింతురు. బ్రాహ్మణులు వాణిజ్యము, వ్యవసాయముఁ జేతురు. చాలీచాల నందులకు "హేతుప్రత్యయవాద వి । చేతసులై వేదనింద" బ్రాహ్మణులే చేయుదురు. (వేదములఁ దిరస్కరించుట గోపదబ్రాహ్మణమునుండి వచ్చెడు సనాతనధర్మమేకాని నూతన సంస్కారము కాదు.) పురాణేతిహాసములలో వెదచల్లఁబడియుండు కలియుగప్రశంస చూచినయెడల నీ నిర్వచనము సప్రమాణ మని యొప్పుకొనక తప్పదు. విజాతీయదండయాత్రలు, బౌద్ధాదిమతములు, నిరీశ్వరవాదములైన సాంఖ్యాదిదర్శనములు, వేదముల ప్రమాణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నంగీకరింపని కొత్సని తర్కములు, న్యాయాదిశాస్త్రములు మొదలగు కారణములచే వర్ణధర్మములకు భంగము కలుగుచుండఁగా దానిని నివారించుటకుఁ బ్రయత్నించినవారిలో రాజరా జొక్కఁడై యుండె ననుట స్పష్టము. ఆదిపర్వమున సందర్భానుసారముగ వేంగీదేశమును వర్ణించుచు, దానియొక్క ముఖ్యవిభవము "శిష్టాగ్రహారభూయిష్ఠమై, ధరణీసురోత్తమాధ్వరవిధానపుణ్యాసమృద్ధమై" యుండుట యని నన్నయ తృప్తితోఁ దెలిపియున్నాఁడు. మాతృకలో లేని యీ విషయమును సంఘటించి యుండుటచేత నది యెంత ముఖ్యమైనదిగా భావింపఁబడి యుండవలయును! ఊహింపుఁడు.

హిందూపునరుద్ధరణము దాల్చిన తెలుఁగులు రెండు. పూర్వమీమాంసాపద్ధతి; వేదాంతపద్ధతి. వీని తారతమ్యముల వివరించుట ప్రస్తుత మనావశ్యకము. ఒక్కభేదము మాత్ర మీచర్చకు ముఖ్యము. పూర్వమీమాంసకులు యజ్ఞములు, హోమములు మొదలగు వైదిక క్రియలు అవశ్యానుష్ఠేయము లని గ్రహించిరి. అవి యాకాలమునకే యాచరణలో సామాన్యముగ లేకపోవుటచేతను, వానిని బునరాచరణమునకుఁ దెచ్చుట యసాధ్యమని తోఁచినందునను, వైదికక్రియలలో గ్రహింపఁబడిన బలివిధానము లహింసాధర్మమునకుఁ బ్రతికూలము లగుటచేతను, ఈ యహింసాధర్మము బౌద్ధమతప్రభావముచే సర్వవ్యాప్త మగుటయు, శంకరాచార్యులు మొదలగు వేదాంతులు వానికిఁ బ్రాధాన్యము నీయరైరి. ఎట్లును వేదములయందు మనకు భక్తి యున్నను, వైదికమత మేమో యెన్నిశతాబ్దములక్రిందనో నశించినది. ప్రకృతము మనము గమనింపవలసిన విషయ మేమనఁగా నాంధ్రమండలములో వ్యాప్తికివచ్చినది పూర్వమీమాంస, అనఁగా వైదిక క్రియానిరతి. హిందూపునరుద్ధారకులలో శంకరాచార్యులకుఁ బూర్వుఁడును, నతి ముఖ్యుఁడును నయినవాఁడు కుమారిలభట్టు. ఈతఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డాంధ్రుఁడు. ఈతఁడు ప్రసిద్ధికిఁ దెచ్చినది పూర్వమీమాంసాపద్ధతి. అట్లగుటఁ దెలుఁగుదేశములో నీతని పద్ధతిని విశేషముగ నవలంబించిరి. దీనికి దృష్టాంతము పై నుదాహరింపఁబడిన "అధ్వరవిధాన పుణ్యసమృద్ధి" మొదలగునవి. నన్నయభట్టియు "అవిరళజపహోమ తత్పరుఁడు" పరమవైదికి. ప్రకృత మభావసిద్ధిని వహించిన వైదిక క్రియ లాకాలమునఁ బునఃప్రచారమునకు వచ్చుట కారంభించెననియు, దీనికిఁ గారణభూతులలో ముఖ్యుఁడైన కుమారిలభట్టును ననుసరించిన వారిలో రాజరాజు నొక్కఁడనియు నా యూహ. ఈ యూహ రాజురాజుయొక్క చరిత్రమును విశదపఱుచుచున్నది.

మఱియు నీయూహ సరియైనపక్షమున "ఆంధ్రవాఙ్మయ మప్పుడేల సృష్టికి వచ్చెను? తత్పూర్వ మేల రాకయుండెను," అను సమస్యలను విడఁదీయును. నన్నయకుఁ బూర్వ మాంధ్రమునఁ బద్యరచన యుండెను; ఛందస్సు నుండెను. కావ్యములు మాత్రము లేవు! ఈవింత కేమికారణము? నన్నయకుఁ బూర్వము తెనుఁగునఁ గవిత్వమే లేదనియు నతఁడు మొట్టమొదట లక్షణముల నిర్మించి లక్ష్యములఁ దీర్చి వాఙ్మయమును సృష్టించెననియు నమ్మువారెవ్వరు నీనాఁటికిఁ గానరారు. "మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్" అనుమాట, కవుల సామ్రాజ్యమునకుఁ జేరిన యతిశయోక్తి; చరిత్రకారు లాదరింపఁ దగినది కాదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనము మొదలగు దృష్టాంతములచే నన్నయ సృష్టి రద్దుపడినది. అయినను "అతనికిఁ బూర్వము గొప్పకృతులు వ్రాయఁబడెనా? వ్రాయఁబడియున్నచో వానిగతి యేమయ్యెను?" అను ప్రశ్నములు తట్టకమానవు. వీని కేమి యుత్తరమిత్తము? "మహమ్మదీయులు తగులఁబెట్టిరి." అని పూర్వమన్నిసమస్యలకు నొకే యల్పసమాధానముతో దృప్తివడయుచుంటిమి. హేతువాదము ముదిరినయీకాలములో నది



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సరిపడ నేరదు. భారతము నన్నయ్యకుఁ బూర్వము తెనిఁగింపఁబడియుం డలేదు. ఉండినచో దా నుపక్రమించి యుండఁడు. ఇట్టియుద్గ్రంథమును వదలి చిల్లరపుస్తకములఁ గాల్చుకొనుచుఁ జలిఁ దీర్చికొనుచుండిరనుట హాస్యరసమునకు లక్ష్యము. మఱియుఁ దెనుఁగులోని మతగ్రంథములు సంస్కృతమాతృకలు గలయవి. తల్లులను విడచి కూఁతులను మాత్రము చెఱవట్టిరనుట వారికి లేని రసికత్వమును గల్పించుట. నాకుంజూడ నన్నయ్యకంటె ముందుగఁ దెనుఁగునఁ గావ్యరచన లేదని తోఁచుచున్నది. కారణములు :—

(౧) పూర్వము విద్యయనఁగా సంస్కృతవిద్య. అది మంత్రములరీతి బ్రాహ్మణాధీనము. క్షత్రియులకుఁ గొంతప్రవేశముండెఁగాని, యితరవర్ణులు విద్యాబహిష్కారము ననుభవించుచుండిరి. అగ్రవర్ణులు దేశభాషలయందును బ్రవీణులు. అయినను మతము మొదలగువిద్యలు హీనకులులకుఁ దెలియకుండునట్లు గోప్యముగనుంచి రక్షించుకోవలయునని యెంచి ప్రవర్తించుచుండినవారగుట, వారు సామాన్యముగ వాడుకలోనుండు భాషలో గ్రంథములు వ్రాయకయుండిరి. వారికి దేవభాషయ కాని దేశభాష పనికిరాదు. తుదకు దానశాసనములను నయితము తఱుచు సంస్కృతముననే కల్పించిరి.

అట్లయిన రాజరాజుకాలములోఁ దెనుఁగున భారతమువంటి ప్రమాణగ్రంథము, అనఁగా హిందూమతము ప్రకారము ప్రమాణమైనది, రచింపఁబడుట యెట్లు సంభవించెను? బౌద్ధులు, జైనులు, మొదలగు వేదనిరాకరణవాదులు తమతమ మతములలో జనులను జేర్చికొనవలయునను నుద్దేశముతో మాతృభాషలలో గ్రంథములు వ్రాసి వానికి వ్యాప్తిని బ్రసిద్ధిని బడసియుందురు. బౌద్ధులగ్రంథములనేకములు మాగధియను ప్రాకృతభాషలో వ్రాయఁబడియుండుట దీనికొక దృష్టాంతము. ఆంధ్రులలో ననేకులు బౌద్ధజైనమతముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవలంబించినవారై, బ్రాహ్మణమతమును విసర్జించి యుండుట సుప్ర సిద్ధము. అన్యమతముల నవలంబించినవారో, వానియం దభిమానము దాల్చినవారో యైనయీజనుల మరల హిందూమతములోఁ జేరువారిని గాఁ జేయవలయునన్నను, ఉండుహిందువులు తమవర్గమును వదలి పోకుండున ట్లుంచవలయునన్నను, దేశభాషామూలక ప్రచురణము లని వార్యము లయ్యెను. ఇదియ యాంధ్రవాఙ్మయసృష్టికి మూలకారణ మని నాయూహ. శ్రీ భావరాజు కృష్ణారావుగారు ప్రసంగవశమునఁ జెప్పినకొన్నియంశములు నాయందీభావములు పుట్టుటకుఁ గారణములు. ఇది సిద్ధాంతముగాఁ దేలినట్లయిన దానిగుణము కృష్ణారావుగారి కారోపిత మగునుగాక! తమమతమును రక్షించుకొనుటకును, దానితో పాటు అగ్రవర్ణుల యధికారము పదిలపఱుచుటకునై ప్రాచీనమతగ్రంథ ముల దేశభాషలలోనికిఁ బరివర్తింపఁజేసిరి. వర్ణాశ్రమపరాయణులును, దమవైరులు ప్రయోగించిన దేశభాషాప్రకటనాస్త్రమే తాము ను బ్రయోగింప వలసినవారైరి. ఇదియ కాఁబోలుఁ, ధోలుదొ ల్తన పంచమవేదమును స్పృశించుటకు హేతువు. అసలు వేదమైన ఋగ్వేద మును, దానిననుసరించి కల్పింపఁబడిన తక్కినమూటిని జనులకుఁ గనఁ బఱుచుట పాతకముకదా! పాతకముగాకున్నను లాభకరము కానేరదు. ఋగ్వేదమును విచక్షణతతోఁ జదివినవారు వర్ణధర్మముల నంగీకరింతు రనుట నిశ్చితార్థముకాదు. కావునఁ బంచమవేదమే ప్రయోజనకారి యైనకృతి. దానిన మొట్టమొదటఁ దెనిఁగించిరి.

ఇఁక బౌద్ధులు, జైనులు వ్రాసిన దేశభాషాగ్రంథము లేమాయెను? ఆమతములు దక్షిణదిక్కునకు వ్యాపించునప్పటికి వానికిఁ బాతభాష పావనభాషగా నేర్పడినందున బహుశః తెనుఁగున నెక్కువగ వ్రాయరై రేమో! వ్రాసిన కొన్నింటిని ఆమతస్థుల రూపుమాపినట్లే మనవర్ణ ధర్మరతక్షకులు ధ్వంసము చేసియుందురు. వేఱుకారణములు మృగ్యములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౨) నన్నయకు ముందునాళ్లలోఁ దెనుఁగుకృతులు లేవనియుఁ, జాళుక్యుల యాశ్రయమున నాంధ్రకవిత్వము (అనఁగా గొప్పగ్రంథముల రచన) సృష్టికి వచ్చెననియుఁ జెప్పుట కేయనుమానమునకుఁ బాత్రముకాని ప్రత్యక్షసాక్ష్యమే యున్నది. ఆసాక్ష్య మమోఘము. నన్నెచోడకవిశిఖామణి నన్నయకుఁ దరువాతివాఁడు. కాలమునుబట్టి చూచిన సమీపస్థుఁడు. తిక్కనకుఁ బూర్వుఁడు. బ్రాహ్మణేతరుఁ డౌటఁ దనస్తుతిని దరువాతికవులు చేయకున్నను, వానికాలనిర్ణయమున కిత రాధారములు కలవు. అతఁడు తనకుమారసంభవమున నిట్లు వచించి యున్నాఁడు.

క. మునుమార్గకవిత దేశం
బున వెలయఁగ దేశికకవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁజనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

"పుట్టించి" యనఁగా నూతనముగ సృష్టికిఁ దెచ్చియని యర్థము. ఇక్కడఁ జేర్కొనఁబడిన చాళుక్యరాజు, రాజరాజు గాక, యింకొకఁ డనుట యసాధ్యమైనకార్యము. పూర్వము సంస్కృత కవిత్వము వ్యాప్తిలో నుండెననియు, రాజరాజు మొదలగు చాళుక్యులు దేశి కవిత, యనఁగాఁ దెనుఁగుకవిత్వమును గృతిరచనను, బుట్టించి నిలిపి రనియు, నన్నెచోడునిసాక్ష్యము. (శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు పైపద్యములో "సత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్" అను పాఠాంతర మున్నదని వ్రాసియున్నారు. కాని వారేమాతృకనుబట్టి యట్లు వ్రాసిరో దానిని బండితుల శోధనకు యాచితులయ్యు నర్పింపరైరి. కాన వారిమాట విశ్వసనీయంబుకాదు.) కావున నాంధ్రకవిత్వమును బ్రచారమునకుఁ దెచ్చినవారు చాళుక్యులని స్పష్టమగుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నన్నయభట్టు, మన కాదికవి యని పారంపర్యముగా వచ్చుమాట సత్యము. ఉద్దేశము బ్రాహ్మణమతోద్ధారము.

ఈవాదమునకుఁ బోషకములైన మఱికొన్ని సంగతుల నివేదించెదను.

(౧) వర్ణధర్మములఁ గాపాడుటయం దనురక్తులై యుండవలయు నను నాశచే నేజాతియందుఁ బుట్టినవారైనను సరే రాజులైరేని, వారికి సూర్య చంద్ర వంశోత్పత్తిని గల్పించుట మన సంప్రదాయములలో నొకటి. శూద్రుఁడైన శివాజిని సయితము పట్టాభిషేకమునకు ముందు నాఁడు యజ్ఞోపవీతధారణము చేయించి, కాశినుండి దీనికొఱకు రప్పింపఁబడిన విప్రవర్యునిచే మంచి వంశావళిని సృష్టిచేసి క్షత్రియునిగా మార్చియుండుట చరిత్రములోఁ బ్రసిద్ధము. చళుక్యులకును ఈ మర్యాద తప్పినదికాదు. వారు చంద్రమండలమువఱకు వ్యాపింప వలసినవారైరి.

మహమ్మదీయులు వచ్చువఱ కిట్టితంత్రములచేత హిందూజాతి తనయైక్యమును, దార్ఢ్యమును రక్షించుకొనుచుండెను. హూణులు, పహ్లావులు, శకులు మొదలగు విదేశీయులను మనజాతిలోనికిఁ జేర్చుకొనుచుంటిమి. అట్లు చేరుట వారికిని లాభకరముగ నుండెను. ఎట్లన, క్షత్రియులుగా గణింపఁబడుట యొకటి; ఈదేశము నివాసభూమిగాఁ జేరినవారగుట దేశస్థులతోఁ గలసిమెలసి విప్లవములులేక యేలుట రెండు; హిందువులనమ్మిక ననుసరించి రాజులగుటతోఁగూడ దేవతలగుటయు సంభవించును గదా! దానిచేత వారికి గౌరవాధిక్యము కలుగుట మూఁడు. మహమ్మదీయు లన్యమతద్వేషులు. ఇంగ్లీషువారీదేశనివాసమును గోరరైరి. క్రైస్తవులగుట వారును జాతిప్రధానమైన మతమును వరింపరు. అట్లగుటఁ బూర్వ మెట్లెట్లో యుద్ధరింపఁబడుచుండిన దేశ మైక్యమును గోల్పోయినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మఱియు బ్రాహ్మణులయందుఁ జాళుక్యులకు భక్తి యెక్కువగ నుండవలయునని వారివంశస్థాపకుఁడు బ్రాహ్మణాశ్రయమునఁ బెరిగెనని యొకపురాణమును గల్పించిరి. త్రిలోచనపల్లవుఁ డనుమూలపురుషుఁడు యుద్ధములోఁ జావఁగా, వానిభార్య, గర్భిణి, కడపజిల్లాలోని 'ముడివేము' అను గ్రామమున విష్ణుభట్టు అనుబ్రాహ్మణునింట సురక్షితురాలై యుండి బిడ్డను గనెనఁట. ఆబిడ్డకుఁ గృతజ్ఞతార్థము విష్ణువర్ధనుఁ డనుపేరిడఁబడెనఁట. వాఁడు పెద్దవాఁడై పార్వతీదేవిని గుఱించి చళుక్యగిరిలో తపస్సుచేసి దివ్యసాధనములు వడసి శత్రువుల నోడించి రాజ్యము స్థాపించెనఁట. ఈకట్టుకథ నందంపూడిశాసనాదులయొక్క పీఠిక. విష్ణువర్ధనుఁడనుపేరును, "చళుక్య" యనుపేరును ఈవంశమునఁ బ్రసిద్ధములగుటచేత నాబ్రాహ్మణుని, ఆపర్వతమును వానింబట్టి సృష్టించిరని చరిత్రపాఠకులకు వేఱుగఁ జెప్పవలయునా ?

కాఁబట్టి భారతగ్రంథరచనయొక్క యుద్దేశము వర్ణధర్మరక్షణముగాక వేఱేమియుండును. భాషనే పరమార్థముగ భావించి సేవించుచిత్తప్రవృత్తి యాకాలమున లేదు. ఉండినచో మతగ్రంథములు తప్ప నితరము లేల వ్రాయఁబడక పోయినవి.

ఆంధ్రకావ్యరచన యప్పటికి నవీనసంస్కారమనుటకు మఱి కొన్ని ప్రమాణములున్నవి.

(౧) నన్నయ్యకు, శ్రీనాథునికి మధ్యస్థమైన కాలములో నప్పుడప్పుడు సకృత్తుగ నాంధ్రకావ్యములు వెలువడుచుండెనేకాని తదనంతరమట్లు పుంఖానుపుంఖములుగను నిరంతరధారగను రాలేదు. కారణమేమయియుండనగును ? ఆంధ్రకవిత్వము పూర్వాచారము కామియు, నూతన సంస్కారమగుటయు. మనవారు నవీనములపొంతఁ బోవరు, పాపమనిశంకింతురు. ఇదియకదా కారణము. తుదకు భారతము పూరింపఁబడుటకును ౨౦౦ ల సంవత్సరములు పట్టుట, గ్రంథము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్తియగుటకు మున్నే నన్నయ్య చచ్చుట, భారతరచనాపాపమున కారోపించియుందురు. తిక్కన పాపపరిహారార్థము కాఁబోలు యజ్ఞమునుజేసి పిమ్మటఁ బంచమ వేదములో మిగిలిన భాగమును దెనిఁగించుట కారంభించెను. ఎట్టిన తన పేరుపెట్టిన నెట్లో యని, నన్నయ్య పేరిట ఆరణ్యపర్వశేషము "తద్రచనయకాఁ" బూరించెను. వేదమను పేరువహిం చిన దానిని దెలుఁగుచేయుట యనఁగా నాకాలమువారి మతప్రకారము దోషముగాఁ దోఁచియుండునేమో? ఈనాఁటికిని సంస్కృత పాఠశాలలలో శూద్రులను జేర్చుట యక్రమమని యాక్షేపించు వైదికు లున్నారే! ఆనాఁటిగతి యేమిగానుండవచ్చును? తిక్కన్నయు జైనులు మొదలగు నాస్తికులతో, అనఁగా వేదముల నిరాకరించువారితో, వాగ్యుద్ధములు చేసినవాఁడని సోమదేవరాజీయమువలనఁ దెలియు చున్నది. అతఁడును వైదికక్రియలను, వర్ణధర్మములను ఉద్ధరించుటకే భారతమును దెనిఁగించియుండును.

(౨) ఆదికాలము కృతులన్నియు మతసంబంధములుగా నున్నవి.

(3) ఈగ్రంథము లన్నింటిలోను వర్ణధర్మములే ప్రధాన తత్త్వము.

పూర్వమీమాంసకులకుఁ గావలసినవి రెండు :—యజ్ఞములు, బ్రాహ్మణపూజ. వేదములకు మించిన "సత్తు" ఉండఁగూడదని కాఁబోలు, వారు, దేవుఁడుకూడ లేఁడు, వేదములు శాశ్వతములు, వేదములే సర్వమని సిద్ధాంతీకరించిరి. మఱియు నొక విశేషము. ఈగ్రంథములలోఁ బదేపదే "వేదముల నిట్లు చెప్పియున్నది, అట్లు చెప్పియున్నది" యని తమ యాదేశముల కన్నింటికి వేదము లాధారములని వ్రాయఁబడియున్నది. నిజము పరికించి చూచిన నూటికిఁ బదింటికైన వేదములలో నేయాధారము నుండదు. ఈ వేదఘోష ముక్కాలు మువ్వీసము నిరాధారమును, అసాక్షికమును. ఇట్లు వేద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముల నిచ్చవచ్చిన చోటులనెల్ల సాక్ష్యమునకుఁ బిలుచుట యప్పటి వారి కపాయములేని యుపాయము. జనులకు వేదములఁజూపరు, చెప్పరు. "అసలు" తమ యధీనము. వారు కల్పించిన "నకల్లు" నమ్మవలసినవారు జనులు!

వాదములకు, బహుశః అపవాదములకు, నాకరములైన చరిత్ర విచారణల నింతటితోఁ జాలించి క్రీడాభిరామమైన సాహిత్యగోష్ఠికిఁ గడఁగుదము.

నన్నయ్య కళాకౌశలమును గూర్చి యెందఱో వ్రాసియున్నారు. వారికంటికిఁ గనఁబడనివియు, వారిచే వర్ణింపఁబడనివియు నైన విలాసము లెన్నియో యుండవుకాఁబోలు! విమర్శనము శిల్పమునకు, శాస్త్రమునకు మధ్యవర్తియై, రెండింటియు గుణములు దాల్చినకళ. భావపూర్ణముగ నుండినచో శిల్పమేనాఁడును బ్రాఁతవడదు. చర్వితచర్వణము గానేరదు. సదా నవ్యముగ నుండును. ఏలన, భావములును, రసములును, బ్రతివ్యక్తియందును వేఱ్వేఱుగనుండును. వాని ననుసరించి రచించినయెడల నారచనయు వ్యక్తిత్వముఁ దాల్చియుండును. అయ్యది విశేషముగా నుండును, సామాన్యముగా నుండదు. సహజమును నకృత్రిమమును అగు రచన యనన్యసామాన్యము. కావునఁ బ్రతిరసికుఁడును దనతన భావముల ప్రకారము విమర్శించుట యధికప్రసంగము కానేరదు.

నన్నయ్యయొక్క శైలి మిక్కిలి మనోహరమైనది. అనన్యతుల్యము. దానివంటిది వేఱొండులేదు. సంస్కృతపదభూయిష్ఠమైయున్నను నర్థకాఠిన్య మేమాత్రము లేనిది. అతఁడుపయోగించు తత్సమము లితరు లనేకులు వాడు తెలుఁగుపదములకంటె శబ్దమునందును, అర్థమునందును సరళములు. సాధారణముగా సంస్కృతపదములను, సమాసములను బ్రయోగించువా రాడంబరములఁ బ్రకటింతురు; ఆ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పద్ధతికి ననుకూలించిన స్థలములమాత్ర మట్టిశైలిని వ్రాయుదురు. నన్నయ్యయొక్క జాలమేమనఁగాఁ దత్సమపదభూయిష్ఠమైన శైలికిని, మృదుత్వము మాధుర్యము మొదలగు కోమలములైన గుణములకును సంయోగము స్థాపించుట. ఈ మాహాత్మ్య మితని యందట్ల, ఎట్టి న్నలోఁ గలదు. నన్నయ్యలో సాంస్కృతికాన్వయములు తఱుచుగఁ గలవు. అవియును బద్యమును గంభీరముగ శబ్దించునట్లు చేయునేకాని విషయవైశద్యమునకు నర్థస్వాష్ట్యమునకు నేమాత్రము భంగకర ములు గావు. సులభగ్రాహ్యమైన, సాంస్కృతికశైలి కొక యుదాహర ణము :—

చం. అలఘుఫణీంద్ర లోకకుహరాంతర దీప్త మణిస్ఫురత్ప్రభా
వలిగలదాని శశ్వదుదవాస మహావ్రత శీతపీడితా
చలముని సౌఖ్యహేతు విలసద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిఁగెడు దానిఁగాంచి రరవిందనిభాననలమ్మహోదధిః.

(ఆదిపర్వము, ఆశ్వా ౨ ; పద్యము ౨౭)

భారతకవులలో శ్లేషయొక్క ప్రాపులేని పూర్ణోపమలు మెండు. మధ్యకాలపుఁ గవులలో నట్టి సందర్భముల శ్లేష నాధారముగాఁ జేసి కొనుట పద్ధతి :—

మ. అమితాఖ్యానక శాఖలంబొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థఫలమై ద్వైపాయ నోద్యానజా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై.

(ఆదిపర్వము, ఆశ్వా ౧ - పద్యము ౬౬)

మధ్యకవులు (అనఁగా రామరాజభూషణుఁడు మొదలగువారు) ఇట్టి వర్ణనచేసియుండిరేని బ్రాహ్మణులు, పక్షులు అని రెండర్థముల నిచ్చుపదములు మొదలగువానిని వాడి యుందురు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. సాత్యవతేయ విష్ణుపదసంభవమై విబుధేశ్వరాబ్ధి సం
గత్యుపశోభితం బయి జగద్విదితంబగు భారతీయ భా
రత్యమరాపగౌఘము నిరంతర సంతతపుణ్యసంపదు
న్నత్యభివృద్ధి చేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్.

(ఆదిపర్వము, ఆశ్వా ౧. పద్యము ౭౩)

తిక్కన్నయు నిట్టిపూర్ణోపమలను జిత్రించుటలో మిక్కిలి సమర్థుఁడు. భీష్ముని మరణమును విని ధృతరాష్ట్రుఁడు పలవించుఘట్టము చూడుఁడు :—

ఉ. అంచిత తాలకేతు కిరణాలి మెఱుంగులు గాఁగ, మార్వొ్రా
యించుట గర్జ చందముగ, నేచి విరోధిదవానలంబు మా
యించు శితాస్త్రవర్షమున, నిట్టిద భీష్మమహాభ్ర మెట్లడం
గించె నొకో శిఖండియనుకృత్రిమవాయువు దాఁకి యక్కటా!

(భీష్మపర్వము, ఆశ్వా ౧. పద్యము ౫౭.)

ఉ. వీరరసాంబుపూరమును విశ్రుతబాహుమహోగ్రసత్వమున్
జారుగదాధ్వజాచలవిశాలము, నంబకజాలవీచికా
స్ఫారము నైనభీష్ముఁడను సాగరముం గడవంగ నీఁదఁగా
నేరిమి యెట్లొకో కలుగనేర్చె శిఖండికి నేమిసేయుదున్.

(భీష్మపర్వము, ఆశ్వా ౧. పద్యము ౫౮.)

ఇట్లనుటచేఁ బూర్ణోపమలు ప్రశస్తములని నా యభిప్రాయము కాదు.

నాకుఁదెలిసినమట్టునకు భారతమున శ్లేష, యొక్కచోట మాత్రముపయుక్తమై యున్నది. దాని బాధ్యతఁ బూన వలసినవాఁడు నన్నయ్య. ఆ యొక్కచోట సభంగాభంగముల రెంటిని వేసి తన సర్వతోముఖచాతుర్యము ప్రకటించి యున్నాఁడు.

"కద్రువయు, వినతయు వినోదార్థంబు విహరించువారు *
* * ఉద్యానవనంబునుం బోలె బహువిద్రుమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లతాలంకృతంబైనదాని, నాటకప్రయోగంబునుం బోలె ఘనరసపాత్రశోభితరంగరమ్యంబైన దాని, దివంబునుం బోలె నహీమకరభరితంబైన దాని. ”

(ఆదిపర్వము, ఆశ్వా ౨. పద్యము ౨౪)

ఇతనికి బహువ్రీహిసమాసమునందుఁ బ్రీతి యెక్కువ; “ అతి ” యని చెప్పవచ్చును. ఇదియుఁ దా నుపయోగించునన్వయములమాడ్కి సంస్కృతపాండిత్యముచేఁ గలిగినవాసన. తుదకు వచనము వ్రాయు నప్పుడుకూడ “ అలబ్ధసన్నిధానుండ నైతి ’ నని బహువ్రీహిని దలుచు తడవుచుండును. సంస్కృతసంపర్కమువలనఁ గాఁబోలు సంబోధనము పద్యాది యందుఁగాని, యంతమందుఁ గాని యొక్కచోటఁ జేయక, కందమువంటి చిన్నపద్యములయందు నయితే మక్కడక్కడగా రెండు మూడు పర్యాయములు వాడును.

ఆ. వె. చనునె నీకు నిట్టిసాహసక్రియ సేయ
నెల్లవారికంటె నెఱుక గలవు
గురుభుజుండ! నాకుఁ గూర్తేని చేయకు
మయ్య యిట్టిచెయ్వు లనఘ! యిఁక.

(ఆరణ్యపర్వము, ఆశ్వా ౩. పద్యము ౩౭౪)

పద్యమునందంతట వెదచల్లఁబడిన శ్లేకార్థసూచకములైనపదముల ప్రయోగమున కొక దృష్టాంతము :—

“ * * అంతఁ దరుణి, పాంచాలి, బీభత్సు
కడకు నరుగుదెంచి కమలనేత్ర
యరిజయార్థ మరుగు నాతనియుత్సాహ
మెఱిఁగి యిట్టులనియె నిందువదన. ”

(ఆరణ్యపర్వము, ఆశ్వా ౧. పద్యము ౨౭౩)

కొన్నిచోట్ల నర్థగాంభీర్యము, శబ్దగాంభీర్యమును హెచ్చునట్లు “ పల్లవిగాఁ ” బదముల పునఃప్రయోగము సేయును. ఇది పునరుక్తి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోషము కాదనియు, మధ్యకవు లాసించిన యేకధ్వని గల శబ్దాడంబ
రము కాదనియు, పాఠకులు గ్రహింతురు :—

సీ. కమనీయ ధర్మార్థకామమోక్షములకు
నత్యంత సాధనం బయినదాని
వేడ్కతోఁ దవిలి తన్ వినుచున్నవారల
కభిమతశుభకరం బైనదాని
రాజుల కఖిలభూరాజ్యాభివృద్ధి, ని
త్యాభ్యుదయప్రదం బయినదాని
వాఙ్మనఃకాయ ప్రవర్తితానేకజ
న్మాఘనిబర్హణం బయినదాని

ఆ. వె. సత్యవాక్ప్రబంధ శతసహస్రశ్లోక
సంఖ్య మయినదాని సర్వలోక
పూజ్య మయినదాని బుధనుతవ్యాసమ
హాముని ప్రణీత మయినదాని.

(ఆదిపర్వము, ఆశ్వా ౩. పద్యము ౯)

మఱియు,

చ. బహువన పాద పాబ్ధికులపర్వత పూర్ణసరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్రసహస్ర ఫణాళిఁదాల్చి చు
స్పహితరమూర్తికిఁ జలధిశాయికిఁ బాయక శయ్యయైన, య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడుఁ.

చ. అరిది తపోవిభూతి నమరారులబాధలు వొందకుండఁగా
నురగులనెల్లఁ గాచినమహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకిమాకుఁ బ్రసన్నుఁడయ్యెడుఁ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపులప్రతాప సం
భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర
త్పావకతాపితాఖిలవిపక్షులు నైనమహానుభావులై
రావతకోటి ఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్.

ఉ. గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులన్ గురు
క్షేత్రమునం బ్రకామగతి ఖేలననొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదర్పపరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

.(ఆదిపర్వము, ఆశ్వా ౧. పద్యములు ౧౦౫-౧౦౭.)

ఈ పద్యములు సముద్రమట్లు గంభీరములు. కొందఱు విమర్శకులు ఎఱ్ఱాప్రెగ్గడ, తారచించిన ఆరణ్యపర్వశేషములో నన్నయ్య యొక్కశైలిని అనుకరించినాఁడనియు, నన్నయ్య ధోరణి యతని వ్రాతలో నద్దమునందువలెఁ బ్రతిబింబితమైనదనియు వ్రాసియున్నారు. ఈ భ్రమకు ఎఱ్ఱాప్రెగ్గడయే కొంతవఱకుఁ గారణభూతుఁడు. ఆరణ్యపర్వాంతమునఁ "దత్కవితారీతియుఁ గొంతఁ దోఁపఁ" దానును బూరించినట్లు వ్రాసికొనియుండుటఁజూచి, యా "కొంత" యను నుపాధిని మఱచి "పూర్ణముగా" నని సంకల్పించుకొన్నారేమో? రెండవది: నన్నయ్యను అనుకరించిన ట్లెల్లరకుఁ దెలియుటకై యాతనిపద్యములఁ గొన్నిటిని నిర్లక్ష్యములైన మార్పులతోఁ దనభాగమున వేసికొని యుండుట:—

చ. రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్ర సం
చయముల సంచలచ్చటులసైనికమత్స్యములన్ భయంకరం
బయి, యదు వృష్ణి భోజ కుకురాంధకవారిధియుం గలంగె ని
ర్దయతరరోషమారుత నితాంతసమీరితమై క్షణంబునన్.

(సభాపర్వము, ఆశ్వా ౨ - పద్యము 33)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్ర సం
చయములఁ జంచలచ్చటులసైనికమత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁ బొంగె బ్రస్ఫుర
ద్భయదమనోహర ప్రకటభంగులఁ దద్భటవార్ధి యుద్ధతిన్.

(అరణ్యపర్వము, ఆశ్వా ౬ - పద్యము ౫౮)

శైలి యనుకరుణమునకు ; నన్నయ్యవి :—

మ. నరచాపప్రవిముక్తదారుణ బృహన్నారాచధారల్ భయం
కరదైతేయ నికాయకాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధురధాత్రీధరతుంగశృంగ తటసందోహంబుపైఁ గప్పు దు
ర్ధరఘారాధరముక్త సంతతపయోధారావళిం బోలుచున్.

మ. పతదుర్వీధరధాతునిర్ఝరజలాభంబై మహాదేహని
ర్గతసాంద్రారుణపూర మెుక్క మెుగి నొల్కం ద్రెస్సి నారాయణో
న్నతదోర్దండవిముక్తచక్రనిహతిన్ నాకద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోరరణంబునన్ బడియె భూభాగంబు గంపింపఁగన్.

(ఆదిపర్వము, ఆశ్వా ౨ - పద్యములు ౨౩, ౨౪)

ఎఱ్ఱన్నవి :—

మ. అమరానీక విసృజ్యమాన బహుశస్త్రాస్త్రాహతిచ్ఛిన్న దే
హములై ఘోరమదేభముల్ బహులరక్తాంగంబులై తూలెఁ దీ
వ్రమహావాతనిపాతజాతరభసవ్యాధూత సంధ్యారుణా
భ్రములో నా నవశంబులై యొఱలుచుం బ్రత్యర్థి సైన్యంబులన్.

మ. పురుహూతాగ్రసర ప్రభూతబలసంభూతాస్త్రనిర్ధూతమై
తిరిగెన్ బమ్మరి దైత్యవాహినుల నుద్వృత్తాశ్వికశ్రేణి వి
స్ఫురితోత్పాతసమీరవేగవిముఖీ భూతాకృతిం దూలు భీ
కరరత్నాకరజాతసంతతతరంగవ్రాతముం బోలుచున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. గీర్వాణప్రవిముక్తబాణపటలక్రీడావిలాసంబులై
గర్వోన్నద్ధసురారిశీర్షములు వీఁకన్ డొల్లెఁ గల్పచ్ఛిదా
నిర్విద్ధాంబుదమండలోద్గతమహానిర్ఘాతపాతావధూ
తోర్వీభృద్ఘనగండశైలములతో నూహింపఁ దుల్యంబులై.

(ఆరణ్యపర్వము, ఆశ్వా ౫ - పద్యములు ౨౭౩, ౨౭౪, ౨౭౬)

అన్వయ సాదృశ్యమునకు :—

ఉ. ఏము తపంబు సేసి పరమేశ్వరు నీశ్వరుఁ బార్వతీమనః
కాముకుఁ గామవైరి నవికారుఁ బురాంతకుఁ బ్రీతుఁజేసినం
గామితదాయియైన శితికంఠుఁడు నిన్ను సృజించి యిచ్చె, ను
ద్దామదయావిధేయుఁడు ముదంబున మాకు నధీశ్వరుండుగాన్.

(ఆరణ్యపర్వము, ఆశ్వా ౬ - పద్యము ౪౩)

అన్నింటికైన నద్భుతమైన యనుకరణము ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన భాగములోని ప్రారంభపద్యములు. నన్నయ్యపద్యములతో సంపూర్ణముగ సమ్మేళించి యనవసితధారగా నొకేనోటినుండి ప్రవహించునట్లున్నది. నన్నయ్యయొక్క కడపటిపద్యము :—

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధ బంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరపూరితంబులై.

(ఆరణ్య, ఆశ్వా ౪ - పద్యము ౧౪౨)

ఎఱ్ఱన్నయొక్క మొదటిపద్యము :—

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరి వోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.

(ఆరణ్యపర్వము. ఆశ్వా. ౪. పద్యము ౧౪౩)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయినను సంపూర్ణమైనయనుకరణము రెండుహేతువులచేత నసంభవము. నన్నయ్య యొక్క ప్రతిభ యసాధారణము, దానివంటి మూర్తిని సృష్టింప నేరికిని దరముకాదు. ఇఁక నెఱ్ఱన్న యన్ననో, తానును సామాన్యుఁడు కాఁడు; అనిరోధ్యమైన సహజ ప్రతిభాశాలి; స్వతంత్రుఁడు. భావము ప్రధానమైనచోట్ల నసితరతుల్యమయినమార్గమున వెళ్లువాఁడు. ఆంధ్రరసికులయొక్క భాగ్యమే భాగ్యము, కవిత్రయమువారిని నొండురులతోఁ బోల్చి చూచుట కవకాశములుండుట వలన. ఇట్లనుటచే గురులఘుత్వనిర్ణయము సాధ్యమని యెన్నఁ బోకుఁడు. ఒకపువ్వుసొగసు వేఱొకపువ్వున కుండదు. రెండును సమానసౌందర్యములుగా నుండవచ్చును. ఇంచుమించుగ విషయము సామాన్యముగనుండుఘట్టముల వారు వ్రాసియున్నారు. వానిని బట్టి వారియొక్క కవితారీతులఁ గనుఁగొనవచ్చును.

నన్నయ్య ఎఱ్ఱన్నల పోలికల నరయుట కనువైనఘట్టము, కర్ణుని జననమున వానిని విడువవలసినవిధికై కుంతిచేయువిలాపము :—

నన్నయ్య :—

తరువోజ.

ఏల యమ్మునినాకునిచ్చె నిమ్మంత్ర మిమ్మంత్రశక్తియేనెఱుగంగ వేఁడి
యేలపుత్త్రకుఁ గోరి యెంతయు భక్తి నినుఁదలంచితి ప్రీతి నినుఁడును నాకు
నేల సద్యోగర్భమిచ్చెఁ గుమారుఁడేల యప్పుడ యుదయించె నింకెట్లు
లీలోకపరివాద మేనుడిగింతు నింతకు నింతయు నెఱుఁగరే జనులు.

వసంతతిలకము.

ఈబాలునెత్తికొని యింటికిఁ జన్నఁనన్నుఁ
నాబంధులందఱు మనంబున నేమనా ?

ట్టీబాలు సూర్యనిభు నిట్టుల డించి పోవం
గాబుద్ధిపుట్టు నని కన్య మనంబు లోనన్.

(ఆదిపర్వము, ఆశ్వా ౫ - పద్యములు ౨౭, ౨౮)

ఎఱ్ఱన్న :—

ఆ. వె. కొడుక నిన్నుఁ గాంచుకొఱఁత నోములకాని
పెంచి గారవించి పేర్మి నీదు
ప్రోవుఁ గుదువఁ గాంచుపుణ్యంబు దుదిముట్ట
నేల చేయనైతి నేను గుఱ్ఱ.

(ఆరణ్య ; ఆ ౭ - ప. ౩౮౨)

మ. నెఱయుం బున్నమచందురుం జెనయు నీనెమ్మోమునం దియ్యమై
చిఱునవ్వొప్పఁగఁ జూడనీక పులకల్ సెల్వొంద నిన్ గ్రుచ్చి య
క్కఱదీఱం బొరి నక్కునం గరము వీఁకంజేర్ప నీకెమ్మియిర్
వఱదం ద్రోవఁగఁ జేసెనే యకట దైవం బెందుఁజొత్తుఁ సుతా!

(ఆరణ్య. ఆ. ౭ ప. ౩౮౩)

సీ. ఏపుణ్యసతికి నీవింకఁ జేపడియెదొ
యెక్కడఁ బడియెదో యేనెఱుంగ
నేపుణ్యరాలొకో యిప్పుడు నినుఁ బుత్త్రు
గాఁ గాంచుటకు మేలికలను గాంచు
లలిఁబాంసుకేళి నల్లన నడపాడుచు
నవ్యక్తమధురవాక్యామృతంబు
వీనులఁ గురియుచు వెడఁదకన్నులఁ బిన్న
నవ్వును శుభలక్షణములు నమరఁ
దేజరిల్లు నిన్నుఁ దెఱవ యెవ్వత యొక్కొ
యడరఁ గ్రుచ్చి యురమునందుఁ జేర్చి
వేడ్క మిగిలి వేనవేలభంగులఁ గొని
యాడి యాడి ముద్దులాడుఁ గొడుక!

4

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. లాలితయౌవనోజ్జ్వలవిలాసమునం దిలకించి సుందరా
భీలవిచేష్టితం బమర భీమవనోద్భవ సింహరేఖ మై
వ్రాలవె యింక నీవెలమి వామవిలోచన లంగజన్మలీ
లాలసలై విపత్సులు భయాలసులై ధృతి యేది చూడఁగన్.
ఆ. వె. ఎచటనున్న నైన నెల్లప్పుడును నిన్నుఁ
గన్నులారఁ జూడఁ గాంచుఁగానఁ
దనయ నిన్నుఁగనిన తపనుండు గడుధన్యుఁ
డయ్యె మందభాగ్యనైతి నేను.
చ. ఇనుఁ డఱచేతమాటువడు టెన్నఁడుఁ గల్గునె నిన్ను నెమ్మి నేఁ
గనియెదఁ గాక యింక నొకకాలము నందయినం దనూజ, నీ
వినుతశరీరభావమును వీనుల నన్మణికుండలంబులున్
ఘనతరవజ్రవర్మముఁ బ్రకాశత నొందక యుండనేర్చునే.
చ. దివి భువి నంతరిక్షమున దిక్కుల గాడ్పున నగ్నియందు న
ర్ణవములయందు ఘోరవిపినంబులయందును నీకు నెల్లెడన్
శివమగుఁ గాక, దిక్పతులు సిద్ధులు సాధ్యులు రుద్రు లాశ్వినుల్
పవనులుఁ బుత్త్ర! నిన్నుఁగృపఁబాయక యెప్పుడుఁ గాచుచుండెడున్.
(అరణ్యా. ఆశ్వా ౭ - పద్యములు ౩౭౨-౭౫)

భావములు పొంగిపొరలినట్లుగా నన్నయ్యతక్కఁ దక్కిన కవులు వ్రాయుదురు. కష్టము లెన్నియున్నను గాంభీర్యమును వదలినట్లు నన్నయ్య, పాత్రములఁ బ్రదర్శింపఁడు. భావప్రకటన మమితముగాఁ జేయఁడు. మఱి వానిప్రవాహమున కడ్డుగ "గరువతనమను బలితంపుఁ గట్టఁ" గట్టియుంచును. దీనిచేత వానిభాగములోని స్త్రీపురుషులు గంభీరస్వభావులుగఁ గనఁబడుదురు. "గంగ పాఱుచుండుఁ గదలని గతితోడ ముఱికికాల్వపాఱు మ్రోఁతతోడ." నన్నయ్యయొక్క నాయికానాయకులు గంగవంటివారు. అగాధమైనభావమును దమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముచే నిగ్రహింపఁబడిన భావప్రకటనమును గలవారు. ఈ లక్షణము నన్నయపాత్రలయం దున్నంత సాంద్రముగ నితరకవులపాత్రలయందు లేదనినానమ్మకము. అట్లనుటచే నాయితరులకు లఘుత్వారోపణము సేతకాదు. పాత్రములప్రవృత్తి ననుసరించి భావప్రకటనము మితముగాఁ జేయవలయునో, యడ్డు హద్దు పద్దు లేని యనర్గళధారగాఁ జేయవలయునో నిర్ణయింపవలయు. జనమేజయుని గూర్చినయొకానొక సంభాషణములో "మితహితసత్యవాక్య" యని నన్నయ వ్రాసియున్నాఁడు. మితవాక్యుఁడుగా నుండుట గొప్పతనముగలవానిలక్షణమని నిరూపించుట కితరసాక్ష్యములును నున్నవి. తనపాలికి వచ్చినస్త్రీపాత్రములు నయితము గంభీరవర్తనములు. శకుంతల, దమయంతి మొదలగు మహాత్ములగరువతనమునకు, నన్నయ్యయొక్క మితభావ ప్రకటనలకు నెంతచక్కఁగ నన్వయము కుదిరెనో రసికు లాదరింతురు గాక.

నన్నయ్యతిక్కన్నలరీతులఁ బరామర్శించుట కనుకూలములైనఘట్టములు రెండు. ఒకటి, ఆదిపర్వములోని కణికుని రాజనీతియు, ఉద్యోగపర్వములోని విదురనీతియు. నాకుంజూడఁ దిక్కన యీసందర్భమున నన్నయ్యను నాదర్శముగా నిడికొని వ్రాసియుండునని తోఁచును. ఈరెండుఘట్టముల యసామాన్యలక్షణము లేవనఁగాఁ, గందపద్యము లెక్కువ. నీతికిఁ గంద మనుపానము గాఁబోలు! సొగసైన సామాన్యోపమానములు మెండు. ఉపన్యాసవిస్తరభీతిచే నాపద్యముల నిటఁ జేర్పలేదు. రెండవది, ద్రౌపది తాఁబడిన భంగపాటు కృష్ణునితోఁ జెప్పి మొఱపెట్టికొనుట :—

"వ. నీయంతఃకరణప్రవృత్తి కగోచరం బెద్దియు లేదయినను నాపడినపరాభవం బెఱింగించెద.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. పార్థివప్రభుఁడైన పాండుమహీపతి
కోడలనయి యుద్ధకుశలులయిన
పాండుతనూజుల భార్యనై పూజ్యుఁడ
వైన నీసఖియునై యధికశక్తిఁ
బరగు ధృష్టద్యుమ్ను భగినినై ధృతరాష్ట్రు
పట్టిచే సభఁ దలపట్టి యీడ్వఁ
బడి పాపకర్మచేఁ బరిధాన మొలునంగఁ
బడి దారుణంబైన పరిభవంబు
పడితి నట్టినన్నుఁ బాండవుల్ సూచుచు
నుండి రోరులువోలె నుక్కుదక్కి
యాపగాతనూజుఁ డాదిగాఁగలవృద్ధ
బంధుజనులు సూచి పలుకరయిరి.

క. శరణనినవారిఁ గరుణా
కరులయి రక్షించుపురుషకారాన్వితులే
శరణని యఱచిన నాలిం
పర, భీమార్జునుల బాహుబల మేమిటికిన్.

వ. భ్రాతృపుత్రబంధుజనంబులు నాకుంగలిగియు లేనివారయి రట్టిమెడం గర్ణుండు నన్నుం జూచి నగియె.

ఆ. వె. కర్ణునగవు లోకగర్హితుండఁగు దుస్స
సేను చెయిదికంటె శిఖియ పోలె
నడరి నామనంబు నతిదారుణక్రియ
నేర్చు చున్నయది మహీధరుండ.

వ. తొల్లి వేదాధ్యయనంబు సేయుచు బాలకేళీవినోదంబున నున్న కాలంబునఁ ప్రమాణకోటియందు సుప్తుండయిన భీమసేను నంటఁగట్టి గంగమడువునం ద్రోపించియు, విషంబుఁ బెట్టియు విషసర్పం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బులం గలిపించియు, జననీసహితులైన యేవురను వారణావతంబున లక్కయిల్లు సొనిపి యందు దహనంబుఁ బ్రయోగింపం బంచియు ననేకంబులయిన యపకారంబులు సేసి యిప్పుడు దుర్యోధనుం డధర్మ ద్యూతంబున రాజ్యంబు నపహరించి రాజలోకసమక్షంబునం దమ్ము నిరాకృతులం జేసినను బరాక్రమ పరాఙ్ముఖులైన పాండవులు నాపరిభ వంబు నెట్లుదలఁగెద రని బాష్పధారాస్నపితపయోధరయయి పాణి పల్లవంబుల నయనసమ్మార్జనంబు సేయుచున్న పాంచాలిం జూచి వాసుదేవుండిట్లనియె.

(ఆరణ్య, ఆశ్వా ౧-పద్యము ౧౩౬, ౧౪౦)

ఇఁకఁ దిక్కన్నరీతి యెట్టిదనిన :—

చ. వరమునఁబుట్టితిన్ భరతవంశముఁజొచ్చితి, నందు పాండుభూ
వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి నీతి విక్రమ
స్థిరులగు పుత్రులన్ బడసితిన్ సహజన్ముల ప్రాపుఁ గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్.

ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టిననుఁ బంకజనాభ యొకండు, రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణిఁబట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చె కులాంగన లిట్టి దోర్తురే.

(ఉద్యో, ఆశ్వా ౩-ప. ౧౦౭, ౧౧౦)

భావప్రకటనమున ఎఱ్ఱన్నకు నన్నయ్యకు నుండుతారతమ్యమే తిక్కన్నకు నన్నయ్యకు నుండునట్లున్నది. తిక్కన్నయొక్కద్రౌపది డగ్గుత్తికతో వెక్కి వెక్కి యేడ్చుచు మనకు దుస్సహసంతాపముఁ గలిగించుచున్నది. నన్నయ్యయొక్కద్రౌపది ప్రయత్నించి తన్నుఁ దానుపశమించుకొనుచుఁ దనకు నాపరాక వెలికి వచ్చిన శోకము మాత్రము సూచుచు నాపెయొక్కగరువతనముచే మనమెప్పు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాకర్షించెడును. మఱియుఁ దనచింతతోఁ బ్రారంభించినను భీమసేనునికిఁ దక్కినభర్తలకును గలిగినకష్టములను మఱవలేదు. "పాణిపల్లవంబుల నయనసమ్మార్జనంబు సేయుచు" ననువర్ణనము ద్రౌపదీదేవియొక్క పరివేదనాత్తమూర్తిని మనకండ్లయెదుట సాక్షాత్కరింపఁ జేసెడును గదా! ఎట్లును శృంగారము, శోకము మున్నగురసముల వర్ణించుటలో మహాకవులైనకవిత్రయమువారు మొత్తముమీఁద మితము ననుసరించి చిత్రింతురు. విపరీతపుమాటలకుఁ జేష్టలకు నెడమియ్యరు. కీచకుని కామము వర్ణించుటలోఁ దిక్కన పచ్చిగావ్రాసియున్నాఁడు. కాని యది వానినీచతను విశదపఱుచుటకని తానే తెలిపియున్నాఁడు. కవిత్రయము వారిపాత్రము లాత్మనిగ్రహములేని మృగప్రాయములుకావు. తిక్కన్న ఎఱ్ఱన్నల తారతమ్యనిరూపణమునకుఁ బనికివచ్చుఘట్టములు కొన్ని యున్నవి కాని వానిప్రశంస కిటఁ బ్రవేశము లేదు.

నన్నయ్య "గురుపద్యవిద్యకు నాద్యుఁ" డగుట కాదు, గద్యవిద్యకు నాతఁడాద్యుఁడు. ఆంధ్రమున వచనము నితఁడువ్రాసినంత మనోహరముగ వ్రాసినవా రొరులు లేరు. చిన్నయ్యసూరి యితనిఁజూచియె తనరమణీయమైనమిత్రలాభమునురచించియుండు నని తోఁచెడిని. ఈ క్రిందియుదాహరణముల శైలినిజూడుఁడు. మిత్రలాభముయొక్క మాతృకలిట్టివి :—

"వ. అని దీనవదనుండై యాక్రోశించువానికి నాకాశంబున నుండి యొక్కదేవదూత యిట్లనియె నయ్యా! కాలవశంబయిన నెవ్వరికిం దీర్పఁదరంబుగా, దొక్కయుపాయంబు గలదు. చేయనోపుదేనిఁ జెప్పెద వినుము. నీయాయుష్యంబునం దర్థం బిక్కన్యకిమ్మనిన రురుం డట్లచేయుదు నని తనయాయుష్యంబునం దర్థం బక్కన్యక కిచ్చిన నక్కోమలి దొల్లింటి కంటె నధికశృంగారసమన్వితయై విషనిర్ముక్తయయ్యె; నట్లు దేవదూత ధర్మరాజానుమతంబునఁ దనచెప్పినయుపా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యంబునం బ్రమద్వరను బంచత్వంబు వలనం బాపె. రురుండును దాని వివాహంబై యిష్టోపభోగంబుల ననుభవించుచు నుండె."

(ఆదిపర్వము, ఆశ్వా 1 - 119)

"వ. అయ్యా! నీవు బ్రాహ్మణుండవు. భృగువంశసముత్పన్నుండవు. సర్వగుణసంపన్నుండ, విదియేమి దొడంగి తిట్టి దారుణక్రియారంభంబు క్షత్త్రియులకుం గాక బ్రాహ్మణులకుం జనునే? బ్రాహ్మణు లహింసాపరు, లొరులు సేయుహింసల వారించు పరమకారుణ్యపుణ్యమూర్తులు, జనమేజయుండనుజనపతి చేయు సర్పయాగంబునందుఁ గద్రూశాపంబున నయ్యెడుసర్పకులప్రళయంబును భవత్పితృశిష్యుండయిన యాస్తీకుండను బ్రాహ్మణుండ కాఁడె యుడిగించె నని చెప్పి సహస్రపాదుండు రురునకు సర్పఘాతంబునం దుపశమనబుద్ధి పుట్టించె ననిన విని శౌనకాదిమహామును లక్కథకున కిట్లనిరి."

(ఆది. ఆశ్వా 1 - 125)

వీరిగద్యముయొక్కమాధుర్య మవచనీయము. అర్థపుష్టియు మృదుత్వమును, ఇట్లుసంయోగించి యుండుట నేనింకెయ్యెడనుగాన. మృదుత్వ ముండుచోట నర్థ మబలముగానుండును. అర్థము ఘనమైన చోట్ల శైలి గడుసు వాఱును. ఈకొఱంత భారతకవులలోను, నన్నెచోడునిలోను గాన్పింపదు.

వీరేశలింగము మొదలగువిమర్శకులు కొందఱు ఆరణ్యపర్వము నందు శైలి బలము తగ్గియున్నదనియు, నవసానకాలముయొక్క లక్షణము లందుఁ గానఁబడుచున్నవనియు వ్రాసినారు గాని యుదాహరణములఁ జూపరైరి. "లోకో భిన్న రుచిః" నేను నావల్లనైనంత యక్కఱగాఁ జదివితిని గాని ఆరణ్యపర్వమున క్షయలక్షణము లెవ్వియుఁ నాకుఁ గనఁబడలేదు. ఆదిపర్వముయొక్క కడపటిభాగములలోను, సభాపర్వములోను నీరసమైనపద్యము లక్కడక్కడ నున్నవి. పదముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూర్పుబిగువు తప్పినస్థలములు కలవు; మదితప్పినమాటలు లేక పోలేదు. దోషవిచారము మంచిదికాదు. కావునఁ గొన్ని నిదర్శనములతో దీనిని వదలెదను.

(౧) చ. ధరణి నతిప్రతాపబలదర్పములన్ విన నేనపెద్ద నె
వ్వరికిని మఱి భయంపడనివాఁడ, భయార్తుఁడనైతి నిప్డు పం
కరుహదళాయతాక్షి దయఁగావుము నన్ను భవన్నిమిత్తదు
ర్భరతరపంచబాణహతిఁ బంచతఁ బొందక యుండునట్లుగాన్.
(ఆదిపర్వము, సప్తమాశ్వాసము ౭౯)

(౨) "పుష్పమాల సేతఁ గొని పుష్పసాయకు కుసుమేతరంబైన" ఎన్నిపుష్పాలు! "ధవళాక్షి రంగమధ్యంబునఁ దనుమధ్య తానొప్పి పాంచాలతనయయున్న" రెండుమధ్యలు; ఏకార్థవాచకములు మూఁడు! ఈ పద్యము నందే ద్రౌపది "అమలినాంగి" యని వర్ణింపఁబడియున్నది.

(ఆది. ఆశ్వా ౭-౧౬౭)

(3) కర్ణార్జునుల ద్వంద్వయుద్ధఘట్టమున అర్జునుఁడు చెప్పుచున్నాఁడు,

"ఏను నీచెప్పినవారిలో నెవ్వఁడఁ గాను. కానీన......" అని.
(ఆది, ఆశ్వా ౭ - ౨౦౨)

కానీన! యనఁగా కన్యాకుమారా! యని యర్థము. కర్ణుఁడు కానీనుఁ డగుట అర్జునున కావేళ కెట్లు తెలిసెను? ఇది సందర్భశుద్ధిలేని సంబుద్ధి. తిక్కన్నయందు విఱుపు లుండవు—శైలియందుగాని, విషయమందుగాని.

ఆరణ్యపర్వముశైలి బహుపక్వముగ నున్నదని నాయభిప్రాయము. ఇందుఁజేయఁబడియుండు ప్రకృతివర్ణన లనితరసాధ్యములు. ఈవిషయము "కవిత్వతత్త్వవిచారము" న విపులముగఁ బ్రశంసింపఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడియున్నది. సౌగంధికహరణము, నలోపాఖ్యానము మొదలగు మహోత్తరఘట్టము లుండుభాగమిది.

నన్నయ్య తన సీసపద్యములఁ దఱుచుగ ఆటవెలఁదులతో ముగించును. గీతము వాడుట యరిది. ఆటవెలఁదుల మీఁద వేమన్నకు నితనికి నుండిన యభిమాన మింకేకవులకును లేదు. తరువోజ, అక్కరలు మొదలగు ప్రాఁతతరహా పద్యములు నన్నయ్యకు వెనుక నంతగ వాడుకలో నిలువక పోయినవి. వానియొక్క శ్రావ్యతను దలఁచుకొంటిమేని యిట్లేల యాయెనో యని వితర్కింప వలసినవార మాదుము.

నన్నయ్య కవిత్వముయొక్క జీవకళ యెయ్యది? అనఁగా నేగుణము తక్కిన యవయవముల కన్నింటికిఁ జైతన్యమును, దేజస్సును నిచ్చి ప్రధానతత్త్వమై శోభిల్లుచున్నది? నాకుఁ జూడ గాంభీర్యము. గాంభీర్య మనునది యితనిశైలియొక్క ప్రాణము. అట్లనుటచే శైలి యేకగతిని వహించిన దనుట కాదు. సందర్భానుసారముగ నన్నయ్య యొక్కశైలి మనోహరముగ మాఱుచుండును. అయినను గాంభీర్యమును వదలదు. ఇతనిశైలిని మూఁడుజాతులుగా విభజింపవచ్చును:—

(౧) ఆఖ్యానశైలి—అనఁగా నిట్లిట్లు జరిగెనని వృత్తాంతములఁ జరిత్రకారునట్లు వ్రాయుట. ఇది రసప్రధానము కానేరదు. ఎండినట్లుండును.

(౨) పాత్రల సంభాషణలు—ఇవి యెంతయు సహజములు; కావున హృదయరంజకములు. ఒక్క బకాసురఘట్టము నం దెన్ని మనోహరములైన పద్యములున్నవో చూడుఁడు:—

సీ.........ఇక్కన్య యతిబాల యిందుద్భవంబగు దౌహిత్ర లాభంబు దలుఁగనెట్లు

ఆ. వె. దీనిఁ బుత్తు, నటె మదీయపిండోదక
నిధిఁ దనూజుఁ గులము నిస్తరించు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానిఁ బితృగణంబువలనిఋణంబుఁ బా
చిన మహోపకారిఁ జిఱుతవాని.

ఆ. వె. ఎట్టు సూచి చూచి యిది పాప మనక య
య్యసుర వాతఁ ద్రోతు సదయ వృత్తి,
నరిగి యేన యిప్పు డసురకు నాహార
మగుదు వీరిఁబుచ్చ నగునె నాకు.

(ఆది, ఆశ్వా ౬-౨౧౧, ౨౧౨)

కూఁతురు తన్నుఁ బంపుఁడని పితరులతోఁ జెప్పుమాట—

ఆ. వె. ఒలసి యెంతకాలముండిన నేను మీ
దానఁగాన యొరులధనమ, నన్ను
నెన్నఁడయిన నొరులకిచ్చుచో నసురకు
భోజనముగ నిచ్చి పుచ్చుఁ డిపుడ.

(ప. ౨౬౦)

తే. గీ. బాలకుం డొక కొండుకకోల చేతఁ
బట్టికొని యేన రక్కసుఁ గిట్టి చంపి
చులుక వత్తు మీరేడ్వఁగా వలవ దనుచుఁ
గలయ నూరాచ్చెఁ దనతొక్కుఁబలుకులొప్ప.

(ప. ౨౬౩)

ఇట్టి వెన్నియో యీఘట్టమున నున్నవి. ఇతరఘట్టము లందును నీవిషయమున నేకొఱఁతయును లేదు. శైలి యకృత్రిమముగ నుండుటయ కాదు, పాత్రలయాకృతుల నెదుటఁ నిలుపఁగలఁడు. సంభాషణ సమయముల సాంస్కృతికశైలి ప్రక్షిప్తమౌను, సహజములైన తెలుఁగు మాటలు మెండుకొనును.

(3) ప్రకృత్యాది వర్ణనలు—ప్రకృతివర్ణనమున నితఁడును, ఎఱ్ఱన్నయు నగ్రగణ్యులు. ఆరణ్యపర్వములోని గంధమాదనయాత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదలైనఘట్టములఁ దిలకింపుఁడు. వీరివర్ణనలలోని విశేషమేమనఁగా వానిని నిరలంకారములుగాఁ దీర్చియుండుట. ఇది యత్యద్భుతమైనశక్తి. ఎఱ్ఱన్నయొక్క ప్రకృతివర్ణనప్రభావము తెలియవలయునన్న హరివంశమును జిత్తగింపుఁడు. అన్నిరీతులశైలులును గాంభీర్యమయములు. వీరినాయికలసంభాషణలు గరువతనము గలయవి. శృంగారముకూడ గౌరవభావముతో సమన్వితము. గౌరవబుద్ధిలేని మోహము తుచ్ఛమును క్షణికమును. అట్టి దిందు మృగ్యము. శకుంతల, దమయంతి మొదలగు స్త్రీలనుగూర్చి చదువునపుడు ఆకారముతోఁ గూడ వర్తనమును, గుణములు, మనస్సు నాకర్షించును. ప్రీతితోడ భక్తియు స్ఫురించును. ప్రేమతోడఁ బూజయుఁ బుట్టును. భారతస్త్రీలు క్రీడాగారపరికరములు కారు. మనుష్యప్రకృతిలోని దేవత్వమును బ్రకాశింపఁజేయువారు.

గాంభీర్యము ప్రధానగుణ మనియెంచుటకు ఎఱ్ఱాప్రెగ్గడవంటి మహనీయుఁ డాధారము. అతఁడు నన్నయను భద్రకుంజరముగాను, వానిశైలి నిరంకుశగతి కలదియనియు సుప్రసిద్ధమైన యీక్రింది పద్యమునఁ దెలిపియున్నాఁడు.

ఉ. ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్ననిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్.

(హరివంశము.)

గాంభీర్యగుణశోభితములైన ఘట్టము లెన్నియో నన్నయ కృతియందుఁ గలవు. ముఖ్యముగా నేఁటియుత్సవమునకు నాయకుఁడైన రాజరాజును గూర్చిన ప్రశంసలును నట్టివయగుట వాని నారయుదము:—

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందు చంద్రికా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజితసర్వలోకుఁ డపరాజిత భూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.

కం. విమలాదిత్య తనూజుఁడు
విమల విచారుఁడు గుమారవిద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమ విహితశ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్.

చ. ఘనదురితానుబంధ కలికాలజ దోషతుషారసంహతిం
దన యుదయప్రభావమున దవ్వుగఁ జోపి జగజ్జనాను రం
జనమగు రాజ్యసంతత వసంతనితాంతవిభూతి నెంతయుం
దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మనిబద్ధ దయార్ద్రబుద్ధియై.

ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునర్థ మనీషివి
ద్యాశ్రమ తత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్.

(ఆది, ఆశ్వా ౧ – పద్య ౩_౭)

వీనియందును విపరీతాతిశయోక్తులు లేవు. వర్ణనములు సత్య సామీప్యములు. సత్యవిదూరములైనవి కృత్రిమములుగఁ దోఁచును. రసోత్పత్తి కవి తగవు.

కవియొక్కస్వభావమునకును, వానిరచనయొక్క రీతికిని సంబంధము లేక పోలేదు. తిక్కన్నను గుఱించి కేతన చేసిన నిరూపణమును జదివినవారికి, నట్టివాఁడు గాక తక్కొరుఁడు విరాటోద్యోగపర్వముల వ్రాసియుండఁ జాలఁడని తోఁపకమానదు. అట్లే నన్నయ్యయొక్క శైలి గాంభీర్యమునకు మూలము, వానిస్వభావగాంభీర్య మని చెప్ప వచ్చును. ఇతఁడు గంభీరస్వభావుఁ డనుటకుఁ గలకారణము లెవ్వి యనిన :—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౧) గాంభీర్యము వినయముతోఁ గూడుకొనియుండును. సముద్రమును గంభీరమందుము. ఏల ? అగాధమును, అనంతతరంగజాలమును నైయున్నను గట్టను మీఱి పొంగదు. తీరమునకు విధేయమై దానిచేతఁ బంధింపఁబడినదిగాఁ దోఁచును. మితిలేకున్న గాంభీర్యముండదు. నన్నయ మహావినయపరుఁడు. మనలోఁ బండితు లాత్మస్తుతిపరాయణులుగను, నీర్ష్యాళువులుగను బహుళముగ నుండుట శోచనీయమైనసంగతి. గ్రంథాదిని "నేను నేను," అని యుత్తమపురుషగా నాత్మవర్ణనము జుగుప్స కలుగునట్లు చేయువారు. నన్నయ్య తన్నుఁగూర్చి చెప్పికొన్నపద్యమొక్కటే. అందును బ్రథమపురుషముగా నెవ్వఁడో త్రోవను బోవువానిని గుఱించి వ్రాసినట్లు వ్రాసియున్నాఁడు. అతిశయోక్తి లేదు. విపరీతవర్ణనలు లేవు. అహంకారములేదు.

సీ. తనకులబ్రాహ్మణు ననురక్తు, నవిరళ
జపహోమతత్పరు, విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్య రచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు

ఆ. వె. నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ.

(ఆది. ప్రథమ. ప. ౮)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృతి రచింపుమని రాజు వేడికొనఁగాఁ దనబలము తానెఱుఁగని హనుమంతునివలె నాచేత సాధ్యమా యని,

చ. అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము
ద్రము దఱియంగ నీఁదను విధాత్రునకైనను నేరఁ బోలునే.

అని సంశయాత్ముఁడై వితర్కించి,

"అయినను దేవా! నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద" నని యిష్టదేవతాస్తుతికిఁ బ్రారంభించెను. తెనుఁగున నేకావ్యముయొక్క భూమికయు సత్యవిస్ఫురణయందును మితవాక్యప్రయోగమందును దీనికి దీటురాదు.

(౨) మఱియు గంభీరుఁడు గాన నన్నయ్య ఈర్ష్యావంతుఁడు గానేరఁడు. దీనికి నిదర్శనము తాను హృదయపూర్ణముగఁ దనకు సహాయభూతుఁడైన నారాయణభట్టును గుఱించి చేసినప్రశంస—

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణు నట్లు వాసిగ ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతస్థితిఁ దోడయి నిర్వహింపఁగాన్.

(ఆది. ప్రథమ. పద్య. ౨౬)

నందంపూడి శాసనములోను వానిని వర్ణించినవిధానము "సంస్కృత కర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషా సుకవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన..." "కవీభవ[బ్రాం]కుశనామసార్థమ్....." "సకలజగదభినుతగుణశాలినే సరస్వతీ కర్ణావతంసా యాష్టాదశావధారణచక్రవర్తినే......"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒకానొకరు భారతములోనిపద్యమును స్తుతినిందాలంకార మనియుఁ గృష్ణుఁడేమియుఁ జేయక యుండినట్లే నీవు నుంటివనుధ్వని యున్నట్లు వ్యాఖ్యానము చేయవచ్చుననియుఁ జెప్పిరి. సమకాలికులగు గొప్పపండితులతో వివాదము నావంటివానికిఁ దగదుగాన నేనేమియుఁ జెప్పఁ జాలను.

నన్నయ్య యోర్వలేనితనము కలవాఁడని వదంతిలో నుండు కథలన్నియు బూతులు. అతఁడు నిజమైనవైదికి, పరచింత యెక్కువ యైనవాఁడు.

ఇట్టిమహనీయుఁడు కవిత్వమందపేక్షించినసిద్ధులెవ్వి ? వానిని గడించెనా ? ఆదిపర్వములోని ప్రథమాశ్వాసమున ౨౫వ పద్యమును బరికించిన "అక్షరరమ్యత" ఒకటి ; దానికంటెను శ్రేష్ఠమైన "ప్రసన్న కథాకలితార్థయుక్తి" రెండు. కథ సాక్షాత్కరించినట్లు చేయుశిల్ప నైపుణి యితఁడు చూపెనా ? అట్లు సాక్షాత్కరించినమూర్తిని మనో హరమైనశైలియను వస్త్రమును ధరించినదిగాఁ జేసినాఁడా ? తనకథ సొగసైనబహిరాకారమును, సత్త్వగరిష్ఠమైనజీవకళను గలదిగాఁ దీర్చి నాఁడా ? ఈప్రశ్నల కన్నింటికి నుత్తర మొక్కటియ—నిస్సందేహ ముగ, విస్పష్టముగ నంతర్బహిఃకళల రెంటిని సాధించె ననుట.

ఆకాలమున బౌద్ధజైనమతములు ప్రభావవంతములుగా నుండె ననుటకును, వానిని మనపండితులు లెక్కకుఁ గొన్నారనియు నరసితిమి కదా! ప్రాకృత పైశాచీ భాషలు వేంగిలోఁ గృషి చేయఁబడుచుండి నట్లు శాసనములవల్లఁ దెలియ వచ్చెడిని. వానియందుఁ దఱుచు వ్రాయఁబడినగ్రంథములు వేదనిరాకరణమతములకుఁ జేరినవి. మఱియు బౌద్ధులలో "సంఘం శరణం గచ్ఛామి" యనునాదేశము ప్రకారము సభాస్తుతి సేయుట యాచారముగా నుండెను. నన్నయ్యయు నాపద్ధతి ననుసరించియే ళాఁభోలు సభాస్తుతి సేసి యున్నాఁడు. ఇంకే తెలుఁగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కవియుఁ జేసినట్లు కానము. ఈవర్ధంతి కొఱకునై యిచ్చటనాసీనమై యున్నమహాసభయు సర్వవిధముల సేవ్యము కావున నాపద్యము నిటఁ బొందించెదను.

చ. పరమవివేకసౌరభవిభాసితసద్గుణపుంజవారిజో
త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణములైన సత్సభాం
తరసరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్.

(ఆది. ప్రథమ. ప. ౨౪)

నేనును ఈమహాసభ నభినందించుచు విరమించువాఁడను.

రాజమహేంద్రవర మానాఁడును ననేకకవులకు వాసస్థానముగా నుండెను. "రాజమహేంద్ర కవీంద్రసమాజసురత్నరాజ" యని యొకానొక రాజరాజసంబుద్ధి. "ఆనాఁడును" అని యనుటచే "నీనాఁడు" మీయూరు కవిసమృద్ధమగుట యేర్పడును. అందులో నొకవిశేషము—ఈవర్ధంతిసమయమున నిచ్చట నాసీనులై భారతము నెక్కువపూర్ణముగ బహుచక్కనిశైలితోఁ దెనిఁగించుచుండెడు శ్రీకృష్ణభారతకర్తలు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారుండుట, యొక్క సందర్భశుద్ధియే కాదు, ఈయుత్సవమునకు శోభావహమును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨

# కళాపూర్ణోదయము

## పీఠిక

(కవిత్వతత్త్వవిచారమునుండి సంగృహీతము)

కళాపూర్ణోదయము రచించినమహాకవి పింగళి సూరన్న. ఇతఁడు శ్రీకృష్ణదేవరాయలకాలమునకుఁ దరువాతి వాఁడు; ప్రాయశః రామరాజభూషణకవికిఁ బూర్వుఁడు; మఱియు నింగ్లాండుదేశములోని కవులలో నగ్రగణ్యుండైన షేక్స్పియరునకు సమకాలికుఁడై యునికియు సుసాధ్యమే.

ఆకాలమున నాంధ్రదేశమునఁ బ్రబలముగా నుండినకవితారీతి, ప్రబంధరచన. ప్రబంధకవులకు మధ్యకవులనియుఁ బేరు గలదు.

పింగళి సూరనార్యుఁడు మధ్యకవులకుఁ జేరినవాఁడు గావునఁ బ్రాచీనగ్రంథములను, ముఖ్యముగా భారతమును, బహుశ్రద్ధతోను, భక్తితోను బఠించియుండును. ఇందులకమ్మహేతిహాసములోని గుంభనల జ్ఞప్తికిఁ దేఁ జాలినంతసాదృశ్యముగల రచనలఁ దాఁ జేసియుంట యొకసాక్ష్యము. చూడుఁడు:— *

కణ్వాశ్రమవర్ణనావసరమున నాదిపర్వములోని:—

సీ. "శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడుశుకములచదువుదగిలి
కదలక వినుచుండు కరులును గరికర
శీతలచ్ఛాయఁదచ్ఛీకరాంబు

* నాకవిత్వతత్త్వవిచారమునందలి ముఖ్యాంశములు మాత్రమిం దెత్తఁబడినవి. విస్తరముగా నందుఁ జూడఁదగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కణముల చల్లనిగాడ్పానపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్న పిండతతులు
తే. గడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొందుసహజ
వైరివర్గంబులయు సహవాసమపుడు
చూచి మునిశక్తికెంతయుఁ జోద్యమందె."

అనుపద్యమును జూచి మణికంధరుని తపోవనము వర్ణించుచుఁ బింగళి సూరన్న పై రీతి ననుకరింపఁ జూచియు యమకమునకై స్వారస్యముఁ జెడఁగొట్టుకొన్నాఁడు.

"సీ. ఆవులునాఁకఁ గన్నరమోడ్చు పులులును
బులుల చన్గుడువంగఁ బోవులేళ్లు
లేళ్ల చెఱ్లాట రంజిల్లెడుహరులును
హరులుగోళ్లను గోఁక నలరుకరులు
కరులకటాళివైఖరి నాడు పాములు
పాముల లాలించు బభ్రుతతులు
బభ్రుతతులప్రక్కఁ బాయనియెలుకలు
నెలుకలఁ బెంచుపిల్లులును గలిగి..."

భీష్మాటోపమును వర్ణించుచున్న భారతములోని కొన్ని వచనముల ననుసరించి కళాపూర్ణోదయములో నష్టమాశ్వాసమునందలి "ఇత్తెఱంగున నప్పార్థివోత్తముఁడు" ఇత్యాది దీర్ఘవచనములు వ్రాయఁబడి యున్నట్లు దోఁచెడిని. మఱియు "సూరనార్యుఁడు కొన్ని యెడల నన్నెచోడుని ననుకరించి యున్నాఁడని" శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు వ్రాసియున్నారు; కాని, సందర్భము లభిన్నముగనుండుచోట్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాషయుఁ గొంత సాదృశ్యముఁ దాల్చుట యప్రకృతము గాదు. కావునఁ బోలికలఁ బట్టి చౌర్యము నొడిగట్టుట తగదు.

ఇట్లు మనసూరన యుత్కృష్టులైన గ్రంథకర్తల జాడల నెఱింగిన వాఁడయ్యుఁ గొంతవఱకు నంతమంచివికానిమార్గముల నవలంబించి యున్నాఁడు. దీనికిఁగారణము సమకాలికుల మెప్పింపఁ జూచుట. మఱియు మనకవి మిగుల బీదవాఁడు కాఁబోలు. కుటుంబరక్షణార్థము ద్రవ్యార్జనకై యత్నించుట దోషము కాదు కదా! ఆకాలమున నిప్పటియట్లు ప్రజలు పుస్తకములు గొనుటచే నాదాయము గడించి జీవింపఁ జూచుటకు వీలు శుద్ధముగ లేమిం జేసి యతఁడు రాజుల నాశ్రయింప వలసినవిధికి లొంగిన వాఁడాయెను. ఇఁక నారాజుల యిష్టానుసారము వ్రాయక యేమి చేయును? పరిపాలనకార్యమునఁ దగిలి కాలము గడుపురాజులు స్వబుద్ధితో విమర్శింపఁ జాలినంతపండితు లగుట యరిది గావున నట్టివా రాచారముం బట్టి గుణదోషనిర్ణయముఁ జేయుట నైజము. సూరనకాలమునఁ బ్రాచుర్యమునకు వచ్చినకవితా రీతి ప్రబంధరచన. కావునఁ దానును బ్రబంధధోరణినే వ్రాయవలసిన వాఁడయ్యెను. ఐనను భావగంభీరుఁడును వివేకవంతుఁడు నగుటఁ బట్టి పూర్తిగఁ బ్రబంధకూపంబునఁ బడలేదు. రాజుల యిష్టమునకుఁ దన యిష్టమునకును నడుమ నిలిచి కవితాస్వర్గమునఁ ద్రిశంకుస్థితిం దాల్చి యున్నాఁడు. తనకు శరణ్యులైనప్రభువుల చిత్తవృత్తి ననుసరించు వాఁడనుటకుఁ గళాపూర్ణోదయమునుండియే యొక యుదాహరణముఁ జూపవచ్చును. చూడుఁడు :—కృతికర్తశైవుఁడు ; ఇందు కితఁడు దార పుత్రాదిబాధలేనియౌవనకాలములో వ్రాసినదని యూహింపఁ దగిన రాఘవపాండవీయమున నితనిని చినవేంకటాద్రి "లలాటేక్షణ భక్త శీల" యని సంబోధించుటయే సాక్షి. ఇఁక కళాపూర్ణోదయభర్తలైన నంద్యాలవారన్ననో వైష్ణవము కొంత ముదిరిన మహనీయులు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందును గృతిపతియగు కృష్ణమహీపాలుఁడు వైష్ణవమతశీలుఁడు. తిరుమల తాతార్యవంశీయుఁడగు శ్రీనివాసగురువు శిష్యుఁడు. కావుటం బట్టియే రాఘవపాండవీయ ప్రభావతీప్రద్యుమ్నములలో శివస్తుతితోఁ గావ్యారంభముఁ జేసినభక్తుఁడు కళాపూర్ణోదయమున విష్ణువునకు నగ్రార్చనం జేసెను. తుదకు వైష్ణవమతప్రధానతత్త్వమును బోధించు 'లక్ష్మీనారాయణసంవాదము' చేఁ బ్రబంధమును ముగించెను! పాపము! దారిద్ర్యముచేఁ గుందింపఁబడనివాఁడెవఁడు? ఇట్లు యావనమున స్వాతంత్ర్య మవలంబించి యున్నను మధ్యకాలమున దారపుత్రాదిపోష ణమునకు వీలులేక చాలకాలము పారతంత్ర్యప్రవృత్తుఁడై యుండి విసి వినవాఁడవుటఁ గాఁబోలు వార్ధకమునందుఁ బ్రభావతీప్రద్యుమ్నము నందు స్వాతంత్ర్య మవలంబించుటయు కాదు, గంభీరముగ నిట్లు వాక్రుచ్చుటయు :—

"మ. జనముల్మెచ్చగ ముద్రచించితి నుదంచద్వ్యైఖరిం గారుడం
బును, శ్రీ రాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుం గబ్బము లెన్నియేనియును, మత్పిత్రాది వంశాభివ
ర్ణన లేమిం బరితుష్టినాకవి యొనర్పం జాల వత్యంతమున్."

ఈపద్యముఁ జదువునపుడు కవి యాదిని బడినపాట్లకు దుఃఖ మును, దుదకు నిరంకుశక్రీడకుఁ జొచ్చెఁ గదా యని సంతసమును బొందక మానము. ఈధైర్యమహిమచే నితఁడు సర్వజనశ్లాఘ నీయుఁడు.

కళాపూర్ణోదయ మాంధ్రమున నద్వితీయమైనగ్రంథము. భారత మనుచరిత్రాది గ్రంథములవలెఁ బరివర్తనము గాని, ప్రాచీన కథామూలకము గాని కాదు; మఱి కవియొక్క స్వసృష్టి. ప్రబంధకవు లెవ్వరియందును గనఁబడనిప్రతిభయు, భావనాశక్తియు, సందర్భ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుద్ధియుఁ, బాత్రోచితపద్యరచనయు నిందు సుప్రసిద్ధములు. ఐనను గాలదోషము తప్పించుకొనరాని దగుటచేఁ బ్రబంధకవులయందలి స్ఖాలిత్యము లిందును బెక్కులు గలవు; కాని దోషములకంటె గుణము లెన్నియో మడుంగు లెక్కువ. సూరన రచించినగ్రంథము లలో నెల్ల నిది యుత్తమోత్తమము. ఐనను రాఘవపాండవీయమును బ్రశంసించినంత సూరన దీనిని బ్రశంసింపకపోవుటచేఁ గళాపూర్ణో దయముకంటె రాఘవపాండవీయమే ప్రశస్తమని తలఁచెనేమో యని సందేహింప వలసియున్నది. కాని రాఘవపాండవీయరచనా నంతరము శ్లేష నంతగా వాడక చాలించుటం జూడ దానియం దితనికి శక్తియున్నంత రక్తి లేదని మన మూహించుట యుక్తము.

ఈకావ్యముయొక్క గుణదోషములు రెండింటికి నాస్పదమైనది, సూరనార్యుఁడు ప్రారంభమునఁ జేసికొన్న ప్రతిజ్ఞయ. చూడుఁడు :— "సకల లక్షణ లక్షితంబైన మహాప్రబంధంబు కీర్తికారణం" బని తలఁచి "అపూర్వకథా సంవిధానవైచిత్రీ మహనీయంబును, శృంగార రసప్రాయంబును, బుణ్యవస్తువర్ణనాకర్ణనంబును నగు కళాపూర్ణోదయం బను మహాకావ్యంబు" రచింపఁ గడంగెను. కవియొక్క యుద్దేశమే యీగ్రంథ మిన్నిలక్షణములు గల్గియుండ వలెనని. కవి తనయభి మతము నెఱవేర్చి కొన్నాఁడు గాని, యిట్టిపంతముఁ బట్టి వ్రాసి నందున నిష్కళంకమైనకృతి యేర్పడినదా యనుటసందేహము. కథయుఁ బ్రకృతియందలివస్తువులవలెఁ దనంతఁ దనయందలిసత్త్వముం బట్టి పుట్టి పెరుగు గుణము గలది. దానిని సాజముగఁ బెరుగనిచ్చి యప్పు డప్పుడు సవరించుచు సంస్కరించుచు దోహదముచేయుచు వచ్చిన మేలా? మొదటినుండియే యీ యీ రసములు తప్పక యీఁగల దానిని గల్పించెదనని సంకల్పించుకొని పిమ్మట దానియుత్పత్తిఁ జేయఁ జూచుట మేలా? యోజింపుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూరనార్యున కీయుద్యమముచేఁగలిగిన మేలుగీడు లెవ్వియన : అపూర్వకథాసంవిధానముం బూనుటచే నుపజ్ఞకును భావనాశక్తికిని మంచిప్రవేశము దొరకినది. కళాపూర్ణోదయము సామాన్యప్రబంధములకంటె నెక్కువ రసవంతముగా నుండుట కిది యొకకారణము. మఱి భారతమంతసరసము గానిదగుటకు మూల మేదనఁగా, సర్వలక్షణములును బలాత్కారముననైనఁ దెచ్చి రాశివేయవలయునని సమయముఁ జేసికొన్నవాఁడగుటచేఁ గథను సహజముగఁ బక్వతకు రానియ్యక యచ్చటచ్చట నూదరవేసియుండుట. అయిన నొక్కటి, ప్రబంధములలోఁ గథ, కంటికిఁ గానరానంత కృశత్వముఁ జెందియుండును. ఈలోపమును జాలమట్టుకుఁ బూరించి యీకావ్యములోని కథను బుట్టికిఁ దెచ్చినతంత్రములలో సకలలక్షణసంపన్నతాసమయము ప్రముఖము. ప్రబంధములలో శృంగార మనఁబడు నొకరసము తక్కఁ దక్కినరసములు సామాన్యముగ మృగ్యములు. మనసూరనకవి కళాపూర్ణోదయమున నన్నిరసములకును స్థానమేర్పఱచుకోరిక గలవాఁడగుటచే వానికన్నింటికిని జోటు దొరకునంత విశాలమగు కథను గల్పింపవలసినవాఁడయ్యె. కావున నిందు కథ తుచ్ఛము కాదు; మఱి మిక్కిలి ప్రబలము; అయిన నొకదురదృష్టము, ఒకే కథలో నన్నిరసములు నిముడ్పవలయు నన్న నాకథను దాఱుమాఱుగ నీడ్వనిది గాదు. అనఁగా నసంగతములైనయంగములఁ దెచ్చిపెట్టి సారస్యము నక్కడక్కడఁ జెడఁగొట్టి కథకు వికారము గల్పించినాఁడని నామనవి. అయినను ఈసంకల్పము లేకున్నఁ గళాపూర్ణోదయము సామాన్యప్రబంధములలోఁ జేరినగ్రంథముగా నుండియుండునేమో? కావున నాదుర్గతికిఁ దప్పించినమంత్రము నింద్యమనరాదు.

కల్పనాసామర్థ్య మీకవికిఁబలె నాంధ్రులలోమ ఱెవ్వరికిఁ గానము. తిక్కనాదుల కుండవచ్చునేమో? సూరనయందుఁ బ్రబంధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కవులకుం గలవర్ణనాశక్తితోడ వారికిలేనికథాకల్పనాశక్తియు, వివిధములైనసందర్భములను సంధానమునకుం దెచ్చుప్రతిభయు, సహవాసములు; మఱియు భావనాశక్తికిఁ దోడుభాషాశక్తియునీతనికిఁగలదు. కవితాస్వరూపమును బ్రభావమును వర్ణించుచు వ్రాసినయీపద్యమిందులకునిదర్శనము.

లయవిభాతి :—

చలువగలవెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను సౌరభము చలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జగముల మిగులఁబెంపెసఁగు
మలయపవనంపుఁగొదమలకు మధురత్వం
బలవడిన నీడుమఱి కలదనఁగవచ్చుఁగడు
వెలయఁగల యీసుకవి పలుకులకు నెంచన్.

(౧. ౧. ప. ౨౨.)

భావము శైలినిమించినదా? శైలి భావమును మించినదా యని వెఱఁగొనరించు నగ్రగణ్యపద్యములలో నిదియొకటి! మఱియు సూరన, తనసమకాలికుఁడైనషేక్స్పియరువలె, నందందు శైలిం గూర్చిన విచారములను దనకును గథకును భంగము రానిమాడ్కిఁ బాత్రముల చాటునఁ జేసి యున్నాఁడు. బయటఁ బడకయ తనకృతిని దానే విమర్శించి యున్నాఁడనుట. దృష్టాంతము మణికంధరుఁడు చేసినదండకరూపమగు కృష్ణస్తవముం గూర్చి కలభాషిణి ప్రశంసించిన తెఱంగు :—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. పొసఁగముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
దమలోనదొరయు శబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ జేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లిమ్ముగాఁ బాదుకొల్పి
తే. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె?

(ఆ. ౧. ప. ౭౧.)

ప్రభావతీప్రద్యుమ్నమునందును ఇట్టిదొకటి గలదు; కాని కథలో నీపద్యమునకున్నంతకలయిక దానికి లేదు. ఇంద్రుఁడు శుచిముఖిని గొనియాడుచు నాడినపద్యము:—

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదల
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవ జనక
ప్రకృతార్థభావంబు పాదుకొనదుకుచు
నుపపత్తి నొందు నత్యూర్జితముగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. నొకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవ వాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలముగాదె!"

(ప్రభా. ఆ. ౨. ప. 3)

ఈరెండుపద్యములం బోల్చి చూచితిమేని, రెండవపద్యము రచించులోపలఁ గవి కొంతమట్టుకు శైలిం గూర్చినయభిప్రాయము మార్చికొనినాఁడనియుఁ జెప్పుట కవకాశమయ్యెడి. కళాపూర్ణోదయ పద్యముం బట్టిచూచినఁ గవి యర్థాలంకారములు మాత్రమే కాక శబ్దాలంకారములును అవశ్యానుష్ఠేయములని భావించినట్లు కనఁబడి యెడి. రెండవపద్యములో నేయలంకారములను ధ్యానింపలేదు. భావములు, అర్థములు, అవయవసంయోగము మొదలగుతలఁపులతోఁ జేరినలక్షణముల మీఁద నేకాగ్రమగుదృష్టిని నిలుపుట యుత్తమమని యెంచెనేమో! కావుననే ప్రభావతీప్రద్యుమ్నమునఁ జిత్రకవిత్వ మించుమించు శూన్యము. కళాపూర్ణోదయమునఁ గొంత యధికమే. ప్రభావతీప్రద్యుమ్నము రచనావిషయమునఁ గళాపూర్ణోదయముకంటె మిన్న కాని, భావనాశక్తి కొఱవడినది. కవి వయసుముదిరినవాఁడైనందున రాగములు కృశించెఁ గాబోలు. కళాపూర్ణోదయమునందుఁగల నూతన కల్పన లిందులేవు. విషయముఁ బట్టిచూచినఁ గళాపూర్ణోదయము సాటిలేనిది; కాని శైలి ప్రబంధసంబంధి. శ్లేషము, అంత్యప్రాసము, యమకము, భాషాద్వయానులోమవిలోమశ్లేషచిత్రములు మొదలగు నవి కళాపూర్ణోదయమునఁ దఱచు ప్రయోగింపఁ బడినవి. రగడలును దండకములును లేకపోలేదు.

కథను వివరించుపద్ధతులు రెండు:—విషయముల జరిగినట్టికాల క్రమానుసారముగాఁ జెప్పుట, కాలక్రమమును వదలి సరసమగు నే

7

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సందర్భముననైనఁ బ్రారంభించి పిదప వెనుకముందుగాఁ గథను బెంచి పూర్తిచేయుటయు: మొదటిది కాలక్రమమనియు, రెండవది కార్యకారణక్రమమనియుఁ బేర్కొనఁబడవచ్చును. వస్తుతత్త్వపరిశీలకశాస్త్రములలోఁ గాలక్రమమునకుఁ బ్రసిద్ధి యెక్కువ. కావ్యములందు రసము ప్రధానముగాన మొత్తముమీఁదఁ గాలక్రమమును విసర్జించిన బాగు. కార్యకారణక్రమముగఁ గథను వర్ధిలఁజేసిన వారు, ఆంధ్రకవులలో నాకుఁ దెలిసి సూరన్న తప్ప నింకెవరును లేరు. ఈమార్గసంచారమునకును మొదలిడిన వాఁ డితఁడేయేమో! స్వతంత్రముగ నవీనభంగుల రచించుట మహాకవియొక్క ప్రతిభకు ఫలమును సాక్షియును.

కాలక్రమముంబట్టి చూచిన నీకథకు నాదిమభాగము పంచమాశ్వాసములోని సరస్వతీచతుర్ముఖుల లీలాకేళి. అనఁగా సామాన్యకవులు వ్రాసియుండినఁ బంచమాశ్వాసము ప్రథమాశ్వాసమై యుండును. చూచితిరా! ఈకవియొక్క కూర్పులోఁ గథాప్రారంభమునకుఁ గావ్యప్రారంభమునకు నెంతదవ్వో! ఇట్లు దూరస్థములయ్యు నల్లిక చెదరక జిగిబిగిగా నున్నందున నియ్యవి గాఢాశ్లేషముం గాంచియున్నవి. కథ పూర్తిగాఁదెలియుటకు నైదాశ్వాసములు చదివి తీఱవలయు. ఇఁకఁ గథ నెఱుంగవలెనన్నకుతూహల మున్ననో ప్రథమాశ్వాసములోనే యంకురితము! రంభానలకూబరులవలనఁ గడపట వినంబడినవాక్యం బొక్కటిఁ దలంచికొని కృతాంజలియై కలభాషిణి నారదునితోఁ దావిన్నప్రకారంబు నీరీతి విన్నవించుచున్నది.

సీ. ..............................

..............................

ఏనువృథాభ్రాంతి నింతనంతను దాని
వెంబడిఁ జని పల్కు వింటి నొకటి
వినఁడది యర్థేశతనయుఁ డోయబల! యి
న్నారదుమాటల నడుమ వేఱ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. పొడమె నేమయ్యె నల కళాపూర్ణుసుద్ది
కడమ చెపుమన్న రంభ యప్పుడ తెలుపనె
నీకు మఱి చెప్పరాకుంట నీకథయును
నీకు నాతోడుసు మ్మబ్బనీకు మనియె.

(కళా. ఆ. ౧. ప. ౨౬)

ఇదియే కళాపూర్ణునిం గూర్చినతొలుతటిప్రస్తావన. ఔత్సుక్యముఁ బ్రేరేపించువిధములు చూడుఁడు. రంభ తనప్రియునికైనఁ జెప్పరానికథ యెట్టిది? ఏకారణముచేత నామె మానధారిణి యాయె? అను మొదలగుప్రశ్నలు తమంతట నావిర్భవించి, సమాధానము దెలియువఱకుఁ గథనుండి మనలఁ గన్నెత్తనీయకుండఁ జేయును. కావ్యములలోని యేకీభావ మనఁబడు గుణమదియ. అనఁగా నొకపట్టున, నొకగ్రుక్కగా సర్వముఁ గ్రోలమేనిఁ దనివి నీయమి. భాగభాగములుగాఁ జదువఁబోయినఁ దృప్తి లేదు. ఏలన, సమాప్తి వఱకు నేభాగమును అఖండముగాఁ దెలియఁబడమిచే.

తే. ఏనెఱుఁగ వేడ్కపడుచున్నదాననో, త
పోధనోత్తమ, యాకళాపూర్ణుఁ డనఁగ
నెవ్వఁ డాతనిసుద్ది మున్నేమి చెప్పె
నెద్ది చెప్పరాదనియె నాయిగురుఁబోఁడి.

(కళా. ఆ. ౧. ప. ౨౭)

అని పలికినకలభాషిణి పలుకు లాయమవే కాదు, మనవియును. మండుకొఱవి నెగఁద్రోసినట్లు నారదుఁడు "ఇదియంతయు నపూర్వంబు నాకునుం జెప్పరాదు." అని యానతిచ్చు తఱికి మనయుద్రేకమాఁపరాని దయ్యెడు. నారదు డీకథ యత్యపూర్వమనుటయును, గవిపాత్రముల మూలమునఁ దనకృతిని దానే యటనట విమర్శించుట కింకొక ప్రమాణము. రంభానలకూబరులకు నీయపూర్వవృత్తాంతముం

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
LIBRARY
Jangamawadi Math, Varanasi

గూర్చినప్రసంగసమయమును వివరించుచు నారదుడు కలభాషిణితోఁ దనప్రియునకైనఁ దాఁదెల్పమికి నాయప్సరస చెప్పినవిధంబు వినుమని యిట్లనియె :—

సీ. ...ఓపౌరుషాభరణ తత్కథలు వ
చ్చిననేమి యంటేని వినుము తెలియ
నాకథలిఁకఁ జెప్పినట్టివారును విని
నట్టివారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్రప్రపౌత్త్రాదిబహుసంతతియుఁ దన
ర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధిశోభితశుభసౌఖ్యములు గాంతు
రనుమాట యున్నది యాదియంద

తే. యేను నీకది చెప్పిన దీనికొఱకు
నవనిఁ బుట్టంగవలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ! యవి తావకాంగసంగ
సౌఖ్యమునఁ బేర్చునాకు నిష్టంబులగునె.

తే. అదియు వింటివిగద యని యనియె దేని
యేను వినినట్టిపిమ్మట నిట్టిమాటఁ
బలికె నొక్కయమోఘవాగ్విలసనుండు
గావున వచింప విన నీకఁ గాదు నాకు.

(కళా. ఆ. ౧. ప. ౯౬–౯౭)

ఈమాటలతో మనయుత్కంఠ గొంతునకుమీఁదుగాఁ బోవును! ఉత్కంఠకుఁ దోడద్భుతమును వచ్చిచేరును. ఎట్లన: కేవల నిరర్థకవ్యాఖ్యానమైన ఫలశ్రుతిఁగూడఁ గథలో ముఖ్యాంగముగఁ జేర్చినాఁడే యను విస్మయ మొక్కటి. మఱి, యీఫలములు దేవతలకశుభము లగుటచే దేవత లీకథను వక్కాణింపరు. మనకు శుభములు గావున వినవలయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుసంభ్రమ మింకను నుద్గాఢమగును. ఒకపక్షమువారికి మేలుగను, మఱియొకపక్షమువారికిఁ గీడుగను నవతరించిన యీచరిత్ర మేరీతి భూలోకములో వ్యాపింపఁగలదని యాశ్చర్య పడమా! కథ దేవ లోకములోఁ బుట్టియుండుట యీవఱకే స్పష్టము. ఇఁక దేవతలు చెల్పనిది మనకుఁ దెలియు టేభంగిని? కథ యేమో తెలిసియే యున్నది. లేకున్న నీకావ్యమెక్కడిది? నారదుఁడును,

తే. " అతివ విను రంభకును గలయట్టిభయము
నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ
గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున
వెలయఁగల దది వెలయు త్రోవలును గలుగు. "

(కళా. ఆ. ౧. ప. ౯౫.)

అని చెప్పుచున్నాఁడు. అతనివాక్య మమోఘము. అట్లగుట నెవ్వరికి నపాయంబు నాపాదింపని యేమంత్రముచేఁ గవి యీక్రియ నమర్థించునో యని యబ్బురపాటును దొట్రుపాటును జదువరులకుఁ దలమునక లగునుగదా! మనల నేకాగ్రవధానులం బరాకృష్టచిత్తులం జేయుటకంటె శిల్పసౌభాగ్య మెయ్యది? కల్పనయనఁగా నిట్లుండునదే కల్పన. ఊపిరియాడకుండునంత యుద్వేగముం గల్గించునది.

షష్ఠాశ్వాసములోని 189 వ. పద్యము వఱకు నుండునంత ప్రౌఢముగఁ దరువాతిభాగములు లేవు. ఈగ్రంథ మంతటితో సమాప్తిఁ జేసియున్న నమ్మాన్యతరమై యుండును. ఏడవ, యెనిమిదవ యాశ్వాసములలో భావనాశక్తి, ప్రతిభ మొదలగు కవిత్వమూలశక్తులు బల హీనములు. తుదకు మధురలాలసాపరిణయాదులు వర్ణింపఁబడకున్నను దత్పూర్వకథచే నూహ్యములు కావున వానిని బొందించి యుంట పున రుక్తిఁ బోలినది. ప్రధానాఖ్యానముతో నైక్యము వీసకత్యల్పము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అట్లయ్యును ఈనిరర్థకప్రస్తావనకుఁ గవి యేల ప్రవర్తించినాఁ డనుట చింతనీయము.

కథాంగము లేక భావముందాల్చి యొకశరీరముగా నేర్పడి యున్నఁ గళకు ప్రాశస్త్యము. అట్టి గాఢసంయోగమునకు షష్ఠాశ్వాసములోని పూర్వోదితపద్యమునకుఁ దరువాతిభాగములన్నియు విచ్ఛేదహేతువులు. ఇది యెఱింగి ప్రతిక్రియ చేయనెంచినవాఁడై కాఁబోలుఁ, గథయొక్కయాదినుండి యంతమువఱకుఁ బూసలలో దారమిమిడియుండునట్లు మణిహారవృత్తాంతముం గూర్చియున్నాఁడు. ఈ హారవృత్తాంతముం దిలకింపుఁడు :—

మణిహారవృత్తాంతము.

దీనికి నాదిమప్రభువు విష్ణువు. అతనిని దపస్సుచే మెప్పించి దానిని బడసినవాఁడు సుగ్రహుఁడు. పిమ్మట బ్రాహ్మణశాపమున నతండు దనతొల్లిటి యెఱుక యంతయు హతంబు కాఁగా, నూతనావతారమెత్తినవానియట్లు సత్వదాత్ముఁడను పేరఁ బరఁగి రాజుగాఁ గొంతకాలముండి పిమ్మటఁ గళాపూర్ణునికి మంత్రిగాఁ గుదిరె. సుగ్రహుఁడు మున్ను దేవతాలయములోఁ బెట్టి మఱచినయామణిహారమును మధురాపురపు బ్రాహ్మణుఁ డొకఁడు తీసికొనిపోయి తనయింట బహువర్షములు పూజ సేయుచు నుంచికొని ద్వారకకరిగి శ్రీకృష్ణునకు సమర్పించెను. శ్రీకృష్ణుఁడును "దండకాకృతి సముజ్జ్వలసంస్తవలీలకెంతయున్, ఘనముగ మెచ్చి యిచ్చె మణికంధరనామునకున్." మణికంధరుఁ డలఘువ్రతునకు, నతఁడు కళాపూర్ణునకును, నాతఁడు శిశుప్రాయయగు మధురలాలసకుం గ్రమముగ నొసంగిరి. అట్లగుట నీహారమును సరస్వతీ చతుర్ముఖవిలాసక్రీడయుం బోలెఁ గథ నేకీభూతముం జేయుకల్పనలలో నొక్కటి. పూర్వోత్తరభాగంబు లన్నిటికి నీహారము సామాన్యము. కథనెల్లఁ బ్రాఁకియుండుతీఁగవంటిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈరీతి నీకల్పన మహోత్తరమైనదయ్యు నిష్కళంకము గాదు. ఎట్లన : ఆహారముయొక్క నాయకమణి యెవ్వరిహృదయస్థలంబున నెంతవఱకు సోఁకియుండునో, యంతతడవును వారికి సర్వజ్ఞత్వము, వాక్పటుత్వమును సిద్ధించునని విష్ణువువరము. దానిసత్యము ననుభవమునకుఁ దెచ్చికొనులోపల సుగ్రహుండు శాపహతుఁ డాయె. మధురాపురిబ్రాహ్మణుండన్ననో దానిని గంతములో ధరింపక పూజసేయుచు బహువర్షము లుండినాఁడఁట ! వానిభార్యయొక్క చిత్తస్థైర్య మెంత దృఢమో ! ఆపె గూడ దొంగతనముగానైన దానిని వేసికొనలేదు. శ్రీకృష్ణుఁడు మణికంధరుని మెడలో వేసినాఁడు గాని, యది "బాలతఁ గనుపట్టు విష్ణునికలాపము గావునఁ దద్భుజాంతరస్థితికిఁ జాలకొప్పి గళసీమన యెంతయు గుప్తమై" యుండెనఁట ! "బాలతఁ గనుపట్టు" అను విశేషణము సమంజసమా ? పూజారి బ్రాహ్మణుఁడిచ్చినది బాలకృష్ణునకా ? షోడశసహస్రమహిషీయుతునకా ? పిమ్మట శిశువుగానున్నమధురలాలసకుఁ గళాపూర్ణుఁడు వేయఁగా నాయకరత్న మాపె హృదయంబు సోఁకునట్లు పడినది. సమయముఁ జూచి పడవలసిన చోటఁ బడినదిగదా ! ఎంత తెలివిగలపతకము ! అట్లు సర్వజ్ఞయైన యబ్బాలికామణి యనేకులపూర్వవృత్తాంతముం దెల్పి సత్వదాత్ముని చరిత్రమునకు వచ్చునప్పటి కాపె "యటునిటుఁ గదలఁగఁ దన్మణి హృదయస్థలముఁ బాసి కడకేఁగుటఁ దెలివి యుడిగెను" ఇట్లు వ్రాయుట కామరూపధారణముకంటె ననంభావ్యము. ఏలన : సత్యముగా నుండునా యనుశంకఁ గలుగఁజేసి కథయందు నమ్మికను భ్రమను బోఁగొట్టుఁ గావున. ఇఁకముందటివృత్తాంత మింకను బ్రాహ్మోభావమునకుదూరము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. "నాఁడట్లు బోధోదయం బగుటయు నుడుగుటయు నేత్ర స్మాలంబులని యెవ్వరు నెఱుంగకుండుటను నిది సామాన్యహారంబ యనుతలంపున మావారు దాఁచి మఱచుటంజేసి నాఁటనుండి నేఁటి దాక నిద్దివ్యహారం బెన్నడును ధరియించుటయు లేదు. నేఁడాభర్ణ భరణసమయంబునఁ బ్రసంగవశంబునఁ దలంచికొని చెలులు తత్ప్రాప్తి ప్రకారం బెఱింగింప నిది సుముహూర్తలబ్ధంబైన ప్రథమభూషణం బనియు భవద్దత్తంబనియు సత్యాదరంబునఁ దెప్పించి హృదయభాగ స్పర్శినాయకరత్నంబుగా నిపుడు ధరియించి యున్నదాన."

(కళా అ. ౭. ప. ౧౮౯.)

ఇందలి యసంభావ్యములు రెండు: కన్యగానుండునపుడారాజు గాలిమైన సోఁకునా దేవుఁడా! యని వ్యథఁ గూరుచున్న విరహవేదనా కాలమునను బెండ్లినాఁడును ఎన్నఁడును రానిప్రశంగవశ మిప్పుడేల పైఁబడవలయును? రెండవది: 'హృదయభాగస్పర్శినాయకరత్నం బుగా' ధరింప బుద్ధి నిష్కారణముగా నేల పొడమ వలయును? లోక ములో నదృష్టములును, నిర్హేతుకములు నైన యాకస్మికములు లేక పోలేదు గాని, పదేపదే వలసినచోట్ల నెల్లఁ గాకతాళీయన్యాయముల నాశ్రయించుట కల్పనకు మిక్కిలి కొఱంత. కామరూపములు, దివ్య దృష్టి, ఇత్యాదులు, అన్నికష్టములకు ననుకూలించుసాధనములు గానఁ బ్రశస్తములు గావు. సర్వసందర్భములలోఁ జేరఁజాలినవి యీకథలోఁ దప్పక చేర్పఁ దగినయంశములని చెప్పవీలులేదు గనుక, నిట్టి వేసంద ర్భములను జేర్పకుండుట మేలు. కథకెల్ల సూత్రమువలెనుండునీహార మిన్నివక్రముల కాస్పదమగుట చింతావహము.

నాటకరీతిని సంభాషణాదులచే వృత్తములం బ్రకటించుటయందు నీగ్రంథ మసదృశము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కథాప్రారంభముననే యెంతవడిగా నెన్నిపాత్రములం బ్రవేశింపఁ జేసినాఁడో తలపోసి యానందాశ్చర్యముల భరింపుఁడు. ఉద్యానవనములోఁ గలభాషిణి చెలికత్తెలతోఁగూడి డోలావిహారంబు సల్పుచుండఁగా, నారదునితో నాకాశమార్గంబునఁ బోవుచుండు మణికంధరుఁడు,

మ. "తమిఁ బూఁదీఁగలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూఁగు నా
కొమరుం బ్రాయపుగబ్బిగుబ్బెకలయంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టిమొగంబై చనుదెంచుతీవిఁ గనుఁగొంటే దివ్యమౌనీంద్ర! నా
కమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్చాఁచు లాగొప్పెడిన్."

(క ళా. ఆ. ౧. ప. ౪౨)

అని ప్రశంసించినప్రకారము సరిగాదని నారదుండు,

మ. "భళిరా సత్కవివౌదు నిక్కమ తగం భావించి నీవన్న యా
యెలప్రాయంపుమిటారికత్తెల బెడం గేనెందునుంగాన, వా
రల డోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యా
దలఁ దన్నం జనునట్లు మించె ననినన్ దప్పేమి యొప్పే యగున్."

(క ళా. ఆ. ౧. ప. ౪౪)

క. "అని పలుకునపుడు నికటం
బున నలకూబరుఁడు దాను మొగిలు మఱుఁగునన్
ఘనమగుదివ్యవిమానం
బునఁ జనుచున్ రంభ వినదముగ నదివినిరో."

(క ళా. ఆ. ౧. ప. ౪౫)

ఆదినే యీరీతినై దుగుర నెదుర నిల్పుటయ కాదు, మాటమాటకును గథ పెరుగునట్లుచేయుమాహాత్మ్యమున సూరన నిస్తులుడు. ప్రథమాశ్వాసము ముగియుసరికిఁ గథామధ్యమున మునిఁగినవారమై,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెట్లు వచ్చితిమి, యాది యెయ్యది, యంత్య మేదిక్కున నుండునని విస్మయానందముల నోలలాడుచుందుము. మణికంధరునిస్తుతి వ్యర్థచేష్ట గాదు. ఆకాశమునఁ జేయఁబడియుండినందునఁ గలభాషిణి వినియుం డదు. అటువినమి యావశ్యకము. లేనిచో నలకూబరునిపైని వలపుచే నైన దైన్యముతో నారదునాశ్రయించి యుండదు. మఱియు నాపొగ డిక రంభకు నసూయాకారణము. ఆ యసూయచేఁగదా యాపె నార దునితో మాటలాడుటకై వచ్చి నలకూబరుఁడు "నరభామలపోఁడు ములకు బ్రమయకయున్నే" యని దరహాసముచేయుట! నారదుం డును బ్రతిహాసముఁ జేయఁబూని,

క. "నినుఁబోలువనిత నీకును
వనజముఖీ! యితనిఁబోలువాఁ డితనికి నెం
దునుగల్గి కలఁచునో యి
ట్టినిగాఢపుమదము సొంపు తీవులుచనునే?"

(కళా. ఆ. ౧. ప. ౬౦)

అనిపల్కుటతోఁ గథయొక్కయస్తిభారములో సగము సంపూర్ణ మయ్యెను. పిమ్మట లెక్కకువచ్చునో రాదో యనునట్టి చిల్లరవిషయ ముంబోని,

"వ. అంత నమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబునం దద్విమా నంబు కలభాషిణి విహరించుచున్న యెలదోఁటలోనికిం దిగియె నట్టి యెడ రంభానలకూబరులును వినయపూర్వకంబుగా నతనిచేత నని పించుకొని యప్పు డెదుఁటగాన్పించుపాసుదేవుని ప్రాసాదరాజంబు నకుం జేమెత్తి మ్రొక్కి తమవిమానంబుతోడ నిజేచ్ఛంజనిరి."

(కళా. ఆ. ౧. ప. ౬౨)

అనువాక్యముతోఁ గలభాషిణి నలకూబరునివలచుటకును గళా పూర్ణునిసుద్ది వినుటకును సహజమైనసమయముఁ గల్పించి తక్కిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సగము ననాయాసముగ ముగించిన యీకవియొక్క ప్రతిభ యనిర్వాచ నీయము గదా! ప్రథమాశ్వాసము కథకు నాలవాలము. సమస్తము లైన కార్యములయుఁ గారణబీజంబు లిందుఁ జల్లఁబడియున్నవి.

## ఐక్యమను లక్షణము.

సామాన్యకవులతోఁ బోల్చిచూచిన సూరన్నకళాకౌశల మింకను వైశద్యముతో వెలుఁగును. మనప్రబంధములు తఱుచు కథానాయకుఁడగు "రాజు" అను నొక్కపాత్రముతోఁ బ్రారబ్ధములు. ఆయనను గూర్చిన యప్రస్తుతవర్ణనము ముగియుటకుఁ బట్టునది యొక గంట. పిమ్మట నర్మసఖుఁడో యెవఁడో యొకఁడు వచ్చుట. ఆటు తర్వాత వేట వెడలుదు రేమో! అక్కడ నొకసఖీజనపరివేష్టిత యగు కోమలాంగిని జూచి రాజును విదూషకుఁడును (నర్మసచివులు విదూషకులుగ నుండుటయు, విదూషకులు నర్మసచివులుగ నుంటయు హిందూరాజధర్మము కదా!) రెండుగంట లొకరితో నొకరు శ్లేషలు, అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలుఁ బేల్చునప్పటికి నిది దయ్యాలతో నిండినకావ్యమని దూరముగఁ బాఱవైతుము! కళాపూర్ణో దయముతో నుపమింపఁదగినది, మూలము స్కంధము సామాన్యముల య్యు, వివిధగతుల దెసలను వ్యాపించు శాఖోపశాఖలు గలిగి కనుపండువుగనుండుమహావృక్షము. సామాన్యప్రబంధములు, కొలుకు లొకదానివెంట నొకటి యతికించుటచే నేర్పడినగొలుసులవంటివి. ఐక్యము వీనిలోఁ లేదు. ఎన్నికొలుకులైనఁ జేర్పవచ్చును; ఎన్నియైనఁ దీసివేయవచ్చును. వైపుల్యము దక్క నింకెద్దానికిని లాభనష్టము లుండవు. ఆకృతి మాఱదు. వృక్షములు మొదలగు సజీవములవలె నుండుకావ్యముల నేయంగమునైన ఛేదించుటకుఁ గాదు. నూతనాంగ ములఁ జేర్చుటకుఁ గాదు. ఎట్లుచేసినను పరిమాణభేదమే కాదు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకారమును వికృత మగును. ఐక్యమనుకథాలక్షణమును బరీక్షించు పద్ధతి యేమనఁగా :—ఉన్న భాగములఁ దీసివేయవచ్చునా, క్రొత్తవి యేవైనఁ జేర్పవచ్చునా యని విమర్శించుట. ఈకార్యములు పొసఁగనివైన నైక్యము స్ఫుటము. సాధ్యములైన నైక్యభావ మపక్వము.

“మానవప్రకృతిని అద్దమువలెఁ జూపుశక్తిగలవాఁడు. సంభాషణలఁ దీర్చుటలోఁ దిక్కనకు సరివచ్చువాఁడును” అని సూరనార్యుని బ్రశంసింపఁ గలందులకుఁ దార్కాణమైన ముఖ్య భాగములలోఁ గొన్ని యేవనఁగా, నిరువురు రంభలును నలకూబరులును బ్రవేశించి చిత్రవిచిత్రగతులఁ బొరపాటుతో సంచరించియు నే యనుచితములకును అనీప్సితములకును బాల్పడక కృతార్థులగు తృతీయ చతుర్థాశ్వాసములలోని ఘట్టములు.

సూరన్నయు షేక్స్పియరును నొకరిపేరొక రెఱుంగనైనఁ జాలనియంత దవ్వులనున్న సమకాలీనులు. జాతిమతవేషభాషాదుల వ్యత్యస్తులు. అట్లుండియు నీవింత నేమిచెప్ప ? షేక్స్పియరు వ్రాసిన “కామెడి ఆఫ్ ఎరర్స్” (తబ్బిబ్బుల ప్రహసనము) అను నాటకమునకును, రంభానలకూబరద్వయవిలాసమునకును బెక్కు పోలిక లున్నవి. రెంటియందును భేదములేని రూపముగల నాయకు లిరువురు, నాయిక లిరువురు. అన్యోన్య పాత్రముల నిరూపించుటకు నసాధ్యమైన భ్రమ తటస్థించి, నాయికానాయకులు తమవలచినవారని యొండొరులతోఁ జేరియుండువేళ, “అయ్యో! పాపము! అన్యునిచే నీతరుణి చెఱుపఁబడెనా ?” యను సంశయము దోఁచి మనసు కలఁత పొందించును. కాని, కథ యామూలాగ్రముగ విశదీకరింపఁబడుసరికిఁ దమతమయభిమతముల కనుకూలము లైనవిధంబుల దాంపత్యము లేర్పడినవని చూపి, మనకు దిగ్భ్రమము వాయుటతోడన పట్టరాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవ్వును సంతోషమును గలిగించును! ఇట్టి కథాసందర్భ మెంతో యపురూపము. అట్టిదానిని హిందూదేశములో సూరన్నయు నాంగ్లద్వీపమ్మున షేక్స్పియరును నెట్టిసంబంధములును లేనివారయ్యు నేక కాలముననే దలపోయుటఁ దలంచితిమేని, యిది కాలయోగ ప్రభావమా! ఆకస్మికవిచిత్రమా! యని విస్మయభరితాంతఃకరణుల మగుదుము.

కళాపూర్ణోదయమున నైదిటికిఁ దక్కువకాని విధముల శృంగారము ప్రదర్శింపఁబడియున్నది. ఇంనుజావళీలకుఁ జేరినది యొకటి మాత్రము. అయ్యది యప్రశస్తమనఁదగినభాగములో నుండుటచే దానిప్రస్తావన నిప్పుడు చేయను. తక్కినవానిలో నొకదానివలె నొకటి యుండదు. అన్నియు రమణీయములు. స్వశక్తియే గురువుగ నూతన మార్గములఁ ద్రొక్కి సూరనార్యుఁ డందుఁ బ్రకటించిన యీ యసాధారణశృంగారములకు ముఖ్యనిదర్శనములు :—శల్యాసురవిషయము, సుగాత్రీశాలీనుల వృత్తాంతము, సరస్వతీచతుర్ముఖవిలాసము, కలభాషిణీచరిత్రమును.

## ౧. శల్యాసురచరిత్రము

మృగేంద్రవాహనాశక్తి, తనబంధువగుమహిషాసురుని జంపిన నాఁడు మనంబునఁ బాయమిచే శల్యాసురుఁడు పగదీర్చు నుపాయ మన్వేషించు చుండఁగా నభినవకౌముది యనునప్సరస యెదురైనఁ, జూచినమాత్రాన హృదయమును, ఆహృదయముతోడ నిన్నాళ్లుగాఁ బట్టినపట్టును గోలుపోయినవాఁడై, నన్నేలుకొమ్మా యని కాంతను వేడికొనఁగా, నామెయుఁ జలంబు దాల్చినదై,

క. * * * *
* * నిన్నుమడియించినవా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నినిదక్క సేవరింపను,
వినుమిది నాప్రతిన దీనివిడ నిఁక ననియెన్.

చ. అనుడుఁ దదుక్తి క్రూరతకు నద్దనుజుంపు కదుర్క ఘనంబుగా
గినిసియుఁ బోవనిచ్చె నొకకీడును జేయక యవ్విలాసినిన్.
(అ. ౬. ప. ౩౯. ౪౦.)

ఎంతబలవంతులైన నేమి? కామినీకటాక్షపాశబద్ధు లేమి చేయగలరు? మరల మృగేంద్రవాహనాశక్తి యిచ్చిన యమోఘంబైన కత్తిం దాల్చి మణికంధరుని నరయుటకై పోవునభినవకౌముదిం గాంచి, తన్నే చంపుటకు వచ్చుచున్నదో, యట్లైనఁ జంపువారు చత్తురను నమ్మహాశక్తి వర మున్నదిగదా! అట్లగుట నాపె నాశ మొందునో యని తనపాటు మఱచి ప్రియురాలి శుభాశుభములిం దలపోయుచు నాసాధువు,

" చ. మతిగలఁగంగ నిట్లనిమె, నాపయి వచ్చిన నీకు నిష్టదై
వతముల యాన సుమ్ము! వరవర్ణిని! యెందుఁ దలంక నేను దు
ర్మతివయి నీవు నాకుఁ దెగి మ్రగ్గెదవో యని తల్లడిల్లెదన్."
(అ. ౬. ప. ౬౨.)

అభినవకౌముది యతని మంచిమాటల మోసగించి వెంటఁ గొనుచుఁ జన్నది. నమ్మినవాఁడు కవుడు లేనిమానిసి! వానిని మోసగించుట యేమి కష్టము? ఇట్లు తన్నలయించుచుం బోవుచుండఁ దనప్రతాప మాపె కెఱుకపఱుచువాఁడై యాపెను దాఁకకుండునట్లు శలలప్రయోగముఁ జేసి జంతుజాలంబుల సంహరించి యిట్లనియె. "నన్ను వరింపుము. లేనిచో నీవు చనెడుచోటులెల్ల నాబలముచే నాశము చేయుదును. దాన నీకు నపకీర్తి. కాన నన్నుఁ గూర్చి కరుణలేకున్నను భూతకోటుల రక్షింపవలయు ననుదయచేనైన నాకు పత్నివగుము" అయ్యో! వాని యార్తి యెట్టిది. కాఠిన్యము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్దవము రెండును వానియం దున్నవి కదా! మోహమాహాత్మ్య మట్టిది! వెన్న ఱాయగును; ఱాయి వెన్నయగును. అతనిని మణి కంధరునిచేత నభినవకౌముది చంపించినది. వానిది వ్యసనకరమును వ్యర్థమును నైన శుష్కజీవితము! నిష్కళంకప్రీతిచే విశోభితము!

## ౨. సు గా త్రీ శా లీ ను ల వి చి త్ర క థ

సుగాత్రి శారదపూజారియైన యొకబ్రాహ్మణునికూఁతురు. దానివరుఁడు శాలీనుఁడు. ఇల్లటపుటల్లుఁడు. అలంకారములు, డంబములు, అట్టహాసములును వీనికి సరిపడవు. పట్టణవాసులకుర్చీలు, మేజాలు, నిలువుటద్దములను జూచి పల్లెటూరివాఁడు వెఱఁగు వెఱపు నందిపోవుమాడ్కి, నేయలంకారములు లేక యుండువారినేకాని, తళతళలు, పళపళలు, ఘలఘలలు, ఘుమఘుమలు, మెఱయవచ్చెడు స్త్రీలఁ దిలకింపఁడు. సర్వశృంగారసన్నాహములతో భార్యపడుకటింటికి రాఁగా నిదేమికొఱవిదయ్యమో, గజ్జెలపిశాచమో యని కన్నెత్తి యైనఁ జూడకుండెను! ఆభార్యకాపురుషునితిక్క తెలియదు.

అత్తగారింకను శ్రద్ధతో సొగసులు దిద్దిదిద్ది కూఁతును రెండు మూఁడునాళ్లట్ల యనిపెను. వృథాప్రయాస! "వట్టిరాకపోకలొనర్చె వానిసతియు." పెండ్లికూఁతు రూరకయుండినను జెలికత్తె లూరకుం దురా? జీతములకుఁ బ్రతిఫలముగా బోధనలు చేయనిచోఁ గృత ఘ్నత యని యేమో! ఆ లజ్జావతికి నేకాంతంబున నిట్లనిరి.

ఆ. "పొలతి! యాలిమగని పోఁడుము లేమియుఁ
గలిగినట్టి చొప్పు గానరాదు
మీ తెఱంగు చూడ మేత్మేలు దంపతు
లిరువురును వివేకు లేమి చెప్ప!

(క ళా. ఆ. ౪. ప. ౬౫)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కాంతుఁ డుచితజ్ఞుఁ డైనను
గాంతకు సిగ్గుపడఁ జెల్లుఁగాక కటకటా!
కాంతుఁడు సిబ్బితిగాఁడై
కాంతయు నట్లైన నెట్లు కాఁపురమింకన్.

(కళా. ఆ. ౪. ప. ౬౬)

క. గారామునఁ దోడ్తోడన
రారమ్మనఁ డనుచు మగిడి రానేటికిఁ గ
ర్పూరంబుఁ దోడి బాగా
లీరాదో యాకుమడిచి యీరాదో చెలీ!

(కళా. ఆ. ౪. ప. ౬౯)

క. అన విని యాపెడమాటల
నను నేటికిఁ జంపెదరు వినరా సైఁపవు నా
కని సిగ్గునఁ బలుకుచు నాఁ
డొనరిచి చూచెను దదీయయుక్తుల తెఱఁగున్."

(కళా. ఆ. ౪. ప. ౭౨)

ఈసంభాషణ యతిమధురము. అశ్లీలవాక్యములు లేవు. జాతీయములు, లోకోక్తులు, వీనిచే సువాసితము. చెలికత్తెలిట్లు గరువముగాఁ బలుకుట కావ్యములలో నరిది. కడపటిపద్య మత్యద్భుతము. ముగుదకన్నెయొక్క బయటిసిగ్గును లోనియాశను సొగసుగఁ జూపుచున్నయది.

ఈనూతనచికిత్సలు ఫలమీయకపోయెను. పాపము! సుగాత్రి యేమి చేయును? రాజకుమారిగా నుండినచోఁ జందనాదులఁ బట్టించుకొని చిగురుటాకుఁ బాన్పుపై హాయిగా మూర్ఛపోయి యుండును! పూజారిబిడ్డ. శాస్త్రప్రకారము శృంగారమనుపథ్యమును సేవించి ప్రకటింపవలయునన్న నుద్యానవన ముండవలయును, శీతలోపచారము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లకు సేవకురాండ్రుండవలయును; మఱియుఁ బచ్చకర్పూరము, పునుఁగు, జవాది, యరఁటిబొండెలు, చందనము మొదలగు సంబారములు లేఁది శాస్త్రోక్తముగాఁ గామము నావాహన చేయనగునా! అట్టినీటు ధనికులకే కాని సామాన్యులకుఁ జెల్లదు. ప్రబంధములలోని మోహము మాత్రము నిక్కమైనయెడల, రాజులయిండ్లలోనే కాని యింకెక్కడను రతిమన్మథులు నివానము చేయరని చెప్పవచ్చును! సుగాత్రి కీదిగఁ దీపు లెవ్వియుఁ బట్టలేదు. "నాకును మంగళసూత్రం బీపాటి శుభస్థితి నుండుటయే పదివే లనుచు నెంచుకొనియు వేళాకళలాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబులని వివిధాలంకారముల నెప్పుడు నేమఱకయ తాల్చుచుఁ దనతల్లి యేమియు నతని నిట్టట్టాడకుండం బ్రార్థించుచుండె."

భర్తకు నొకపిచ్చియైన భార్యకు నొకపిచ్చి. తన యలంకారము లాయనకు నాయురభివృద్ధికరములనుట పిచ్చియైనను మేలుచేయు మంత్రములలో నొకటిగాన ననింద్యము. ఈ యోర్పును, వినయమును, సుఖపరిత్యాగబుద్ధియు, సంతుష్టియు శృంగారభావములు గావా? పతిపైఁగలప్రీతిని సూచింపవా? అత్తగారి కీమాత్రమున శాంతము గుదురదాయె! మనుమఁడు గలుగకున్నఁ దనకు మోక్షము గలుగదని యేమో! ఈ దౌర్భాగ్యపుటల్లుఁడు తోఁటలోనైనఁ గృషిచేసి ప్రయోజకుఁడుగానీ యని, యాతనిని బూఁదోఁటలో మాలిపనికి నియోగించెను! శాలీనుఁడు సత్త్వగుణుఁడు. చెప్పినదంతయుఁ జేసి రచ్చలేక యుందమనెడివాఁడు. మఱియు నిల్లటపుటల్లుఁడు. అట్టియల్లురకు మర్యాద లెక్కువ యుండునా? ఒక్కఖేదమును జెందక నిత్యముఁ దోఁటపనులఁ జేయుచుండెను. అప్పుడు సుగాత్రి

తే. తల్లిమాటలచే నిట్లు తనవిభుండు
దనువు బడలంగఁ బూఁదోఁటపనులు సేయఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూడ నోర్వక తాను నచ్చోటి కరిగి,
తోడుపడియెద నని చూచు, వ్రీడ నుడుగు.

(ఆ. ౪ ప. ౨౪.)

పిమ్మటఁ గొన్నాళ్లకు లజ్జఁబాయఁద్రోచి పురుషునకు సహాయముగఁ దానును దోఁటపనులను జేయ,

ఉ. " * * * *
* * *
* * ఎప్పటియట్ల యలంకృతాంగియై
యెంతయు నింపుతోడఁ జనియెన్ బ్రియుఁడున్న వనంబు లోనికిన్.

(ప. ౯౪.)

కం. చని యాతఁడు దాఁ జలిపెడు
పనులకు నీయకొనకున్నఁ బలిమిఁ గడంగెన్
దనసొమ్ము లెల్ల నొకమఱుఁ
గున నిడి పిరిసుట్టు సుట్టికొనిన వలువతోన్.

సీ. తోరంపుఁజనుదోయి త్రుళ్లింతల నిడంగఁ
దగుచోట్ల గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి
వ్రేఁగైనపిఱుదు బల్విడిఁ జలింపంగను
వడి నిట్టునట్టును నడిచి నడిచి
యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్లకు మడవలు మార్చి మార్చి
నడుములేఁదీవియ నకనక ల్గుడువ నిం
పునఁ దగుమోఁపులు మోసి మోసి
తే. చిఱుచెమటఁ బేర్చు వింతక్రొమ్మెఱుఁగుతోడఁ
గొమరు మేనొప్ప సారెకుఁ గొప్పు వదల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేమిటికి నైనఁ దామున్న యేగి యేగి
యెల్లపనుల నొనర్చె నింపెసకమెసఁగ.

(ప ౯౬.)

ఇన్నాళ్లుఁ గరఁగని యాతనిమన సీనవ్యమోహనమూర్తిచే జయింపఁ బడెను.

చ. * * * అంతనా
బడలిక చూడలే కిడుమపాట్లకుఁ జొచ్చి నలంగి తంచు నె
క్కుడుతమకంబుతోడఁ దలగ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తఱిన్.

(ప ౯౯.)

పశుప్రాయమగుశృంగారమునకంటె నిది యెంత మేలు! చూచి చూడక మునుపే కామినులఁ గవయ నుంకించుట లోలత్వము, నీచము. ఇక్కడ, భార్యయెడఁ గూరిమి, ఆపె తనసహాయమునకై స్వయముగా వచ్చినందుకు మెప్పు, బడలినందులకుఁ గనికరము, గొప్పబుద్ధిఁ జూపినందులకు నుదారవర్తనయను గౌరవము—ఇట్లు స్నేహము, మర్యాద, వీనికనుకూలములైన భావములతోఁ గలసినశృంగారము చూపఁబడి యున్నది. ఇది శ్రేష్ఠము; మానసికము; శాశ్వతము. పెఱయవి యంగరాగములు, తుచ్ఛములు, చంచలములు. మనసుతోఁ గలసినట్టు కామేచ్ఛ వర్ణించుట మనలో నంతగా లేదుగాన నీచరిత్రము నవ్యలీలాలలితంబు.

సరస్వతీ చతుర్ముఖ విలాసఘట్టము.

ఒకవిషయమును బట్టిచూచిన సరస్వతీచతుర్ముఖవిలాసఘట్టము వంటిది యాంధ్రంబున నెక్కడను లేదు. ఏవిషయమనఁ, బ్రకృతిని బాత్రముల జీవితముతోఁ గలిసినట్లు వర్ణించుట.

రంగము సరోవరము. శారదాదేవి ప్రణయకోపమున నవ్వాలిమొగంబుగాఁ బొరలినందున, నామెముఖచంద్రమండల మాకాసారములోనిమణిస్తంభమునఁ బ్రతిబింబితమగుడు, బ్రహ్మయు దానినిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూచుచున్నైన నానందింతమని కొంతసే పట్లేయుండి, యెంతకును బ్రియురాలి కోపము దీఱనందున, సమీపవృక్షశాఖాధిష్ఠితమగు రాచిల్కతో "ఓచిలుక చెలువ! యుబుసుపోదు, కథయొక్కటి చెప్పవుగా" యనుటయు, "నోదేవ, మీరుచెప్పదరేని వినిమెద" నని యాశుకంబు విన్నవింప, వినుమని యాతండు నప్పుడు జరిగిన శృంగారలీలల నేదోకథఁ జెప్పినట్లుగా శ్లేషచేసి వివరింపఁ దొడంగెను. ఎట్లన: కాసారపురములో నొకరాజు. అతనిపేరు కళాపూర్ణుఁడు. (ముఖచంద్రుఁడు) అతఁడు స్వభావునిచే (స్వభావముచే) నొకయెఱ్ఱని మణి శలాకను (మోవిని) విల్లును (కనుబొమలును) బాణములును (చూపులు) బడసి సరిరాజులనెల్ల జయించెను. ఈరీతిగాఁ దాను మన్మథావేశముచే నామెం గదియుట మొదలైనరాగంపుఁజెయ్వులెల్లఁ బ్రకటించుచు, భాషాయోషయుఁ గృత్రిమకోపంబును నిజమైనయుల్లాసంబును గాఁ జిట్లింపఁబడిన కనుబొమలతోను వెలివిరిసివచ్చు చిఱునవ్వులతోను, ఆచిలుకం జూచి "యాకళాపూర్ణుఁడు మఱియేమి యయ్యె, నతని తలిదండ్రు లెవ్వరు, అడుగుము" అనవుడుఁ, జిలుకయు నట్లడుగ, బ్రహ్మదేవుం డింకను జమత్కారముగా నేమనుచున్నాఁడు! "అతనికిఁ దండ్రి సుముఖాసత్తి, తల్లి మణిస్తంభుఁడు" (స్తంభశబ్దము పుంలింగము గనుక నందు ప్రతిబింబితం బనుట) అట్లనుసరికి—

సీ. * * *

* వాణి హాసమ్ముతో, గ్రక్కునఁ గ్రమ్మఱి కౌఁగిలించి

* * * *

యింతలోనన యూర! మెన్నితబ్బిబ్బులు దద్దరిల్లకుఁడంచుధవుని వీఁపు

తే. చఱచి మెట్టెటులారాజుజనని మగది

యును జనకుఁ డాఁడువాఁడునా యనుచు మఱియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిగుల నవ్వుచుఁ జెప్పఁడామీఁదు ప్రాణ
రమణ ! మఱి యేమి యయ్యె నారాజనుటయు.

(క. ఆ. ౫. ప. ౨౪.)

పొలయలుక సగము విరిసినది. పిమ్మట మఱికొన్ని స్నేహక్రీడలు నడవఁగా, "నిదేమి, యూరకుండ" రని కోపగించుకొన్న సరస్వతీదేవికి హృదయప్రమోదంబుగా, నీక్రొత్తసంగతులను జేర్చి శతానందుఁడు కథపెంచిచెప్పిన, శారదాదేవియుఁ గపటరోషంబుతోఁ "జాలుఁ జాలు మీకథ. ఇప్పటిమనవృత్తమంతయుఁ జెప్పుచున్నారు. ఇంకెంత దూరము చెప్పెదరోయని యూరకుంటిఁగాని, తొలినుండి నాకుఁదెలియ దనుకొన్నారా!" యని యాకథయందలి ప్రస్తుతవర్తమానమును మృదు మధురవచనముల వ్యాఖ్యానముఁ జేసి చూపుచున్నది. ఐదవయాశ్వాసములోని యీవచన మెల్లరుఁ జదువఁదగినది. వచనరచనలకుఁ దండ్రి యట్టివాఁడు నన్నయ్యభట్టు. అతనిప్రౌఢిమ యన్యులకు లేదు. ఒక్క చిన్నయసూరిమాత్ర మింకొకవిధమైన వచనశైలిని బక్వమునకుఁదెచ్చి నన్నయతో సమానుఁడై యున్నవాఁడు. ఈయిరువురిదానికంటెఁ దక్కు వయని చెప్పఁదగినదయ్యును, సూరన్నవచనము సామాన్యముగాదు. వాణీదేవి వ్యాఖ్యానము చక్కఁరలొలుకునది.

సరస్వతీచతుర్ముఖులసంభాషణలు, చర్యలు, పొగడ్తకు మీఱి నవి. అతఁడు దనసతి నెన్నోవిధముల కేళీహేళనములఁ దేల్పఁగ, నామెయు నవ్వునడంపఁజాలకున్నను గినుకనటించుచు వలదు వలదని ప్రార్థించుపద్యములు మనలఁ బరవశులఁ జేయునవి.

కలభాషిణియొక్క మనోహరచరిత్రము.

ఈకథయందలి పాత్రములపైకి నాకుఁ బ్రియతమ కలభాషిణి. సిక్కువమైన శృంగారభావములకుఁ బ్రకాశకురాలు. శాస్త్రకారుల శృంగార మనుదయ్యు మంతగా సోఁకనిది. జన్మమున వారకాంత. గుణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములఁ బ్రబంధనాయికలగు కులస్త్రీలకంటె మేలైనది. ఏకకాలంబున నిరువురి యెడ మనసుదగిలినదానిఁగా వర్ణించుట కాధారముగాఁ, గవి యీపెను గణికఁ జేసినఁ దప్పులేదని యిట్టిపుట్టుక నారోపించినాఁడో? పరిశీలింపుఁడు. ఎట్లును నీపె నీచపాత్రము గాదు. మఱి మహోదార చరిత్ర. సర్వజన స్తవనీయ. కృష్ణునికొలువునకు నప్పుడప్పుడు నారదుఁడు వచ్చుచుండ నతనితోడన వచ్చుశిష్యుఁడగు మణికంధరుని సాహిత్యపటి మకు గుణసంపదలకును మెచ్చి వాని యెడ బద్ధానురాగయై యుండియు, జాతిదోషంబుచేఁ గాఁబోలు, నలకూబరుని రూపలావణ్యాదిసౌభాగ్యం బులకు మెచ్చి, తదాలోకనంబునఁ దనియక, వానివిమానంబుతోఁ గొంతదవ్వరిగి, యంత మగిడి, యాతని తెఱంగెఱుంగం గోరి, నార దుం జేరి ప్రార్థింపుడు, నమ్మునియు రంభకు వైరిని నొక్కర్తు నిల్పనెం చినవాఁడుగావున,

కం. సవతియన నింక నొకతెఁ
భువిలోపల వేఱ వెదకఁబోవలయునె? యో
ధవళాక్షి! నీవ కానే
రవె దైవనియుక్తిఁ గొంత ప్రాప్తి గలిగినన్."

( అ. ౧. ప. ౩౩. )

అని పల్కుచున్నాఁడు. వినయము, అధైర్యము, దైన్యము మొదలగు భావములతో హృదయపూర్ణమైనవలపుఁ గలసి యుండును. విఱ్ఱవీఁగదు. అభీష్టసిద్ధి నిశ్చయమని యుదాసీనతయు గర్వముఁ గాంచదు. దీనికి దృష్టాంతముగఁ గలభాషిణి యిచ్చినప్రత్యుత్తరముఁ జూడుఁడు :—

కం. * అంతటిరూప
శ్రీవైభవసతికిఁ గాక సిద్ధించునె? యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దైవనియుక్తియు మాబోం
ట్లేవిధమునఁ బాట్లు వడిన సిద్ధవివేకా!"

(ఆ. ౧. ప. ౭౪.)

నారదుఁడు సర్వజ్ఞుఁడు. మణికంధరునికి నాపైపైఁ గోరిక యుండుట నెఱింగినవాఁడు గావున, నీనూతనరాగజ్వాలలో నాప్రాఁతవల పెక్కడ భస్మమగునో యని దానికిఁ బ్రతిక్రియ చేయుటకో యన, "నా శిష్యుఁడు చేసినదండకము చదువు మమ్మా! విందము." అని యాపెచేఁ జెప్పించుచున్నాఁడు. అది యట్లుండె. ఈతరుణియు నారదుని మూలముగ వాంఛితంబు సఫలంబౌనను నుద్దేశముచే, నాతనికి శిష్యురాలుగా నేర్పడి, యతనితో గానవిద్య నభ్యసించెను. నారదుండును గానశిక్షానంతరంబున నిజకళాపాండిత్యముం గూర్చి కృష్ణుని కాంతలు మఱుఁగున నేమనుకొనుచున్నారో వినిరమ్మని యాజ్ఞాపించిన, నలకూబరుని గైవసము చేసికొనుమంత్రమున కిదియ యవసరమని కలభాషిణియుఁ దనగుట్టు దోఁపనీక,

తే. "నేను మీదాన నగుట మీగానకథలు
వడిన నవ్వేళఁ గొదవలు దడవ రేమొ!
సీ. నాక పేక్షితమైననాతిరూపు ధరింప, సామర్థ్యమబ్బిన నామగువల
సఖులరూపముఁ దాల్చి సముచితంబగువేళఁ జని వారి హృద
యంబుఁ గనఁగ వచ్చు."

(ఆ. ౨. ప. ౪౩-౪౪.)

అనఁగా నారదుండును దాను రంభకిచ్చినశాపమునకు నిది యనుకూలమని యావరము నిచ్చెను. నలకూబరదర్శనము మొదలిది వఱకుఁ గడచినకాలము నాలుగేండ్లు.

పిమ్మట నలకూబరచింతతోఁ బరితపించుచు నొక్కనాఁడు కాలయాపనార్థము వీణియఁగొని యుద్యానవనములో వాయించుకొను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుండఁగా, మణిస్తంభుండు గానాకర్ణనవ్యాజంబున వచ్చుడు, నతని సహాయమునఁ గృతార్థత నొందఁ నెంచినదై విన్నవించినది: —

తే. * * * మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మియుంటి నాజీవితంబు
నేమిగాఁ జేసిపోయెద వెఱుఁగఁ జెపుము!

(అ. ౩. ప. ౨౩,)

కం. ఈవేళన యాతనికడ
కేవిధముననైనఁ జేర్పుటింతియ తక్కం
ద్రోవ మఱిలేదు నన్నుం
గావన్ క్షణభంగురములు గాంతలతాల్ముల్.

(అ. ౩. ప. ౨౨.)

క్షణభంగురము లనుచున్నది, యిన్నాళ్లు గాచియుండియు! ఇదియు సహజము. గొప్పవారు తమగొప్పతనమును దామంతగ నర యరు. అల్పమని యందురు. మఱి దైన్యము హెచ్చుచుఁబోయినఁ బిఱికిపట్టువంటిసాహసము పొడమును. ప్రాణకంటకమగుసంకటము. ఇంకను సిగ్గును, అభిమానమును, మర్యాదను బాటింప నౌనా? కావున నన్యములం దనాదరయై యేమనుచున్నది?

సీ. ఓసిద్ధపురుష! మీ కేసరణినిగొని
చన్న నేమగుఁ దక్కుశంక గలదె
నీమహత్త్వముఁ గానని జడాత్మ లేమన్న
నేమి, కన్నమహాత్ము లించుకయును
వేఱొక్కగతిగ భావింపరు, మముబోంట్ల
సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబు గాదంటి, రుచితంబె మఱినాదు
ప్రాణహానికి నోర్చు టరసి చూడఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. బలుపలుకు లేల యింక నాచెలులు గిలుబు
నేగుదెంచి విఘ్నమొనర్తు రితమెఱుఁగక
కావునం గొనిపొమ్ము శీఘ్రుంబ నీదు
వెనుక నిడికొని నన్ను మద్విభుని కడకు.

(ఆ. 3. ప. ౭౧.)

వీఁడు కపటసిద్ధుఁడు. ఈ చెలువంపురాశిని మృగేంద్రవాహనా శక్తికి బలియియ్య నెంచినవాఁడు. "శుద్ధముగాఁగ నీమనసుశోకము సర్వముఁ బుచ్చివైచెద" నని మిథ్యాప్రత్యయముఁ బలికి, యాపెం బిలిచికొనిపోయి, యమ్మవారిగుడియొద్ద నిలిపి పూజాద్రవ్యములు దేఁబోయెను. అప్పుడు సుముఖాసత్తి, మిక్కిలియు ముసలిది, వచ్చి, సిద్ధుని చరిత్రం బెఱింగినదిగాన, బ్రియమును దయయును దోఁపఁ గలభాషిణిం జూచి యిట్లనియె.

క. .........లతాంగీ యెచటనుండి చేరితి వకటా!
కలుషపు బావురుఁ బిల్లిని
జిలుకయుఁ బలె నిద్దురాత్మ సిద్ధుని ననుచర్

(ఆ. 3. ప. ౮౪.)

క. ఆకలుషాత్ముఁడు క్రమ్మఱి
రాకమునుపె తొలఁగిపోవ రాదా యెటకే
నోకూన! యీమనోజ్ఞత
రాకృతి యేఁ జూడఁజాల నసి పొల్గాఁగన్.

(ఆ. 3. ప ౮౫.)

స్త్రీ సహజమగు రహస్య జ్ఞానవాంఛను నడఁచిపెట్టుట, సుముఖాసత్తియొక్క వాత్సల్యఘనతను సూచించెడిని. నలకూబరుని సంగమంబుం గాంక్షించి వచ్చిన యాబాలకు నీవృత్తాంత మెంత చింతావహంబుగా నుండదు! తాను ద్వారకాపురిలో ననుభవించిన వైభ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వమును, దుదకుఁ దనకిట్లు ప్రాపించిన పశుమరణమును దలపోసి, దుఃఖిత మానసయై తదనంతరంబు డెందంబు డిందుపఱిచికొని, యావృద్ధురాలితో గద్గదకంఠముగా

శా. అమ్మా! నీపలుకెల్ల నెంతయు నిజంబై యిప్డుగాన్పించె, నే
ని మ్మాయావి ప్రకార మిట్లగుట నూహింపంగ లేకొక్కయ
ర్థమ్ముఁ బీనికృపఁ గడింతునని యత్యంతాశ ప్రేరేపఁగా
నిమ్మాడ్కిఁ దెగివచ్చితిన్ దెరువు లేదీపాటుఁ దప్పింపఁగన్.

(ఆ. ౩. ప. ౯౫.)

అని మెట్టకేని నిరాశవలనిధైర్యముం దాల్చినదై,

సీ. ....................

మీఁదట రాఁగల మేలుకీళ్లెరికిఁ దప్పింపరాము మెంతయు ధ్రువంబు.

ఆ. ఇంక వాఁడు వచ్చియేమేమి నేయునో
చచ్చుటెట్లొ యను విచారమునను
బెగడుచుండనేల జగదంబ యాశక్తి
నేయవలసినట్లు నేయుఁగాక!

(ప. ౧౦౨.)

అని పల్కుచుండ సిద్ధుఁడు క్రమ్మఱి యాపెం డాసి "యిఁక శక్తిం బూజించి పోవుదము రా" యని పిల్వఁగా, నయ్యో పాపము! మరణ మట్లు ప్రత్యక్షభీకరముగా నిల్చిన నెవరిగుండియలు నీరుగావు? గడ్డిపరకనైన శరణ్యమని యూఁతగాఁ గొనఁజూడమా? అట్లగుట నీబాల భీరువు, దారుణంబులఁ నెన్నఁడుఁ జూచియైన నెఱుంగనిది, ధృతి నీరైపోఁగా నావృద్ధాంగనఁ జూచి,

క. ఏనొంటిఁ బోవ వెఱతుఁ
లోనికి నోయమ్మ! నీవునున్ రాఁగదె నా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తో" నన "నెవ్వరు నేటికి
నేనుండఁగ" ననుచు సిద్ధుఁ డింతిం బలికెన్.

(ఆ. ౩. ప. ౧౧౯.)

పలికి, దానిభయచేష్ట భావించి, యింకఁ దడసిన విఘ్నంబగు నని లోనికి బల్మి నీడ్చుకొని పోవుటకాక, కన్నెను గొప్పుపట్టి యీడ్వఁగా, నప్పడఁతి,

తే. ... ... ప్రాణభయమునఁ గలఁగి యో యవ్వ! నీకు
బిడ్డనే, కావవే నాకు నడ్డపడవె! యనుచు నావృద్ధనారి
మాటునకునొదిఁగె.

సుముఖాసత్తియుఁ దనమెడఁ గత్తి కడ్డముచేసి యామెను గాపాడినది. మృగేంద్రవాహనయుఁ గలభాషిణి శిరోజములు దృఢముష్టిం బట్టి మఱియుఁ బైకిఁ గత్తి నెత్తినయాసిద్ధు ననతిదూరంబునఁ బడవైచెను. వాఁడు కత్తినిగాని కలభాషిణిని గాని విడువక యెగ్లె చని, మాయానలకూబరుఁడు రంభయుఁ గ్రీడించుచుండిన భూసామీప్యమున మెత్తనిక్రొత్తవిరిపాన్పు మీఁదఁ బడెను.

తలిరులను దాఁకినఁ, గాఁక రాకమానునా? సిద్ధత్వమెటఁ బోయెనో! కామవికార మాదేశమయ్యెను. పాండవమహిమం గూర్చి కీచకుఁడు కంపితమానసుఁడై నఘట్టంబునఁ దిక్కన పాంచాలియొక్క సౌందర్యమును వర్ణించిన యనిర్వాచ్యమాధురీధురీణంబులగు సీసపద్యములం బోనివి యొకటిరెండీసందర్భమునఁ గన్పట్టెడు. రసికులు పోల్చి పరికింతురుగాక!

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ
బాఱుముఖేందుబింబంబుతోడఁ
జాల కర్ణద్వయాకూలంకషంబులై
తల్లడంబందునేత్రములతోడఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గడుఁ జెమర్చినయట్టికలికి లేఁజెక్కుల
నంటెడు విగళత్కచాళితోడ
నలిగుబ్బపాలిండ్ల నిలువ కిట్టట్టు నం
క్షోభించుపయ్యెదకొంగుతోడ
తే. వెలపు నొకరయొజ్జయై వింతవిలసనములఁ
గఱపఁ జూపట్టుసౌందర్యగరిమతోడ
సరభసాకర్షణక్షోభచకితమైన
మదనుజయలక్ష్మి రీతి నమ్మగువ దనర.

(అ. ౩. ప ౧౪౬.)

సిద్ధుఁడు చూచినాఁడు. చూచినదే రెండవమాటలేక పరిరంభణమునకు మొదలిడినాఁడు. ఋషుల రసికత యీమాత్రమే కదా! సౌమనస్యమున ఋషులకును, బాలియగాండ్రకును మృగములకును భేదము, శూన్యము. ఆబాలయు నది సైరింపక, రక్షణార్థము పేరెలుంగున నాక్రోశించిన, మాయానలకూబరుండగు మణికంధరుఁడు వచ్చి, తనసింహానాదము విని పాఱిపోయెడు సిద్ధుని వెంబడించి పట్టుకొని, తిరిగి వచ్చులోపలఁ, గలభాషిణి మునుపు నారదుఁ డిచ్చిన వరప్రభావంబునం జేసి రంభారూపంబుదాల్చి, యతని కెదురుగాఁ జనుదెంచెను. ఆఠీవిఁ బరికింపుఁడు—

సీ. తిరముగా ముడువమి విరియఁ బాఱెడుకొప్పు
దోడ్తోడ నొక కేలఁ దుఱిమికొనుచు,
వల్లెవాటుగఁ గొంత వలువచన్గవ నిల్పి
పెఱచేత నీవిగల్పించికొనుచు
నుదుటిపై గొక్కంత చెదరినముంగురుల్
పాపటకును బొందుపఱుచుకొనుచు
సారెకు జారెడు శ్రవణకల్హారంబు
లందంద మూఁపున నానుకొనుచుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. జెమట నంటినపానుపుఁ జివురుఁదునుక
లెడనెడ నఖక్షతాళంకఁ దడవికొనుచు
రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
దొలుతఁ బ్రియుఁడేగుదెంచినత్రోవఁ బట్టి.

(ఆ. 3 ప. ౧౫౬.)

ఏతెంచి, "కేలం గైదువు గీదు వేమియును లేకే యిమ్మెయిన్ వత్తురే, చాలుం జాలుఁ గరంబు మెచ్చఁదగు నీచందంబు ప్రాణేశ్వరా!" యని ప్రేమయుఁ బక్షపాతంబును దోఁపఁబల్కు భార్యచందంబునఁ బల్కి, "నీవు నిర్బంధించినస్త్రీ యెక్కడ? చూపు" మని దట్టించి యాసిద్ధునడుగుచున్న నలకూబరాకారుని దియ్యనిమాటలఁ దేర్చి, సిద్ధుని బోవిడుచునట్లు చేసి, యిఁక నిజమైనరంభ వచ్చి యెక్కడఁ గార్యభంగ మొనర్చునో యని శంకించి, యతఁడు బయలు వెడలి వచ్చినచోటికి దూరముగాఁ దీసికొని పోనుంకించినదై, యేశంకకు నవకాశమియ్యని యుక్తిగాఁ "దానిఁ మనమింక వెదకుద" మని తాను నతఁడు, సిద్ధుఁడు తొల్తఁ బరుగెత్తిన తెరవునఁ గడుదవ్వుగా జనియె. ఇట్లు కష్టముల నెల్లఁ దరించి యభిమతకేళిం దేలి నాయక సంయోగమహానందయై,

"... లోలత్వంబున నుండ నచ్చటికి నాలోఁ దత్పదశ్రేణి చొ
ప్పాలోకించుచు రంభ వేడ్కతె డాయన్ వచ్చెఁ జిత్రంబుగన్."

ఈపెయ యప్సరసయయిన రంభ. "నలకూబర విడు విడురా?" యన్నమాటకు మనస్సు చివుక్కురుమని మణికంధరుఁడు, తన్నుఁ బట్టినశనివలె వెడలిపోఁగా, హృదయకాంతుఁడగు నలకూబరుఁ గదిసియుందమని పయనమాత్రకే, నామణికంధరుఁడు తనివితీఱని వాఁడగుటఁజేసి, తనతపశ్శక్తి వినియోగించి నలకూబరాకారుఁడై, తనుఁ గలసికొనఁగాఁ గుబేరనందనుఁడే యని భ్రమించి త్రికరణసుఖ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములననుభవించుచు నీవలికు నుండినయది. అట్లు నలకూబరుఁడా స్త్రీ ప్రలాపంబు విని తద్రక్షణకై వెళ్లి, కొంచెమునరాక, చాలకాలము మనలఁగాఁ దమిఁ బట్టలేక, తామసము నోర్వక, యతని రోయుచు వచ్చి యతనిఁ గన్నులారఁ జూచుటయే కాదు, అతనియొద్దఁ దనప్రతిబింబ మనఁదగు నింకొక రంభను గన్నులుబుకునట్లు పొడగన్నది. నలకూబరుఁడును నీయిరువురంగని విభ్రాంతుఁ డయ్యెను. అయ్యో! కలభాషిణికి వచ్చిన కష్టము! లేకలేక క్లేశపడి సంపాదించినయర్థము క్షణభంగుర మయ్యెడు తెఱంగైన నాదైన్యము చెప్పఁ దీఱునా? ఇఁకపై నీయిద్దఱు సవతులకొట్లాట వర్ణింపఁబడియుండు తెఱఁగు వర్ణింప నాతరము గాదు! ఇది యద్భుతావహము! స్త్రీ ప్రకృతికి దర్పణము! ఎన్ని సామెతలు! తిట్లు! తలత్రిప్పులు! తుట్టతుదకుఁ గన్నీళ్లును! కడపట సత్యరంభ, తమ "తథ్యమిథ్యా భావం బేర్పఱుప" "రా! దేవసభకుఁ బోవుదము" అని పిలచినది. పాపము! కలభాషిణికి నారదు వరమునఁ గామరూపము కలదే కాని, కామగమనశక్తి లేదాయె. కావున రంభచేతిలోఁ జక్కఁగఁ జిక్కినదై చిన్నతనము రాకుండునట్లు, బింకములైనఁ బలికి, త్రోవఁ జూచికొందమను స్త్రీసహజమైన గరువతనంబు మెఱయ నేమనుచున్నది, చూడుఁడు :—

సీ. అప్సరస్స్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీ మేనకాద్యుత్తమస్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నెవ్వారిచే వ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికినెక్కి
నలకూబరుండు ధన్యతముండునా, గరు
వతనంబుచే నీకు వన్నెఁదెచ్చి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. యొప్పునే యింకఁ గడపట నిప్పిశాచి
నాకుసరిచేసికొని దేవలోకసభకు
నీవు నూ నీవునుమ్మని యేవిధమునఁ
గలహ మాడెద నిది నీవె తలఁచిచూడు!

(అ. 3. ప. 232.)

క. ఈకలహ మవుడు వినఁబడు
నాకంబున సురల యానవములేగతి నా
లోకింతుఁ దెగినఁ దెగనీ
నాకు మరుఁడు నిన్ను నిలుమనఁగ రాకునికిన్.

(అ. 3. ప. 233.)

ఇప్పుడేకాదు, ఇంక ముందును "నీయాన ధరణివిడిచి దివికి నడు గటుపెట్ట" ననుచున్నది. మనుష్యాంగన, పోఁజాలదు. ఈలోపముఁ గప్పిపుచ్చుటకై యేమియుక్తి! సరి; నలకూబరుఁడు సంశయాత్ముఁడై యాపెను మెడవట్టి ప్రాయం ద్రోసెను. నిర్నిద్రమోహఫలమా యిది? సత్యరంభయు నాయమను "గత్తిచేతఁ గాయము వాయుము" అని శపించెను. ఉదారచిత్తులకుఁ గష్టములేకదా ప్రాప్తి!

మనోరథ మొకరీతి ఫలించెనేకాని పరిపక్వ మయ్యెననుట నిర్వివాదము గాదు. అయిననేమి? ఈపె ప్రబంధముల రాచకన్నె గాదు గావునఁ గొంచెముతోఁ దృప్తినొందఁగల కోమలహృదయ! ఆకొంచెమునకు మాఱుబేరముగ మరణశాపము వచ్చి పడినను, "ఎట్లును గాంక్షితంబు సిద్ధించె. ఇంకఁ జావుగలిగిన నేమి? శక్తిగుడి యొద్ద దేహత్యాగం బొనర్చెద" నని యచటికివచ్చి, యాస్థానంబునఁ దనవలెనే శాపగ్రస్తుఁడైన మణికంధరుఁడును, దేవీకటాక్షమున ముదిమివీడి కుమారీరూపంబున విరాజిల్లు సుముఖాసత్తియు, మణి స్తంభుఁడును గుమిఁగూడ, వారు వారు చెప్పిన వృత్తాంతములంబట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తన్నుఁగలసిన యతఁడు కుబేరనందనుండుగామి శోకభరాలస యగుడు, నాపెంజూచి మణికంధరుండిట్లనియె.

క. ... ... ... తరుణి, యట్లపుహూపం
బున నున్నవాఁడ నేఁజుమ్ము ... ...

(అ. ౪. ప. ౧౦.)

అనిపలికి

చం. జలజదళాక్షి! యేను మునిశాపభయంబున నెందు నేరికిం
దెలివి పడంగనీక మది ధీరతఁ ద్రిప్పుదుఁగాని నీపయిం
గలదు సుమీ తలంపు మన గానకళాభ్యసనంబు వేళలన్
ఫలమిటు లొందె దానికిని భాగ్యవిశేషవశంబునన్ దుదన్.

(అ. ౪. ప. ౧౬.)

చం. అనుడుఁ గృతార్థనైతిఁ గుటిలాత్మకుఁ డెవ్వఁడు నన్ను నట్లు వం
చనమునఁ గూడెనో యను విచారము వాసెను నీదుపొందు నా
కు నభిమతంబె, నీకుఁదగనన్న తలంపున నీతలంపు నేఁ
గనమిని ద్రిప్పుదున్ హృదయకాంక్ష నిను న్గనుఁగొన్న వేళలన్."

(అ. ౪. ప. ౧౭.)

అనిచెప్పి, యిక్కడను "నీకుఁదగనన్నతలంపు నలకూబరుని యందుంబలె గలదు." అని తనమాటనమ్ముదురో మొగమోటములని వాపోవుదురో యను శంకంజేసి, గరువము నభిమానముఁగల కోమల మానస యగుటచే శపథంబులు ప్రమాణంబులు ననుచితంబులని భావించి,

"ఆసుద్దుల్ హృదయైకసాక్షికము లేమున్నన్ వృథా యిత్తఱిన్."
అని వచించి, నలకూబరునిపై మనసు పోవుటకుఁ గారణ మొండు చూపునదియై,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ... ... ...సముంచితతావకరూపరేఖ చూ
  పేనొకకాంత గల్గఁ గని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్.
(ఆ. ४. ప. ౨౦.)

క. శాపభయంబున నెఱయఁగ
  నీపైఁ గోరిక మఱల్చి నిధిపతిసుతు నే
  పాపపువేళను జూచితి
  నో పయిసాబగేను మఱిగనుంగొన గుఱిగాన్.
(ఆ. ४. ప. ౨౧.)

క. ఆయక్షతనయుఁడని ని
  న్నే యేఁబొందితిఁ దుదన్ వనిన్ మనభాగ్య
  శ్రీ యేమనిచెప్పుదుఁ బడఁ
  బోయినఁ బూఁబాన్పునఁ బడుపోలిక యయ్యెన్.
(ఆ. ४. ప. ౨౨.)

ఉ. శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బఁగఁ బాఱవైచి త
  చ్ఛాయ యొకింత యున్కఁగని చాలఁగ్రహించితి గాజుపూసకై
  నా యవివేక మేమనుకొనం, దుదకమ్మణి యబ్బెనన్న న
  త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్.
(ఆ. ४. ప. ౨౩)

ఆ. ఇట్టిమాట లిప్పు డే నాడుకొనుటయు
  ననుచితంబ, వారవనిత పలుకు
  లిచ్ఛకంబులనక యెవ్వారు నమ్మెద
  రదియుఁగాక దృష్ట మన్యవాంఛ.
(ఆ. ४. ప. ౨४)

అని లజ్జాశోకంబులడర నవనతముఖియై యున్నకలభాషిణికి సమాధానముఁజెప్పి నిదర్శనముగా సుగాత్రీశాలీనుల చరిత్రంబు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వక్కాణించి మణికంధరుం డావెకొందును బోఁగొట్టెను. ఈ నిదర్శన మెద్దానికనఁగా, నొకరిపైఁ బ్రేమయుండినను వారేదేనొక క్రొత్తరీతి నుండినంగాని మతి సమ్మతింపదను శృంగారన్యాయమునకు! ఇది శృంగార విశేషములకుం జేరినభావప్రకృతి. భార్యయందైనఁగాని, సర్వకాల ముల, సర్వావస్థల నేకరీతి యనురక్తుఁడై యుండువారుండరు. ఏదే నొకవిలాసము వహించి యొప్పారిరేని తమి తనంతట రేఁగును. మనుష్యు లును బలుమూర్తులుగలవారు. అందు హృదయవికాసముం గలిగించు నవి కొన్నిమాత్రము. మఱియు నొకరి కొకమూర్తిపైఁ బ్రీతి, ఇంకొకరి కింకొక మూర్తిపైఁ బ్రీతి. రేఖలు, లీలలు, విలాసములు, తత్తద్ధృ దయసారముల ప్రకారము సుఖదుఃఖావహములగుట వింతగాదు.

అయిన నొక్కటి. పైఁజెప్పినన్యాయ మేకపురుషునందును వివిధకాలముల స్త్రీలకు రాగము మారుచుండుటకు హేతుభూతము. ఒకనియందలి ప్రీతి, వానిమూర్తి ననుసరించి హెచ్చుట, తగ్గుట, తెలి సెను; కాని కలభాషిణి వృత్తము వేఱు. ఏకకాలమునందే యిరువురి యెడఁ జిత్తము హత్తినట్లున్నది. ఇది భావ్యమా? మనసు, ఒకేకాల మున నిద్దఱిపై సమముగఁ బాఱునా? అనేకులపై మోహముండుట నిజమా? ఇది కష్టతరమైన ప్రశ్న. మణికంధరుని వలచినది. నలకూ బరుని వలచినది. ఈరీతి నిరువురమీఁద దుర్భరమోహముంబూని యుండిన యొకస్త్రీని జరిత్రముం జదువుటచే నెఱుంగుదును. ఆపె యెవ్వరన, సుమారు నూఱుసంవత్సరములక్రింద ఫ్రాన్సుదేశములో గణ్యాయు విద్యాగంభీరయుఁగానుండి వెలసిన 'లెస్పినాస్' అను నామె. కాఁబట్టి యిట్టి వర్తన మస్వాభావికమనరాదు. అపురూపమనవచ్చును. అపురూపశృంగారముల సూచించిన సూరన్నయే "రవిగాననిచోఁ గాంచెడుకవి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలభాషిణియొక్క తదనంతర వృత్తాంత మింకను గౌరవార్హము. తనశాపంబు దలఁచికొని త్వరలో జీవంబు విడుచుటయ కర్తవ్యమని యెంచి సిద్ధునిం జూచి "యింక జాగేల? నీ ఖడ్గ మకుంఠితోద్యోగము. రంభా శాపమును దానికి సహాయకారి. కానఁ ద్వరలోఁ గార్యంబు ముగించి తత్ఫలంబగు సామ్రాజ్యసుఖంబు ననుభవింపుమా" యని ధృతిమైఁ బలికిన, సిద్ధుఁడు ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు. "నా భార్య నిన్ను ప్రేయఁగూడదని కాళికాదేవిపై నానపెట్టి యుండుటచే మునుపే నలుకఁబోయి యన్నిపాట్లఁ బడితిని. ఇంక నామాట వలదు. ఈ కత్తిని మణికంధరున కిచ్చెదను. అతఁడు దానిని నీపైఁ బ్రయోగించి రాజ్యలక్ష్మీ మహనీయుండగుఁగాక!" అట్లని మణికంధరుని నతిప్రయాసమై యా క్రూరకర్మమునకు ననుమతుంజేసినఁ గల భాషిణియుఁ గోరి కోరి కామించిన వరుఁడు విధిప్రేరణంబునఁ దనకు యముఁడుగాఁగాఁ గాలవైపరీత్యంబునకుఁ జోద్యంబును నప్రమేయశాంతియుం జెంది ధీరభావమై "... ... ... మణిస్తంభునకుఁ దదంగనకుం బ్రణామంబునేసి కన్నీళ్లు గ్రుక్కికొనుచు 'నీ కలంకపాటు తక్కిన భయమునకుఁ గాదు సుండు. మిమ్ము నెప్పుడు గురుభావంబున నారాధింపుచుండ లేమికింగాని' యనుటయును సుముఖాసత్తియు 'నోయమ్మ మన నెమ్మనంబుల కూర్మి యింతటన పోయెనే. మీఁదటనైన నీపతియు నీవుఁ గోరినట్లు మమ్ము గురుభావంబున నడుపుకొనియెద' రనినఁ గలభాషిణి పునః పునః ప్రణామంబు లాచరించి ముకుళితకరకమల యగుచు నిట్లనియె.

(ఆ. ౪. ప. ౧౩౩)

శా. పూతంబైన మదీయ పుణ్యయుగమో పుణ్యంపు టిల్లాల నీ
పాతివ్రత్యము చందమున్ విన మదిన్ భావింపగా నెట్టి దు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్ణీతి ప్రక్రియవారికైనఁ గృపతో సీవిచ్చినం గల్గుఁ దత్
పాతివ్రత్యము నాకు మీఁదనయినం బ్రాపింప దీపింపవే!

(ఆ. ४. ప. ౧౭౮)

క. నావుడుఁ బరమపతివ్రత
వై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తేవర్తిల్లఁగ నలరుచుఁ
బ్రోవుఁడు మముబోంట్ల నీవిభుండును నీవున్.

(ఆ. ४. ప. ౧౭౯)

ఉ. అట్టిటు సంచలింపకు దృఢాత్మత నుండుమటంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పునవి యెయ్యవి, పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్నదాన వతిభవ్యవికాసము నుబ్బుఁ జూడ నిన్
గట్టిగ నెన్న దేవతవుగాని నరాంగనవే మృగేక్షణా!

(ఆ. ४. ప. ౧౮౦)

చ. అని తనుఁబల్కు సజ్జలమహాక్షిని వీడ్కొని సిద్ధవక్త్రమున్
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెద రే యటంచు నా
తనిబలుకత్తిఁ బుచ్చుకొని తా మణికంధరు చేతికిచ్చి యో
గ్య నియమ గంధమాల్యవతియై కలభాషిణి నిర్విశంకతోఁ.

(ఆ. ४. ప. ౧౮౧)

శక్తికి నభిముఖయై కూర్చుండెను. స్వహస్తముతోఁ గత్తి నిచ్చుటేల? ప్రియునకు మనస్సంకోచము వాయుట కొఱకు. సత్యమైన వలపునకుఁ లక్షణ మిదియ. తమ కెన్నివచ్చిన నేమి? ప్రియులు సుఖంబున్నఁ జాలు. ఖడ్గప్రదానానంతర మతని మనసు గట్టిపడు నట్లుగా

క. సమరంబున నెదిరించిన
సమదాహిత వీరవరులఁ జక్కడఁచుట, నై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జముమీఁకు నెట్టియెడలఁ
బ్రమయక చేమఁటివకునికి పటుశౌర్యమునఁ.

(అ. ౪. ప. ౧౧౪)

అని తెలిపి కలభాషిణీదేవి యతనిచేత నిరస్త జీవయాయెఁ!

ఈపాత్రముఁగూర్చి యింత విపులముగ వ్రాసినందుకు క్షమాప ణార్థమై కారణములఁ జూపవలయు. సూరనార్యుని వాఙ్మయసృష్టినెల్ల నియ్యది నిస్సంశయముగ నగ్రగణ్యము. దీనికిం దీటగు చరిత్ర మింకె య్యదియు లేదు. శృంగారవర్ణనముం జేయుటలోఁ బ్రబంధముల వెట్టు లేవియు వేయలేదు. నలకూబరునికై నాలుగేండ్లకంటె నెక్కువగఁ గాచియుండెఁగదా! ఇష్టముండినఁ, జెలికత్తెలతో మొఱలిడుట, ఉద్యానవనములోఁబడి పొరలుట, చంద్రాది దూషణము—ఇట్టి వికారచేష్టలన్నియుఁ జేసినట్లు చెప్పియుండవచ్చును. కాని, కవి యీవిషయములఁ దలంపనైన లేదని తోఁచుచున్నది. భావనాశక్తిమై వ్రాయువారలకు మనసు పాత్రములయందె లీనముగనుండుఁ గావున సహజరాగములు దప్ప నితరములు దట్టవు. మఱియు నీశాస్త్రీయ ఘోషలకు మధురలాలసా చరిత్రములోఁ బ్రవేశమున్నది గాన నిట ననవసరములని కవి వానిని విడిచిపెట్టెనేమో! కారణము లేమేట నైనఁ బోనిండు, మనకు లభించినదన్నో మనసు వశముగాక పోవు నంత రమణీయమైనకథ. కవికిఁ గృతజ్ఞతమై నమస్కారము, రసికులకు స్వాగతమును.

ఇంత మంచి సుందరమగు పాత్రమువర్ణనము శోకాంతముగాఁ జెప్పుట కిష్టము లేమిచేతనో, మఱి, మనకవులకుఁ బట్టిన దౌర్భాగ్య మతంబు కతంబుననో మణికంధరఖండితమస్తకయగు నాలలనాశిరో మణి కాళికాదేవి కరుణాప్రసాదంబున "పునస్సహిత మస్తకయు, నిజపురీవర్తినియునై తన బంధు మిత్రాదుల నలరించుచు" సుమారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండు సంవత్సరములుండి పిమ్మటఁ గాలప్రాప్తమరణ యాఁయెనని కరుణ రస ప్రధానమగు నీ భాగముయొక్క సొంపును గవి వికలంబొనర్చి యుండుట భాషాదుర్దశగదా? రసములలో శోకము నొక్కటి. ఇది మాత్రము నిషేధ్యమునవేల? శోకప్రధానముగా వ్రాసినఁ గవిత్వము మొక్కపోవునా? మొత్తముమీఁద భారతమే శోకాంతమఁట! దానికి రాని తక్కువ పెలవానికి వచ్చునా?

ఇట్టి యుద్గ్రంథమునఁ గల్పనాభంగములుండుట చింతనీయము! కృష్ణుని భార్యలయొద్ద కలభాషిణీనారదులు గానవిద్య నేర్చికొనుటకై కడపిన కాలము నాలుగేండ్లు. మణికంధరుఁ డంతఃపురములోనికిఁ బోఁగూడదని యేమో, వానికీప్రయాస మావంతయు లేకయ "పుండరీకాక్షుని యనుగ్రహ విశేషంబున సకలరహస్య సంగీత విద్యా సంపన్నతచేత నారదకలభాషిణుల యట్ల యత్యధికుండగు" భాగ్యము లభించినది. ఈయనుగ్రహ విశేషముఁ బ్రయోగించి, వారికిని సద్యః కాలవిద్యామహనీయత ఘటించి కలభాషిణీవిరహకాలమును మట్టు చేసి యుండరాదా? కృష్ణకాంతల శిక్షయు ననావశ్యకమాయె. దానితోఁ గల్పనయు న్యూనమాయె.

ఇట్లే మధురలాలసాచరిత్రము మొదలు తక్కిన భాగములలోఁ గల్పనాలోపములు పెక్కులు గలవు. ఇందుఁ గవి శృంగారమునకు దిగి పాడుప్రబంధధోరణికిం జెందిన ముఱికినంతయు సుగంధమని దట్టముగఁ బట్టించుచున్నాఁడు. గతానుగతికముగా వ్రాయుచున్నాఁడే కాని స్వబుద్ధిపొంతఁ బోవునట్లుకానము. భావములు రమ్యములుగావు; రుచిరములుగావు. పాట ప్రాత; మాట రోఁత. మధురలాలస చిన్న నాఁటినుండి కళాపూర్ణునిపై మోహోద్రేకముఁ గొనియుండుట, ఆకస్మికముగా నిరువురకుఁ బరస్పరదర్శనములభించుట, ఉద్యానవనగమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నము, జలక్రీడాదులు, శైత్యోపచారములు, చంద్రాదిదూషణము, వివాహము, సాంగోపాంగరతివర్ణనము మొదలగునవన్నియు లక్షణానుసారముగాఁ బొందింపఁబడినవి. నిష్కారణముగా సూర్యచంద్రోదయవర్ణనములు, కళాపూర్ణుని దిగ్విజయము, యుద్ధము, దౌత్యము మొదలగువానినిగూడ వర్ణించి కవి సకలలక్షణసంపన్నతాప్రతిజ్ఞను జెల్లించుకొనుచున్నాఁడు. ఆప్రతిజ్ఞ దుష్ప్రకృతి యటఁ దేటతెల్లము. సంభాషణమూలమునఁ గథకు నభ్యుదయము గల్పించుట మొదలగు కవితాశక్తులన్నియు నీఘట్టమునకు వచ్చునరికి సూరన్నలో నుండక లేచిపోయినట్లున్నది. ప్రతిభలేని పాడుకొంపలీభాగములు. నిరర్థక పద్యపూరితములు! అలంకారాది శాస్త్రములయందలి మూఢభక్తి పటుతమము!

భావనాశక్తిచే ననర్గళముగఁ బ్రభవిల్లుభాగములయొక్క చక్కఁదనము పాండిత్యబలంబుమై నేర్పడినవానికి రాదనుట యీ భాగ విమర్శనముచే విదితంబు. సూరనార్యుఁడు రెంటియందును బ్రగల్భుఁడు. రెంటినిఁ జూపింప నిశ్చయించిన వాఁడగుట నాంధ్రంబున నసదృశంబగు కావ్యంబు కళాపూర్ణోదయంబు సృజింపఁబడియె. ఇది నిర్దోషంబు గాకపోయినను అనన్యసాధారణగుణగణవిభాసితంబగుటఁ గావ్యోత్తమంబనఁ జెల్లునది. ఇందు నవరసము లున్నవి. అష్టాదశ వర్ణనములున్నవి. ఏకరసంబుగాకునికి మేల. అయినను సర్వరసముల వర్ణనలఁజేర్చి యొక కథ వ్రాయఁజూచుట యసాధ్యముగాకపోయినను సామాన్యసాధ్యంబుగాదు. భారత రామాయణము లట్టి విస్తారేతిహాస ములం దప్ప నన్యంబుల సర్వసౌభాగ్యములకు నాస్పదంబుండదు. అపారపారావారంబుంబోని మహాచరిత్రముఁ గల్పించినఁగాని, రస సంచయము లెల్ల నందు యుక్తగతిని నిలువఁజాలవు. అట్లగుట నీగ్రంథమున నసంగత ప్రశంసల వేయవలసెను. అపరభాగము ప్రబంధము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లకుఁ జేరినది. పరిమితి ప్రాశస్త్యము. పూర్వభాగ మప్రమేయప్రభావము. దానిని గూర్చి యెంత నుతించిన నత్యుక్తి గలుగదు. అందలి కల్పనలు, సందర్భములు మహేంద్రజాలము లట్లాశ్చర్యకరములు. శైలి ప్రావీణ్యమన్ననో వాచాతీతము! మౌనముగఁ గ్రోలి హృదయము పరవశముగా నానందింపవలయునే కాని, మాటలఁ దమి యాఱదు. పాత్రముల వచనములు మధురసుధాధారలు!

అట్లగుట శ్రీ పింగళి సూరనార్యునియెడఁ గృతజ్ఞతయు భక్తియుఁ జూపనెంచిన వారును, సహజముగఁ దమకుంగల రసతృష్ణను దృప్తినొందింపఁ దలంచువారును నైన రసికులెల్లరు నీకవికులోత్తంసుని కృతులఁ బలుమాఱు పఠించి కృతార్థు లగుదురుగాక!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

1

# శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి

## కృతులు

### పీఠిక

---

ఈకృతులను రచించినవారు నాముత్తాతగారైన పెద్దరామలింగారెడ్డి. వీరు పుట్టినసంవత్సరమేదియో తెలియదు. చనిపోయిన సంవత్సరము మాత్రము వీరికృతులు లిఖింపబడియుండు తాటాకుపుస్తకములో నింగ్లీషున వ్రాయఁబడియున్నది. "Ramalinga Reddy died in 1850." బహుశః మాతండ్రిగారైన కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డిగారీయంశమును వ్రాసియుందురు. చనిపోవుకాలమున వీరివయస్సెంతైయుండునదియు నికరముగాఁ దెలియదు. వదంతిమాత్రమరువదియేండ్లని. దినదినమును బురాణములు కల్పనకువచ్చుచుండు మన హిందూదేశములో వదంతులెంతదట్టముగానున్నను బ్రమాణములు కానేరవు.

మాముత్తాతగారియూరు చిత్తూరునకు సుమారు ముక్కాలు మైలు సమీపములోనుండు కట్టమంచి. చిత్తూరునకుఁ గట్టమంచికి మధ్య నొక చిన్నచెఱువున్నది. భోగముదాని చెఱువని దానిపేరు దానినుండి సాగింపఁబడు పాఱుదలవల్లనే మాకుజీవనము. మాప్రాంతములలో భోగమువారివల్లఁ గట్టింపఁబడిన చెఱువులనేకములుగలవు. ఆకాలమున విద్యావాసనగలిగిన యల్పసంఖ్యాకులలో వీరును నొక్కరుగానుండుటయు దేవదాసీత్వమునఁ జేసి కొంతకుఁగొంత కైంకర్యబుద్ధి గలవారగుటయును వీరి యీధర్మకార్యములకు హేతువులుకాఁబోలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈకృతులలో ననేక దేవతలు స్తుతియింపఁబడియున్నారు. వారిలో ననేకులు మాగ్రామములోని దేవతలు. కట్టమంచిగ్రామ మాకారమునఁ జిన్నది. నిర్మాణమునఁ జక్కనిది. పశ్చిమమునఁ జెఱువు; ఉత్తరమున నేడాదికి మూన్నాళ్లముచ్చటగాఁ బాఱు నదియొకటి; టెంకాయతోఁటలు; మామిడితోఁటలు; వర్షాకాలమునఁ బచ్చనిమళ్లు; విశాలములైనవీథులు—ఈ మొదలగు సౌభాగ్యములచే సొంపైనయూరు. దేవాలయములన్నో పెద్దపట్టణమైన చిత్తూరులో సుప్రసిద్ధమైనది యొక్కటియే యుండఁగా, మాయూరిలోనివానిసంఖ్య యాఱు. అందు శివాలయము చాలపెద్దది; చోళప్రతిష్ఠ; గంభీరమైన గాలిగోపురముగలది. 1895 వ సంవత్సరమున మాతండ్రిగారు దీనిని మరామత్తు చేయించిరి. ఈశివుని పేరు తత్త్వకొలంబీశ్వరుఁడు. బాల్యేశ్వరుఁడనియు నందురు. అంబపేరు కామాక్షి. విష్ణ్వాలయము రెండవది. అనఁగా విస్తీర్ణమున. ఈవిష్ణువుపేరు వరదరాజస్వామి. మాపాచివిఘ్నేశ్వరుఁడు చిత్తూరునకుఁ బోవురోడ్డుప్రక్కన నెలకొల్పఁబడియున్నాఁడు. మేము పరీక్షలకుఁ జిత్తూరునకుఁ బోవునపుడెల్ల జయసిద్ధికై మ్రొక్కుకొనుట యీదేవునికే. ప్యాసైనయెడలఁ డెంకాయలుగొట్టి, కర్పూరము వెలిగించుటయుఁ దప్పినయెడల స్వామిని దిరస్కరించుటయు మాపద్ధతులు. నాకు చాలమంచిస్వామి, నేనెప్పుడు పరీక్షలలో నోటమిచెందనందున. మఱియు నదేరోడ్డుప్రక్కనే యాంజనేయస్వామిగుడి యొకటున్నది. ఇవిగాక దుర్గమ్మగుడి యొకటియు, మాయింటివారు ప్రతిష్ఠించిన విఘ్నేశ్వరాలయము, శ్రీరామభజనమందిరము, ఇవన్నియు నున్నవి. కట్టమంచికి 12 మైళ్లదూరములో అరగొండ యనుగ్రామమున్నది. ఈ రెంటికిమధ్య కాణిపాకు, బ్రహ్మపల్లె యను నూరులున్నవి. తూర్పున నైదుమైళ్లదూరమున వేలుక్కారు అనుపల్లె కలదు. వేలుక్కారనిన నాయూరివారికిఁ గోపము. సహస్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురమఁట. దీనినుచ్చరించుశక్తిమాత్రము వారికిలేదు. ఈస్థలములలో మాబంధువులు ప్రబలియున్నారు. మాముత్తాతగారీగ్రామములనన్నింటిని బంధుదర్శనార్థమో, మఱి యే కారణముననో సంచరించియుందురు. ఈ యన్నిగ్రామములలోని యధిష్ఠాన దేవతలను స్తుతించియుండుట పాఠకులకు స్పష్టము.

నాగురువులైన కుప్పనయ్యంగార్లకు వీరు భాషాగురువులుగా నుండిరని యాకుప్పనయ్యంగారే నాతోఁ బలుమార్లు చెప్పఁగా విని యున్నాను. కుప్పనయ్యంగారిచే మాతాతగారి తాటాకుల ప్రతిలో వ్రాయఁబడిన యీ క్రిందిపద్యము దీనికిఁ దార్కాణమనవచ్చును.

" భారద్వాజసగోత్రజుఁడారయ రంగార్యపుత్త్రుఁడతులిత తేజ ।
స్ఫారగుఁడు కుప్పనార్యుఁడు వారకయష్టకములెల్ల వ్రాసె ధరిత్రిన్ "॥

గురుత్వమేట్టిదోకాని మాతాతగారు వ్రాసిన కృతులు మాత్రము సలక్షణములని చెప్పనెవ్వరికిని గాదు.

ఈ కుప్పనయ్యంగారి సహోదరి నానమ్మ యనునామెను నేను బాగుగ నెఱుఁగుదును. ఈమె 1896 వ సంవత్సరప్రాంతమున 70 ఏండ్లకుఁ బైగా బ్రదికి చనిపోయెను. ఈపె రామలింగారెడ్డిగారి జీవితచరిత్ర ననేకపర్యాయములు చెప్పఁగాఁ బురాణ శ్రవణము చేసినవాఁడను. ఈమె రామలింగారెడ్డిని బాగుగా నెఱిఁగినదఁట. తన యన్నయొక్కగురువు గావున నిందేమియు వింతలేదు.

రామలింగారెడ్డి పొడుగైన మానిసి. ఆజానుబాహువు. నిమ్మపండువంటి దేహచ్ఛాయవాఁడు. ఒకానొకప్పుడు మాయూరి మీఁదుగా బెంగుళూరునకుఁ బోవుచుండు పటాలమువారు, వారిని బలాత్కారముగా సైన్యములోఁ జేర్చుకొని పోయిరఁట. అప్పుడు నానమ్మపోయి సేనానాయకునితోఁ దనకితఁడొక్కఁడే సోదరుఁడనియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జీవనాధారమునకు నింకెవ్వరులేరనియు మొఱపెట్టి విడిపించుకొని వచ్చెనఁట. పూర్వము పటాలములు మాయూరి సమీపముగాఁ బోవుచుండెడివిగాన ఈవిషయము ప్రాయోభావమునకు విరుద్ధము కాదు. ఇంక నానమ్మ యేలపోయి యుండవలయునన్న, నీకార్యము స్త్రీరాయబారముచేతనే కావలసినది. మా రెడ్డిసానులు విద్యావతులు గారు. నానమ్మ, తెనుఁగు చక్కఁగాఁ జదివిన యాఁడుది. కాఁబట్టి యూరివారామెను బతిమాలుకొని తోడ్కొని పోయియుందురు. నానమ్మగారు మాయింటివారికెల్లరకుఁ జాల కావలసిన మానిసి. నా చిన్నతనములో నాపె సులోచనములు ధరించి, వేంకటేశ్వర మాహాత్మ్యము చదువుచుండఁగా వినుచుండెడివాఁడను. ఆపెయుఁ బొడుగైన మానిసి; ఎఱ్ఱని దేహవర్ణము గలది. వయస్సున బహు సౌందర్యవతిగానుండి యుండును. గుణమున మిక్కిలియు గొప్పది. నేనామెను " అవ్వ " యని పిలుచుచుంటిని.

రామలింగారెడ్డి వివాహమువిషయమై యాపె చెప్పిన వృత్తాంతమిది. ఆయన చాలయేండ్లవఱకుఁ బెండ్లివద్దని నిరాకరించుచుండెనఁట. తండ్రియైన కొళందరెడ్డి, కారణము చెప్పుమని తొందర పెట్టఁగాఁ దనకు విరక్తి ముదిరినదనియు సాంసారిక చింతల నేమాత్రము పెట్టుకొనఁజాలననియు, సంసారభారమంతయు నసహాయ శూరురాలుగ నిర్వహించెడు కన్యయెవరైన నుండిన నాపెను బెండ్లాడుదుననియుఁ దన మనస్సూత్రమును వెల్లడించెనఁట. పిమ్మట నీనియమముల కంగీకరించిన చెంగమ్మ యను ముద్దరాలు లభించఁగా వివాహమున కొడంబడి చేసికొనెనఁట. ఈ కథయందును గొంత సత్యముండ వచ్చును.

మా ముత్తాత యూర్లు విశేషముగఁ దిరిగెడివాఁడని యీ కృతులచే గ్రహింప వచ్చును. మఱియుఁ బూర్వము కవులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తలుచుగా ఋషులట్లు పరిగణింపఁబడుచు వచ్చిరి. కాఁబట్టి కొంత వఱకు వీరు సంసారవిషయముల నశ్రద్ధచేసి యుండిరేమోయని యనుమానింపవచ్చును. మాముత్తవ్వ చాలమంచిదని ప్రసిద్ధి. ఈదంపతులకార్వురు కొడుకులుపుట్టిరి. వారిలో రెండవవాఁడైన వీరరాఘవరెడ్డియొక్క మనుమఁడను నేను.

రామలింగారెడ్డి పాకనాటిశాఖకుం జేరినవాఁడు. తండ్రిపేరు కొళందరెడ్డి. తల్లి చిన్నమ్మ. గురువు మాయూరికి 12 మైళ్ళ దూరముననుండు అరగొండ గ్రామములోని కృష్ణమాచార్యులు. ఆయన రాములపూజను, చౌడమాంబార్చనను జేయువాఁడు. రామలింగారెడ్డి కాయనవలన వచ్చినవిద్యలు, మంత్రశాస్త్రము, జ్యోతిషము, కవిత్వము. ఇందులోఁ గణపతి రెండువిద్యలను కుప్పన్నయ్యంగార్లకుఁ బ్రసాదించిరి. సంగీతమునందును బ్రగల్భులు. ఇది యెక్కడనుండివచ్చిన దిగుమతియో నాకుఁ దెలియదు. వీరి పాటలు పూర్వము మాగ్రామములలోఁ బాడుటకలదు. ప్రకృతము లేదు.

ఒకానొకప్పుడు శిష్యులైన కుప్పనయ్యంగార్లు, బురదలో దిగఁ బడి నడవఁజాలక, గనిమమీఁదఁ బోవుచుండిన రామలింగారెడ్డి గారిని వచ్చి చేయూత నిమ్మని సంస్కృతములో నాక్రోశించిరి. ఆకూత సవ్యాకరణముగా లేనందున, దానిని దిద్ది పునశ్చరణముచేసి ననేకాని రానని కోపించుకొనిరఁట. ఈ యితిహాసము కుప్పనయ్యం గారే యొకానొకప్పుడు క్లాసులోఁజెప్పిరి. ప్రాణాలకైనను వ్యాకరణము హెచ్చేమో యాకాలపు గురువులకు!

ఈయన మహాకవియని మాబంధువులలో గొప్ప ప్రసిద్ధి. నేను పుట్టిన లగ్నమును, మఱికొన్ని చిహ్నములును, భావిపాండిత్య సూచకములని కుప్పనయ్యంగార్లు వారిపేరు నాకుఁ బెట్టిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారి కృతులను మా తండ్రిగారు ముద్రింపఁగోరి మెత్తి వ్రాయించిరి. భాస్కరశతకము వ్రాయించుచున్నప్పుడు పుట్టినందు వలన మా కడపటి తమ్మునికి భాస్కరనామధేయము కలిగినది. ఈ వ్రాయసముకార్యము ముగింపునకు రాకమున్నె సుబ్రహ్మణ్యారెడ్డి గారు కాలధర్మము నొందిరి. నా కొఱకుఁ దాటాకులప్రతిని గాగితములకుఁ బరివర్తించినవారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. పిమ్మట భాస్కరుని సాహాయ్యముచే నీప్రచురణకార్యమేదో యొకవిధముగా నెఱవేఱినది.

ఏదో యొకవిధముననుట యేలనఁగా ఇన్ని యచ్చుతప్పులతోఁ బ్రచురించినందుచేఁ గలిగినదోషము నొప్పుకొనుటకు. ఈగ్రంథమును మదనపల్లెలో, నచ్చట డిస్ట్రిక్టుమునిసిబుగానుండు నాతమ్ముఁడు భాస్కరరెడ్డియొక్క విచారణక్రింద నచ్చువేయించితిని. వాఁడు స్వయముగా నీముద్రణకార్యమును జూచుకొనునంత కాలసౌలభ్యము లేనివాఁడు, కాన నిట్లాయె. ఇంతకంటె నెక్కువ చెప్పఁజాలను. గ్రంథకర్తగారి విలక్షణములకుఁదోడు ముద్రణదోషములు వచ్చిపడినవి.

ఈ గ్రంథముద్రణోద్దేశములు రెండు. పితృభక్తి చెల్లించుట; బంధువులకు నర్పించుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨

# భారతసారముక్తావళి

## కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డియొక్క సంక్షేపచరిత్రము.



ఈ భారతసారరత్నావళిని సంపుటీకరించినవారు నా తండ్రియైన కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డిగారు. వీరు చనిపోయి యిప్పటికి ముప్పది రెండు సంవత్సరములైనప్పటికిని వీరి పేరింకను మా జిల్లాలోను, ఇతర స్థలములందును పచ్చగానేయున్నది. 1923 వ సంవత్సరములో జరిగిన జనరల్ ఎలక్షనునందు మద్రాసుశాసన సభికత్వమునకు నర్థులుగా నిలిచి పోటీసల్పిన వారిలో నేనును ఒకఁడను. ఆ సందర్భమున గ్రామ గ్రామ సంచారము చేయవలసిన వాఁడనైతిని. ఎక్కడకు వెళ్ళినను "కట్టమంచి సుబ్బారెడ్డి కొడుకువచ్చినాఁడు. అతనికి మనము వోట్లియ్యవలసియున్న"దని మా తండ్రిగారి పుత్రుఁడనను సన్మానమే కాని నాకు వేఱుగ నాపరమైన సన్మానము తఱుచు లభించినది కాదు. ఒకానొకప్పుడు కాళహస్తినుండి నా మిత్రుఁడు కోటిగారి రంగయ్యసెట్టియు నేనును మోటారుబండిలోఁ దిరుపతికి వచ్చుచుండఁగా, మార్గమధ్యమున మేళతాళవాద్యములతోఁ గృష్ణాపాళ్యం జమీందారుగారు వేచియుండిరి. వారికిని నాకును బరిచయములేదు. ఉత్తరప్రత్యుత్తరములును లేవు. పిమ్మట విచారింపఁగా నీ సన్మానమునకు హేతువు, పూర్వము మా తండ్రిగారు ఆ జమీందారుగారి కొనర్చిన మహోపకారమని తెలిసినది. వీరివలె బ్రిటిష్ప్రభుత్వమువెనుకఁ జిత్తూరుజిల్లాలో విమలమైన యశస్సు నార్జించిన వారింకెవ్వరును లేరు.

మా యింటిలో నాంధ్రభాషాభిమానమును, గొంతవఱకుఁ బ్రవీణతయుఁ బారంపర్యముగ వచ్చుచున్నవి. ఈ సందర్భమునఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దొలుతఁ జేర్కొనఁదగినవాఁడు భాస్కరశతకాది కృతికర్తయగు పెద్ద రామలింగారెడ్డి. వారికృతు లిప్పుడే ముద్రింపించి ప్రచురించుచున్నాఁడను. అవి కవిత్వధోరణిగాఁ గాని లాక్షణికసంప్రదాయముగాఁ గాని పరిశీలించిన యెడల మిక్కిలి ప్రశస్తములుగావు. అయినను సుగ్రామమైన కట్టమంచిలో నూతేండ్లప్పు డిట్టి చిల్లరకవియు గొప్ప కాళిదాసుగాఁ బరిగణింపఁబడెనేమో!

పెద్దరామలింగారెడ్డి, యొక్క కవిమాత్రము కాదు. సంస్కృతము, జ్యోతిషము, మంత్రశాస్త్రము, షట్ప్రయోగములు మొదలయినవానిని అంగొండ కృష్ణమాచార్యులవారియొద్ద నేర్చుకొనినవారు. మా ముత్తాత యయిన యీ రామలింగారెడ్డి శిష్యుఁడు కుప్పనయ్యంగారు. వీరు చిత్తూరు హైస్కూలులోఁ దెనుఁగు పండితులుగా నుండి యఖండమైన పేరును సంపాదించిరి. వారి శిష్యమండలికిఁ జెందినవారిలో నొక్కఁడను నేను. *

మా తాత వీరరాఘవరెడ్డికాలమునకు మా యిల్లు కడుబీదస్థితికి వచ్చినది. ఇది హిందూ సహకుటుంబదాయభాగాచారప్రభావము. కొళందరెడ్డి కిరువురు కొడుకులు. పెద్దరామలింగారెడ్డి, చిన్నరామలింగారెడ్డి. వీరికి నొక్కొక్కరికి నార్గురు పుత్రులు. కొళందరెడ్డియొక్క యాస్తి పండ్రెండు భాగములు కావలసివచ్చెను. ప్రతిజ్ఞాతికి లభించినది కొంచెము నేలయు నెక్కువ యహంభావమును! చిన్నరామలింగారెడ్డియొక్క వంశము నేటి కించుమించుగ నిరవశేషము. పెద్దరామలింగారెడ్డి సంతతిలో నాలుగు శాఖలు నిలిచియున్నవి.

బీదతనము కారణముగ వీరరాఘవరెడ్డి గుమస్తాపనిలో దిగుటయకాక నా తండ్రులకు విద్యకూడ నేర్పింపఁ జొచ్చెను. అందులో మేధాశాలియైన సుబ్బారెడ్డి ఇంగ్లీషువిద్య సయితము నేర్చుకొననారం

* కుప్పనయ్యంగారి సర్వలక్షణ సార సంగ్రహముయొక్క పీఠికను జూడనగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భింపఁగా, నింత సాహసమా వీనికి, నింత గర్వమా, మించిపోవుటకుఁ బ్రయత్నించుచున్నాఁడా ? యని పాలివారు ప్రతికూలించి తండ్రికిఁ గొడుకునకు నానావిధములైన కష్టములఁ గలిగించిరఁట. సహకుటుంబములయొక్క యనివార్యవిలక్షణ మీార్ష్య. తండ్రి యుద్యోగి, కొడుకు చదువరి. ఈ దోషములకుఁ జేయవలసిన పరిహారము లన్నియుఁ బ్రయత్నించి చూచిరిగాని సుబ్బయ్యయొక్క పట్టుదల చలితమైనది కాదు. ఉదయమునఁ జల్దిఁ దిని పుస్తకము లెత్తుకొని, యొక్క మైలు దూరములో నుండు చిత్తూరునకు వెళ్లి వారిని వీరిని నాశ్రయించి, ఇంగ్లీషు, తెనుఁగు నవకాశము కొలఁది నభ్యసించెను. నా తండ్రికి నాకు వలెఁ గ్రమమైన శిక్ష లభింపలేదు. పాపము ! ఒక్కనాఁడిక్కడ నింకొకనాఁడక్కడఁగా, ముక్కలు ముక్కలుగా గ్రహింపవలసిన విధివారిది. అయినను స్వయంకృషిప్రధానమయిన విద్య కావున నది చక్కఁగా నాటి ప్రతిదినప్రవర్ధమానమై నిత్యవసంతోత్సవముగ నెగడినది. వీరు ఇంగ్లీషులో ప్యాసుచేసినది. "ప్రాఫిషెన్సీ టెస్టు." ఈ టెస్టు నా పుట్టకకుపూర్వమే యెత్తివేయఁబడినదికాఁబోలు. వారు చదివిన ఇంగ్లీషు వ్యాకరణము పత్ట్రేగారికృతి. నా కాలమునాఁటికది మృగ్యము. నేను 5-వ ఫారములోఁ జదువుచున్నప్పుడు "రామలింగం! ఏవ్యాకరణము పనికిరాదు నీకు. Marray's Grammar చదువు. అది చాల మంచి పుస్తకము." అని కృతయుగబోధ చేసిరి. కాని చెన్నపురినంతయుఁ గాలించి చూచినను ఆ యాదిమవ్యాకరణము దొరకలేదు. చిత్తూరు హైస్కూలు హెడ్మాష్టరులకందఱకును మిన్నయనఁదగు తిరువేంగడసామినాయఁడుగారియెడ మా తండ్రికి భక్తి యెక్కువ. భయ మంతకంటె రెండింతలు. ఆ నాయఁడుగారు సర్వంకషప్రతిభులు ; ఇంగ్లీషునందు సంపూర్ణపాండిత్యము ; గణితశాస్త్రములో నసమాన ప్రజ్ఞ ; తెనుఁగు, సంస్కృతము, సంగీతము, వీణ, బెత్తముపెట్లు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏదైననను సరే, వారు పెట్టినదే బిచ్చము, వారి దెబ్బేదెబ్బ! "చిత్తూరి పులి (Tiger of Chittoor.)" అను భీకరమైన పేరు వహించిన వారు. కాలేజీ లెక్చెరరుపనిని బుచ్చుకొమ్మన్నప్పటికిఁ జిత్తూరును విడ నాడనని నిగ్రహించిరి. భూస్వాములు వారియొద్దఁ జమువు నేర్చుకొను టకు విక్రమార్కుని సాహస ముండవలయును. సాహసమును శ్రద్ధయు నుండినయెడల ఆఱునెలలలో నాతేండ్ల విద్యాభివృద్ధి సిద్ధము. ఇట్లు ఖండవృష్టిగ విద్యాకృషి సల్పినవారయ్యును నా తండ్రి యాంధ్రాంగ్లే యములయందు గొప్ప పాండిత్యమును బడయఁజాలెను.

"పరమక్లేశమునఁ జేసి వడసినవిద్యల్ స్ఫురియించుగాక"

వీరి యింగ్లీషు లాలైబ్రరీ (Law Library) యంత భండా గారమును చిత్తూరు B. A. B. L లు ఎవ్వరు సేకరించలేదు. తెనుఁ గున వీరు చేసిన కృతులే వీరి రసికత్వమునకును వివేచనకును సాక్ష్యములు.

తొలుత మాతండ్రిగారు పిత్రాచారమును బట్టి గుమాస్తాపనిలో దిగిరి. కొన్నియేండ్లకు జిల్లాకోర్టులో రికార్డుకీపరైరి. త్వరలో నాపనికి రాజీనామా యిచ్చి కార్వేటినగరసంస్థానములో మేనేజరుగాఁ జేరిరి. అక్కడిరాజుల విపరీతరాజసము తనకు సరిపడనందున దానిని వదలి ఫస్టుగ్రేడు ప్లీడరుసన్నదును సంపాదించుకొని వకీలు వృత్తి నాశ్రయించి దానికిని దనకును నసాధారణమైనకీర్తిఁ దెచ్చిరి.

తాను కోర్టులో గుమాస్తాగానున్నప్పుడు జడ్జీగానుండిన "కాలేటు" గారును, "రాబర్టు" గారును దనయెడఁ జాల నభిమానము వహించి యన్నివిధములఁ బోషకత్వముఁ జూపిరి. చాల క్లిష్టములైన వ్యవహారములలో రహస్యముగఁ బిలిచి తన యభిప్రాయములనడిగెడివారు. వారియందలి కృతజ్ఞతను జూపుటకై తాను నూతనముగ సృష్టికిఁ దెచ్చిన రెండు మామిడిరకములకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కాలేటుపసందు," "రాబర్టుపసందు" అని నామకరణముల నిడిరి. ఈ జాతులు మా తోఁటలలో నున్నవి.

సుబ్రహ్మణ్యారెడ్డిగారి వకీలువృత్తి యనన్యసదృశము. ఆది నొక క్రిమినల్ కేసులోఁ దన కక్షిదారునికి నురిశిక్ష ప్రాప్తమైనది. ఆనాఁడు మొదలు క్రిమినల్ కేసులనుగైకొనుటను విడిచిపెట్టిరి. నాతో నొక్క నాఁడీ విషయమైమాటలాడుచు "నాక్లయంటునకు మరణదండనయను మాట విన్నచే నాకంఠమునకే యురిత్రాడు బిగింపఁబడినట్లు స్తబ్ధుఁడ నైతిని. నాఁడు మొదలు మనఃక్లేశము నేమాత్రమైనఁ గలిగింపఁజాలు కేసులను స్పృశింపనని వ్రతముఁబాల్చితి" నని నుడివిరి. ఇది నిజముగా భీష్మవ్రతము. వీరి సత్యసంధతయొక్క ప్రభావమెట్టిదనఁగాఁ దానే ప్రక్కను వకీలుగానుండిన నదియే సత్యమయిన పక్షమని జడ్జీలు భావించువారు. సత్య మేదికో యాదిక్కే సుబ్బారెడ్డి. కాఁబట్టి వారి పక్షమున కనుకూలించునట్లు తీర్పు. ఈభావధోరణి చిత్తూరు జిల్లాజడ్జీల నావేశించి యున్నందున నొకానొక మహంతుపై గొప్ప క్రిమినల్‌చార్జి తేఁబడినప్పుడు, నేను మాతండ్రిగారి యాఫీసుగదిలో నుండగా నా మహంతుగారే వచ్చి, నా తండ్రి నాశ్రయించి "మీరు మాపరము వకీలుగా నుండునట్లు పేరునర్పణ చేసినఁజాలును, మీరు కోర్టునకు రాఁబనిలేదు. వాదింపనక్కఱలేదు. నా పక్షపు వకీలను మాటమాత్రముండినఁ జాలును, ఇదిగో మూఁడు వేల రూపాయలఫీజు. చాలదన్న నింకను ఇచ్చుటకు సంసిద్ధుఁడను. కోరినంత యిచ్చెదను" అని చిన్నబాలుఁడనుగా నున్న నాకు నయితము దుఃఖము వచ్చునట్లు దీనతతోఁ బ్రార్థించినను సుబ్రహ్మణ్యారెడ్డి వ్రతభంగమున కొర్వనని యంగీకరింపలేదు. వీరికి ధనాశ మొదలగు నేదురాశలుఁ బట్టినవి కావు.

అయినను మాతండ్రియొక్క కక్షిదారులలో నొకఁడును స్నేహితులలోఁ ముఖ్యుఁడును నయిన నెమ్మిలి వీరాస్వామి రెడ్డిగారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొందరపెట్టుటచే, నొకానొక పెద్దమనుష్యుని, అన్యాయముగా నారోపింపఁబడిన క్రిమినలు దావానుండి రక్షించుట కొఱకునై, మానాయన సబ్ మేజస్ట్రేటు కోర్టున కొక్కపర్యాయము పోయిరనియు, వీరిని జూచుటతోనే మేజస్ట్రేటాశ్చర్యపడి యరగంటలో విడుదల తీర్పు చెప్పెననియు, ఆ వీరాస్వామిరెడ్డిగారి మనుమఁడు కుప్పుసామిరెడ్డి తన తాత తనతోఁ జెప్పినట్లనేక వివరములతో నాతో రెండేండ్ల క్రిందటఁ జెప్పెను. వ్రతధారణానంతరము జరిగినది యీయొక్క భంగమేనఁట. ఫీజుపుచ్చుకొనక స్నేహితకైంకర్యముగా నీకార్యమునకు నిర్బంధముమై పూనిరఁట.

సివిలు కేసుల విషయములో మాతండ్రిగారి సమయస్ఫూర్తులు రెండు. ఒకటి చిల్లర కేసులు గ్రహించుటలేదు, మునిసీబు కోర్టులలో నడుగుపెట్టుటలేదు. రెండవది, గొప్ప కేసులైనను గ్లిష్టములుగా సందిగ్ధములుగా నుండఁగూడదు. విస్పష్టమైన సత్యములుగా నుండవలయును. కాఁబట్టి మాతండ్రిగారు స్వీకరించెడి కేసులసంఖ్య యెప్పుడును స్వల్పమే. ఆర్జనలో నందఱికంటె నెక్కువ. నెలకు రెండు వారములకంటె నెక్కుడుగా కోర్టునకుఁబోరు. ఇట్లు మిగిలిన కాలమంతయు గ్రంథపఠనమునందును, మామిడితోఁటల కృషియందును వినియోగించిరి.

తనసమయములకు విరుద్ధములైన కేసులు వచ్చినయెడలఁ, జిత్తూరులోనుండు గోపాలాచార్యులు, అరుణాచలమొదలి, శ్రీనివాసాచార్యులు మొదలగు వకీళ్లదగ్గఱకుఁ బొమ్మని కక్షిదారులఁ బంపివేయుచుండిరి.

తనవలెనే వకీలువృత్తిలోఁ బ్రథమగణ్యుఁడుగా నుండినవాఁడు నరసింగరావు. కక్షికొకరైనఁ బ్రతికక్షికొకరుగా నిలిచి వీరిర్వురు వాదముచేయుచుండురు. తనపార్టీలనందఱను గట్టమంచికిబోయి రాజీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసికొనుఁడని నరసింగరావు విపరీతభాషలతోఁ దలకెక్కునట్లు బోధ చేయుటచేతను, సుబ్రహ్మణ్యరెడ్డిగారి సద్ధర్మప్రవర్తనము లోకప్రసిద్ధిగ నుండుటచేతను, నాతండ్రిగారు పట్టినకేసులలో నూటికిఁ దొంబదివంతు వారిచేతనే రాజీకాఁబడి యుపసంహృతములౌను.

జిల్లాలో గొప్పగొప్ప యాస్తులవిభాగములకుఁ గోర్టువారును గక్షిదార్లును గలిసి నాతండ్రిగారినే పంచాయితీదారు (Arbitrator) గాఁ గోరుకొనుచుండిరి. వీరి మరణపర్యంతము నింక నెవ్వరికి నీగౌర వము లభించినదికాదు. తాను చావుపడకలో నున్నప్పుడుసైతము, పాళైగారు, చెంగమనాయుఁడుగారి యైదులక్షల యాస్తిని గొడుకు లకు నిర్వివాదముగురీతిని బంచిపెట్టుటయేగాక, వారి సమ్మతిపై మిడిల్ స్కూలు నొకదానిని నగరములోస్థాపించి మాన్యముల నేర్పఱచిరి.

తనకక్షిదార్లపట్లఁ దానుచూపు వర్తనమును అనన్యసదృశము. పైని చూపఁబడిన విశేషములనుబట్టి వీరియొద్దకు వచ్చువారు చాల మంచివారుగా నుండువారే కాని, యల్పులుగారనుట స్పష్టము. మాయింటిలో భోజనము చేయఁగలవారెల్లరు మాయతిథులుగానే యెన్నినాళ్లైనను సరే, యెన్నిపర్యాయములైనను సరే యుండవల యును. కాళహస్తికార్వేటినగరమురాజులు, లాడ్ కృష్ణదాసుగారు, బ్రాహ్మణులు, మొదలగువారికి సిబ్బందితో ఊరిసత్రములో నన్ని సౌక ర్యములు నడిపి మాతండ్రిగారే యతిథులనువలె సన్మానింతురు. ఇది చాల పెద్దధర్మశాల. ఇప్పుడీసత్రము వాడువారులేక శిథిలమైపోయినది.

రెండవది క్రమమైనఫీజునుమాత్రము గ్రహించుట. చిత్తూరులోఁ బూర్వమగ్ర గణ్యులుగా నుండినవారు కోటావారు; వైశ్యులు. ఆయింటివారు మాతండ్రియొక్క ధర్మగుణములఁగూర్చి నాతోఁ బ్రసంగించెడివారు. ఒకానొకప్పుడు నాతండ్రిగారు కష్టపడి వారికి నైదువేల రూపాయలు చెల్లునట్లుచేసిరి. వారు సంతోషపడి యధిక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగు ఫీజు నీయరాఁగాఁ "క్రమవేతనముకంటె నెక్కువగాఁ గైకొన్నచో నది భిక్షముతో సమానము. నిజమైన వకీలు బిచ్చగాఁడు కాఁడు. ఆర్జితమునకంటె నెక్కువ పుచ్చుకొన" నని నిరాకరించిరి.

మూఁడవది బలాఢ్యులచేత హింసింపఁబడు బీదలకు నుచితముగా సహాయముచేయుట. ఈ తరగతికిఁ జేరినవాఁడే పూర్వము పేర్కొనఁబడిన కృష్ణపాళ్యం జమీందారు. పాలివా రన్యాయముచేసి యీ జమీందారుని నిల్లు వెడలఁగొట్టగా నా తండ్రియే, యయిదేండ్లన్ని ఖర్చులు భరించి కేసు జయించి, వారిభాగము వారి కిప్పించుటయ గాక, ఫీజు పుచ్చుకొనలేదు. 1923 వ సంవత్సరపు ఎలక్షనులో నన్నుఁ జూచునప్పటి కా జమీందారు చాల వయస్సుచెల్లిన ముసలాయన. అట్లుండియు నూ రేగింపుగా నన్నను కోటిగారి రంగయ్యశెట్టిని నింటికిఁ బిలుచుకొనిపోయి తానే స్వహస్తముతో వడ్డించి, "మీ తండ్రిపెట్టిన భిక్ష నాయనా! నీకుండెడుసొంత మీయింటిలో నాకు లే"దని చెప్పి "నీ కెవరైన వోట్లీయకున్నఁ దల పగులకొట్టింతును, భయపడవద్దులే. సుబ్బారెడ్డికొడుకునకు లేని వోట్లిం కెవ్వరి"కని పరమానందభరితునిజేసి నన్ను సాఁగనంపెను.

ఇంకఁ గక్షిదార్లుగ వచ్చినవారెల్ల స్నేహితులుగ నిలిచిరని వేఱుగఁ జెప్పవలయునా? మా తండ్రికి లభించినంత స్నేహితసంపద యెవ్వరికి నుండదు.

లార్డ్ కృష్ణదాసు, ఆనరెబిల్ పాలవాయి రంగయ్యనాయుఁడు మున్నగు ఘనులను బేర్కొనఁబూనినఁ నాత్మప్రశంసగ నుండునేమో? ఆత్మప్రశంస యాత్మహత్యకుఁ దుల్యము. కావున సామాన్యులను గొందఱను నిదర్శనప్రాయముగఁ బేర్కొనెదను. (1) అరికెలవాడి మునిసామిరెడ్డి:—వీరి యభ్యంజనస్నానము పిల్లవాండ్రమయిన మాకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాశ్చర్యము గలిగించునది. వ్రేలుపెట్టిన ఖతుక్కని తునుగఁజేయు నంతటి వేఁడినూనె, సుద్ధరణితో ఎత్తికొని తలమీఁదఁ బోసికొనుచు నొక్క గంటసేపు తలను దేహమును బట్టించుకొనుచుండెడివారు. స్నానమైనతోడనే రెండుగంటల నిద్ర. (2) నెమ్మిలి. వీరాసామిరెడ్డి: వీరింకను సజీవులైయున్నారు,* చాల మంచివారు. వీరికి భాస్కరుని, నన్నును జూడవలయునను నపేక్ష పెద్దది. మనుమఁడైన కుప్పుసామి రెడ్డి ద్వారా పదింబదిగఁ దండ్రివలె మమ్ము విచారించుచున్నారు. (3) కోటిగారి మునిసామిశెట్టిగారు: వీరి కాఁపురము తిరుపతి. మొట్ట మొదటఁ గక్షిదారుగా వీరు మా గృహప్రవేశముచేయుట నేనెఱుఁగుదును. కొంతకాలమునకు నా తల్లిదండ్రుల మిత్రమండలిలోఁ బ్రథములైరి. మా యక్కయొక్కయు, అన్నయొక్కయు, వివాహములు విచారణకర్తలుగ దగ్గఱనుండి నడపిరి. నన్నప్పుడప్పుడు తిరుపతికిఁ బిలుచుకొనిపోవుచుండెడివారు. ఇట్లు స్నేహము బంధుత్వమునకంటె నెక్కుడుగ ముదిరియున్నను మా తండ్రియందలి భక్తి లేతకాలేదు. వీరు పేకాటయందుఁ జాల ప్రియులు. మా తండ్రిచే నది యష్టమవ్యసనంబుగ నిరసింపఁబడుచున్నందున వారికిఁ దెలియకయ యా యాట నాడెడివారు. (4) చిత్తూరు, కాకర్ల రామయ్యశెట్టి: ఈయన మా తల్లిగారికి మంత్రియట్లు, పనియున్నను లేకున్నను, బ్రతిదినము మా యింటికివచ్చి గృహవిచారణచేసి కావలసిన సరకులఁ దీసి పంపెడివారు. వీరును కోటిగారి మునిసామిశెట్టియు నింటి పెత్తనగాండ్రు. నా తండ్రిగారు సాంసారికచింతలు పెట్టుకొనరు కావున, నిట్టి మిత్రుల సాహాయ్యముతోఁ మా తల్లిగారే గృహభారము నిర్వహించుచు వచ్చిరి. (5) స్నేహభావమున వీరందఱకును మిన్నయైనవారు మణియం సుబ్బయ్య యను బ్రాహ్మణులు. అరవవారు. మాయూరుచేరి కొన్నినం

---

* వీరును, వీరి మనుమఁడు కుప్పుస్వామిరెడ్డియును ప్రకృతము స్వర్గవాసులు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వత్సరములు మాజ్ఞాతులలో నొక్కనికిఁ బ్రతిగ మణియము పనిచేసిరి. పిమ్మట ప్రైవేటు వకీలుగాఁ గుదిరి మితశ్రమతోఁ దమకు కావలసినంత యార్జించుకొనుచు సుఖజీవనకళాకోవిదులై యుండిరి. వీరును వీరి భార్యయు నా తల్లిదండ్రులకుఁ బ్రాణస్నేహితులు. మా యింటినుండి కూరగాయలు మొదలగు సరకు వారియింటి కెగుమతి; వారియింటినుండి మంచి వంటలు, మా యింట దిగుమతి. ఆకారమున సుబ్బయ్యగారేనుఁగు తలలేని విఘ్నేశ్వరులు. పొట్ట యుల్లాసముతో నుబికి దూఁకులాడెడిది. చాల పెద్దది. భోజనప్రియులు. పాపము! ఇంకే చింతలేనివారు. భక్తి, భుక్తి, యివి రెండే వారి జన్మప్రపంచపు ధ్రువ నక్షత్రములు. ఒకనాఁడు మా తండ్రితో ముచ్చటించుచు "ఆ కలెక్టరు రెండువేలరూపాయలు తీస్తాఁడు. లాభమేమి? సుఖమేమి? నేను తినునంతవాఁడు తినగలడా? చెఱకుగడను గఱ కఱమని నమలి తినఁగలను, నేను. ఈ వయస్సు! డబ్బుంటే యేమిఫలము? సుఖము నను భవించే శక్తి యథాక్రమముగ నుంటే గదా?" యని తమ జీవిత కళాసూత్రమును వెల్లడించిరి. ఆ సుబ్బయ్యవంటి నిష్కల్మషచిత్తుఁడు, విశాలహృదయుఁ డింకొకఁడుండఁడు. తన సంపాదన యెక్కువగాదు. అందులో నమ్మవా రెంతపొదుపుగ వాడినను దమకై మిగులునది తక్కువ. ఆకొంచెమును ధారాళముగా దానముచేసి "శివ, శివ" యని సదా భగవన్నామస్మరణ చేయుచు, దెల్లని జుబ్బా, తెల్ల తలగుడ్డ, యెఱ్ఱని గుమాలు, తెల్లధోవతి ధరించి మార్గములోనుండు విఘ్నేశ్వరునకు నమస్కరించి, యేదైన నేఁడు దేవుని దయవలనఁ గోర్టులో దొరుకునా యని చిత్తూరునకుఁ బోవుచుందురు. పిల్లల కందఱకును వారిని జూచినఁ బరమానందము.

వీరియొక్కయు, మాతండ్రియొక్కయు, దైనందినచర్యలు ద్వంద్వసమానములు. ఉదయ మైదు గంటలకు లేచి, కాల్యకృత్యముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీర్చి, మణియము సుబ్బయ్యగారు వేదపారాయణము బిగ్గరగాఁ జేయుచు (వేదపారాయణమో కాదో నాకుఁ దెలియదు. ఏదో సంస్కృతభాషాఘోష) మాయింటి యరుగుమీఁద వచ్చి కూర్చుందురు. ఆ యరుగు నా తండ్రియొక్క పడకగదికి సమీపము. ఆ దీర్ఘారావములు చెవినిఁ బడగానే సుబ్రహ్మణ్యారెడ్డి లేచి మెట్టని చిన్న దస్తుగుడ్డను (Duster cloth కాఁబోలు) దలకుఁజుట్టుకొని, జుబ్బాను ధరించి వారితోఁగలిసి లౌకికసంభాషణలు చేయుచుఁ దోఁటకుఁ బోవుదురు. మాకుఁ దోఁట లనేకములు. దూరపుఁదోఁటలకు బండిలోఁ బ్రయాణము. దగ్గరవానికి నడక. సుమా రేడుగంటలవఱకుఁ దోఁటలోఁదిరిగి యేడున్నరగంటలకింటికి వత్తురు. పిమ్మట యయ్యగారిల్లు చేరుదురు. రెడ్డిగారు కచ్చేరీపనికి దిగుదురు. పదిగంటలకు భోజనము. ఆమీఁదఁ గోర్టునకుఁ బోకుండినచో విశ్రాంతి కొంతసేపు. పిమ్మట భారతభాగవతపఠనము. సాయంకాలము మఱల కచ్చేరి. రాత్రి యేడుగంటలకు భోజనము. తదుపరి యేవ్యవహారచింతయుఁ గూడదు. భారతభాగవత పారాయణము. ఆ పారాయణమునకు మణియము సుబ్బయ్యగారు, కొళంద రెడ్డిగారి తండ్రి రామయ్యగారు, అతిథులుగా నుండు కక్షిదార్లు, అందఱును సభగా సమావేశమగుదురు. కొంత వయస్సు వచ్చినవెనుకఁ బాఠకత్వము తఱచు నాపనిగా నుండెడిది. పండ్రెండు సంవత్సరముల వయస్సునకే భారతభాగవతముల నెక్కువ గజిబిజిలేక చదువఁగలట్లు నాతండ్రి నన్నుఁ దేర్చిరి. తన తక్కిన కొడుకులకంటె నేనర్థజ్ఞానముతోఁ జదువువాఁడననియుఁ బదాది విభాగముల నన్వయసౌలభ్యము కలుగునట్లుచేయుదుననియు వారి వాత్సల్యజనితభ్రమ. చదువు పద్యములసంఖ్య కొంచమే; వానిపై నడచు వ్యాఖ్యానములు, వాగ్వాదములు మెండు. ముఖ్యముగా కొళంద రెడ్డిగారి పెద్దనాయన, వెంకటసామిరెడ్డి, మాతండ్రి వేదాంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు భారతములో లేవనియు, నాకాలము వారును బాగుగఁదిని కండక్రొవ్వెక్కి భోగపరాయణులుగానుండిరేకాని, శుష్కసన్యాసులు గారనియుఁ, బెద్ద కేకను వేయునపుడు మాకందఱకు నాపరానినవ్వుగా నుండెడిది. తక్కినవారు మాతండ్రిచెప్పినదే వేదమని యూఁకొట్టువారు. మణియము సుబ్బయ్యగారు "అమితాహారము నేదిలేదు. కడుపు పట్టేదానికంటె నెవఁడెక్కువతినలేఁడుగదా! కాఁబట్టి యది తామసక్రియలలోఁ జేరదు." అని తమకుఁ గావలసిన వికల్పసూత్రమును మాత్రము సమర్థింతురు. రామయ్యారెడ్డిగారు మాంసాహార ప్రియులు. వారి వాదమేమనఁగా "ఒక్క భీముఁడేగాదు, ధర్మరాజు కూడ మాంసము తినేవాఁడు. ఆకాలమున నందఱు తింటూవచ్చిరి. అది తింటేనేగాని నిజంగా హిందూధర్మంచెల్లదు. ఈయొక్క విషయం తప్ప తక్కినదంతా సుబ్రహ్మణ్యారెడ్డి బోధించునట్లే" యని మాంసాహార నిషేధము సరిగాదందురు. రాత్రి తొమ్మిది తొమ్మిదిన్నర గంటలకు సభ ముగియును. వారివారి పడకలకు వారు పోవుదురు.

మామిడిపండ్లకాలములో నీధర్మవిచారణలతో ననుపానముగ మంచి మామిడిపండ్లనుగోసి తినుచు, వాని తారతమ్యచర్యలను నడుపుదురు. "ఒరే! ముట్టెలలోనుండేరుచి చెంపలలో లేదురా! చూడండి! ముట్టెను ఎట్లాతింటానో!" యని మామణియము సుబ్బయ్యగారు ముట్టెను జవులూరునట్లు చప్పరించుటయేకాదు, ఖటుక్కని కొఱుకుటయుఁజూచి హర్షధ్వానములు చేయుచుంటిమి. మామిడివిత్తులను నాటితిమేని మొలకెత్తి, చెట్లయి, మైదాతేండ్లకుఁ గాయలుకాయును. ఈకాయలు విత్తుయొక్క తల్లిచెట్టు కాయలట్లుండవు. అందులకే విత్తువేయక యంటుగట్టవలసిన విధి. విత్తులనుండి యేవేవో నూతన రకములు గలుగును. ఇందులో నూటికిఁ దొంబదితొమ్మిది నిష్ప్రయో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జనములు. పరిపూర్ణమైన మామిడిపండుయొక్క సాముద్రికలక్షణము లివ్వి:—మంచిరంగు, పలుచని నున్ననితోలు, నారలేకుండుట, చిన్న ముట్టె, ఘనమును బిగువును నైనకండ, మంచివాసన, మంచిరుచి, ఆలస్యముగాఁ గాయ పక్వమునకువచ్చుట; అప్పుడే దానికి మంచి వెల. నాతండ్రికి డార్విన్‌గారిచేఁ బ్రసిద్ధపఱుపఁబడిన "సహజవికృతి" న్యాయము (spontaneous variation) తెలియదు. వినియు నెఱుఁగరు. అయినను సహజమైన వివేకమును బ్రయోగించి యాన్యాయముయొక్క ప్రయోగమును గ్రహించి, విత్తులనుండి మొలచెడు చెట్టులో నేదయిన నూతనఫలము వచ్చును గదా! అదృష్ట ముండిన మంచిక్రొత్తజాతి యేల యుద్భవింపరాదు? అని వితర్కించి, పరీక్షార్థము విత్తులనునాటి, యాచెట్టు ఫలించువఱకు వేచియుండి, యాపండ్లను మాయూరిసభలోఁ గోసి తిని, చర్చించి— ఈకార్యమునకు ప్రధానమంత్రి రామారెడ్డిగారు, వారుతప్ప నింకెవ్వరు నీనూతన సృష్టులను గోసి నివేదింపఁగా నేఁజూచి యుండలేదు—మంచిదని నిర్ణయింపఁబడినయెడల దానికి నామకరణముచేసి, యాచెట్టునుండి, యంటుకట్టి, యాజాతిని నిలుపుదురు; వ్యాప్తికిఁ దెత్తురు. తక్కిన వానిని నిర్మూలముచేయుదురు. ఇట్లనేకసంవత్సరములుగా నోపికతోఁ బరీక్షలుసలిపి నాకుఁ దెలిసినమట్టునకు నైదు నూతనజాతులను సృష్టింపఁ గలిగిరి:—(1) రాజాపసందు:—కాయగుండ్రము, మల్గోవాకంటె రెండింతలుపెద్దది. మంచిరుచి. కాయపెద్దది. కాడసన్నము. కాని, కాయుట తక్కువ. గాలికి నిలుచుటకష్టము. నిలిచినకొన్నియుఁ బ్రశస్తములు. (2) రెడ్డిపసందు:—కాయపెద్దది. చర్మము ఘనమును, గడుసును. రంగు వికారము, అనాగరకము చూచుటకు—రుచిమంచిది. (3&4) రాబర్టుపసందు, కాలేటుపసందు:—గుండ్రములైన మేలిమిరకములు. (5) భోగంపసందు:—చూచుటకు మంచిరంగుతో నానా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగా నుండును. రుచి మంచిదికాదు. వినోదార్థము కొన్ని చెట్లు మాత్రమే వేసిరి.

కోర్టునకుం బోక మిగిల్చిన కాలమునంతను భారతభాగవతము లకు, మామిడితోఁటలకు వినియోగించి మా తండ్రిగారు, రెండింటను బ్రసిద్ధిఁ జెందిరి.

మణియము సుబ్బయ్యగారు పార్శ్వవాయు వ్యాధిచే పీడితులై తమ దేశమునకుఁ బోవుట నా తండ్రికి శాశ్వత దుఃఖకారణమాయెను. వారు బ్రాహ్మణులు; మేము శూద్రులము. ఏ భేదము లేక సహకుటుంబమట్లుంటిమి.

చిత్తూరులో నారాయణయ్యంగార్లు అను వైష్ణవబ్రాహ్మణులు పూర్వము డిష్ట్రిక్టుమ్యునిసిఫ్‌గా నుండిరి. వారికిని మా తండ్రికిని సంపూర్ణమైన మైత్రి యుండెను. వారు చనిపోవునప్పుడు మా తండ్రిగారిని, దమ భార్య కనకమ్మకుఁ గూతురు కమలమ్మకు, గార్డియనుగా నియమించిరి. ఆ యిర్వురను మా తండ్రిగారు చెన్నపట్టణము ఎళుంబూరిలోనుంచి తమ మరణపర్యంతము వారికెట్టి కొదవయు లేకుండునట్లు తల్లిదండ్రులకంటె నెక్కువగా రక్షించిరి. వారికై సంవత్సరమునకు రెండుమార్లు పట్నమునకుఁ బోవుచుండిరి. వారు పోవునప్పుడెల్ల నన్నును బిలుచుకొనిపోవుచుండిరి. ఒక్కొక్కప్పుడు మా యక్కయు వచ్చును. ఒకానొకప్పుడు కమలమ్మయు మా యక్క సుందరమ్మయుఁ దా ముందు గదిలోనికి నన్ను రావలదనఁగా బాల్యవిపరీతకోపినై కొరడాతో వారిద్దఱనుఁ గొట్టితిని. వారు మాతండ్రితోఁ జెప్పికొనిరి; కాని వారు నన్నేమియు ననలేదు. నేనెప్పుడు తండ్రితో నుండువాఁడను. వారికిని నా యందుఁ బ్రీతియెక్కువ. "ఘటికుడ" నను నభిమానము కూడ. కాఁబట్టి కనకమ్మగారు నన్ను "మంత్రి" యని కించిద్దేళనముగఁ బిలిచెడివారు. సుబ్రహ్మణ్యారెడ్డి చనిపోయినపిమ్మట వారి వ్యవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హారములలోఁ జాల చిక్కులు వచ్చినవి. నేను 1902 వ సంవత్సరములో కేంబ్రిడ్జికిఁ బోకముందు పెంపుడు సహోదరియైన కమలమ్మను జూచి సీమనుండి వచ్చినతోడనే నా సమీపమునందే యామెకు గృహమేర్పఱచి శక్తికొలదిఁ జూచుకొందునని నమ్మిక చెప్పి యోదార్చి పోయితిని. నా దురదృష్టమా ప్రీతికార్యమును జేయనిచ్చినది కాదు. నేను వచ్చుటకొక్కయేడు ముందుగనే కమలమ్మగారు మరణించిరి. ఆమెకుఁ బూర్వమే తల్లి కనకమ్మయుఁ దరలిపోయెను. ఆ బ్రాహ్మణ కుటుంబమునెడఁ బ్రీతియు గౌరవముఁ దాల్చి మేమెంతయో చేసితిమి గాని, మనసు కోరినంత సుఖము నేకూర్పఁజాలమైతిమి. మా యింటిలోని ప్రతి శుభకార్యమునకు వారు రానిది జరపనెంచము. వారి కష్టసుఖములన్నియు మాయవిగా నెంచి మైత్రి నెఱవేర్చితిమి. చావుతో మాకు వియోగము సంభవించెనుగాని, మా యెవరివలనను ఆ మైత్రికి యొక్క క్షణమాత్రభంగమైన రాలేదు.

కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డికి దైవభక్తి యెక్కువ. దానితో పాటు ఛాందసములును.

ఫోటోగ్రాఫు తీయించుకొనిన నాయుఃక్షయకరమని తన పటమును దీయనీయలేదు. వీరివలెనే మా చిన్నాయన రంగారెడ్డియు నాకృతిపటమును దీయించుకొనకయ చనిపోయెను. ప్రతిబింబము తీయించిన బింబమునకు హానియఁట! మానాయనకు గుఱ్ఱముల నుంచుటయు నాక్షేపణీయము. ఆయోగము రాజులకేగాని యింకెవ్వరికిఁ దగదు. తన గ్రంథములో రెడ్లను పుడమిఱేఁడులని సంభావించి యున్నాఁడు. గుఱ్ఱములు కూడదనియు ప్రకటనయే! తానొంటెద్దు బండిలో నెన్నఁడును గూర్చుండఁడు. అది పాపము. మత్తే వాహనత్వము చెల్లుననఁగాఁ దెల్లని రెండెడ్లబండి. తన కనుకూలించురీతిని పెద్దవిల్లుబండిని గట్టించి దానికిఁ బెద్ద తెల్లని యెడ్లను రెంటిఁబూన్పించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందులో రాకపోకలుచేయుట వారి పద్ధతి. నాదత్తుతండ్రి రామస్వామిరెడ్డికి గుఱ్ఱములమీఁద వ్యామోహామెక్కువ. నాకుఁ దెలిసి యొకదానివెనుక నొకటిగా మూఁడుగుఱ్ఱములఁ గొనెను. కొనినప్పు డెల్ల నన్నగారియొద్ద క్షమాపణార్థము కల్లసమాధానములు చెప్పు చుండును. మూఁడవగుఱ్ఱమును గొనినప్పుడు వేలూరులో (వారు వేలూరులో వకీలుగానుండిరి) ఇంజనీయరు తనకీనాముగా బలవంత పఱచి యిచ్చినాఁడని సమ్మోహనాస్త్రము వేసినాఁడు గాని, దాని వలనఁ బెద్దాయనకుఁ గోపము రెండింతలై నాయెదుటనే మాచిన్న నాయనను (అప్పటికి ౩౭ యేండ్ల వానిని) జెడఁదిట్టెను. ఈమంగళా శాసనములైనవెనుక మాచిన్ననాయనయును, నేనును మేడమీఁదికిఁ బోవుచుండగా నేనూరకయుండక చనువుచేతఁగలిగిన చాపల్యముచే "చిన్నాయనా! చిన్నాయనా! నిన్ను మా నాయన బాగాతిట్టినాఁడే" యని యంటిని. మా చిన్ననాయన నవ్వుచు "అవి తిట్లుకాదురా, తమాషామాటలు" అని త్రోసిపుచ్చెను. ఆకాలపు టన్నదమ్ముల సౌహార్దము నేఁడుకలదా?

రామస్వామిరెడ్డి రాజసగుణుఁడు. సుబ్రహ్మణ్యారెడ్డికి సత్త్వగుణ మెట్లు ప్రధానమో తమ్మునికి రజోగుణమట్లు. వారికిని నాయందుఁ బ్రాణసమానమైన ప్రీతిగావున నప్పుడప్పుడు నా చదువెట్లుననను విచారణ లేకయ వేలూరునకుఁ బిలుచుకొనిపోయి మాసములకొలఁది నుంచుకొనును. అక్కడ నాకు మిఠాయిపొట్లములేమి, భోగమువాండ్రు వచ్చి స్నానముచేయించి నయముగా నొప్పిలేని విధమునఁ దలదువ్వుట లేమి—చాల బాగుగ నుండునది కాలము! విరించిపురము కోవెలకు మా చిన్ననాయన ముఖ్యధర్మకర్త. అక్కడకు వెళ్లినప్పుడెల్ల బ్రాహ్మణ ఫలాహారములు, పసిబిడ్డగదాయని దేవదాసీగణముచేయు పరిచర్యలు మొదలగునవి దట్టముగాఁ బడుచుండెను. మా తండ్రికి విపరీతములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలియుటతో వేలూరునకుఁ బంపుట మాని వేసిరి. తొమ్మిదవసంవత్సర ప్రాయానంతర మీ రాజభోగములన్నియు నిలిచిపోయి సత్త్వగుణముల నభ్యసింపవలసిన కర్మముఁ జెందినవాఁడనైతిని.

కవిత్వము మహాసాహసకార్యమని నాతండ్రికి భయము. ఒక విధముగఁ జూచిన నిజమే! కాని వారికారణము వేఱు. విషగణములు పడి యెవరికే చేటు వాటిల్లునో యను వెఱపు పెద్ద. తెనుఁగులో నాకుండు పాటవముఁ జూచి వీఁడెప్పుడు కవిత్వరచనకుఁ బ్రారంభించి నాశన మగునోయని దిగులు చెందుచుండును. సాక్షాత్తు తనయొక్క కంఠ స్వరముతోనే తాను జదివెడుమాడ్కినే భారతమును నేను జదువు నప్పుడు పరమానందమును, నీతుంటరి కవిత్వమును మొదలువెట్టి యిల్లు గూల్చునోయను సంశయమును జనిపోవునటకుఁ దాల్చియుండెను. కవిత్వమనఁగా మరణయోగములలో నొకటి!

ఇంక శకునములు మొదలగు పారంపర్యఛాందసములసంగతి చెప్పవలయునా? పిల్లి, కుక్క మొదలగు నన్ని జంతువులును, జ్యోతి శ్శాస్త్రములోని గ్రహములట్లు, మనుష్యజీవితము నాదేశించుచు శాసించుచు నిర్మాణమునకుఁ దెచ్చునవి. బ్రాహ్మణులు భూదేవతలు. ఎన్నితప్పు లెన్నిపాపములు సేసినను పూజనీయులే! "పంచాంగపు టయ్యవారు" జీవితయాత్రకు మార్గదర్శి; అనఁగాఁ ద్రోవచూపు వాఁడు. "లగ్నాలు నిజమైతే ముండమోపు లెట్లయిరి" అని వేమన ప్రశ్న. అట్టిలగ్నములు నిజములుకావని నాతండ్రి సమాధానము!

దైవభక్తి, సత్త్వగుణము, వీరికి వెన్నతో వచ్చిన వరములు.

"ఉ. మ్రానను రాతనుంగలదె మాంసము ప్రాణులమేనఁగాక య
మ్మేనుల నొంచునట్లు తమమేనులసోకినమాత్ర నెట్లగున్
దానిఁ దలంపఁగావలదె తానదిమానిన హింసలన్నియుం
మానవెయంచు నుత్తముడు మాంసముమాను దయార్ద్రచిత్తుఁడై"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని భారతమునవిని మాంసాహారముమానిన జీవహింసమాను నని, దానిని విసర్జించెను. వీరికి ముందే మాతల్లి నారాయణమ్మ వదలిపెట్టెను. వీరినిజూచి మాపినతండ్రులుఁ బిన్నమ్మలు నందఱు శాకాహారవ్రతమును బూనిరి. మావేలూరి చిన్ననాయనమాత్రము మఱుగుగాఁ గోడిగ్రుడ్లు సకృత్తుగా నౌషధముగాఁ దినెడువాఁడు. ఔషధముగా మాంసము పుచ్చుకోవచ్చునని మాతండ్రియు నొప్పుకొనుచుండెను, గాన నది వ్రతభంగముకాదు. సూర్యగ్రహణచంద్ర గ్రహణాది పర్వదినములలో ననేకపర్యాయములు స్నానములు చేసి పితృతర్పణములు విడిచి, భారతపారాయణము చేయుదుము. అందును ముఖ్యముగా నారణ్యపర్వములోని తీర్థప్రశంసాఘట్టమును దా నలసినప్పుడు నేను, నాగొంతుకోచైనప్పుడు దాను, ఇట్లు మార్చి మార్చి చదివి పుణ్యమును బ్రోగుచేసితిమి. తల్లియైనజ్ఞానమ్మ (అనఁగా మాయవ్వ) చనిపోయినప్పుడు గోదానాదుల విశేషముగాఁ జేసి బ్రాహ్మణులకును దనకును మనస్తృప్తి కల్పించికొనెను. ఈతృప్తి కృత్రిమమో యథార్థమో యెవరు నిర్ణయించగలరు? కట్టమంచి చిన్నయూరు. దేవాలయములు మాత్రము మెండు. చోళులచేఁ బ్రతిష్ఠింపఁబడిన శివాలయ మొక్కటి యున్నది. అది మిక్కిలియుఁ బెద్దది. అందలి విగ్రహాదులు మనోహరములు. మణియము సుబ్బయ్యయు వీరును దఱుచు సాయంకాలముల నచ్చట గడుపుచుందురు. ఆదేవళము శిథిలతకు వచ్చుచుండుటఁజూచి మాతండ్రులు మువ్వురును, ఆస్తిలోనుండి పది వేలరూపాయలు ఖర్చుపెట్టి గాలిగోపురముతక్కఁ దక్కినయన్ని భాగములను సంపూర్ణముగా బాగుచేయించిరి. కొళందీశ్వరకామాక్షమ్మ విగ్రహములను ధాన్యములోఁ బాఁతి పెట్టి, కట్టడపుఁగార్యము ముగింపునకు వచ్చినపిమ్మటఁ గంచినుండి వేదవేత్తలైన బ్రాహ్మణశ్రేష్ఠులను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రప్పించి, యజ్ఞములుచేయించి, పిమ్మట, దైవతముల నష్టబంధనాది కృత్యములతోఁ బునఃప్రతిష్ఠింపించిరి. ఈ కార్యము నిర్విఘ్నముగఁ గట్టమంచిలో యథార్థబ్రాహ్మణుఁడను పేరువడసిన గురుకులము కుప్పయ్యగారి విచారణముక్రింద 1894 వ సంవత్సరములో జరిగెను. ఆయజ్ఞశాలలోనే యొకానొక బ్రాహ్మణమిత్రుఁడు నన్నుఁజూచి "మీనాయనయొక్క పుణ్యము పరిపూర్ణమైనది. ఇంకవారు త్వరలోఁ గైలాసపదవి నందుదురు" అని గౌరవముతో గుటిచెప్పెను. మఱు చటి సంవత్సరము డిశంబరు 6 వ తేదీని నాతండ్రిగారు స్వర్గస్థులైరి.

కంచివరదరాజస్వామినామాంకితమయిన విష్ణ్వాలయ మొకటి యున్నది. మా యింటివారు శివమతమను పేరుగలవారుగాని, వీరు కొలువని దేవతలు లేరు. మాకు దేవతలందఱు సమానాదరణపాత్రులే. ఈ విష్ణువు గుడిని బాగుచేయ నారంభించిరిగాని కార్యమెక్కువగఁ గొనసాఁగకముందే పిగతజీవులైనందున దానిని, చిన్ననాయన రంగారెడ్డిగారు నిర్వహించి ముక్కాలు మువ్వీసము పూర్తిచేసిరి. ఆ కొదవ తీర్చవలసిన భారము మాది.

1892 వ సంవత్సరమునందే, వేలూరు చిన్ననాయన రామస్వామిరెడ్డిగారు, 42 సంవత్సరముల వయస్సునఁ జనిపోయిరి. వారు ధనసాహాయ్యము తప్ప నీ దైవకైంకర్యములో నింకేదియుఁ జేయఁ జాలరైరి. 1895 సంవత్సరములో నాతండ్రిగారు మరణించిరి. అప్పుడు వారి వయస్సు ఏఁబది. కడగొట్టు చిన్ననాయన రంగారెడ్డి షష్టిపూర్తి ననుభవించి 1913 వ సంవత్సరములో దివంగతులైరి.

మా తండ్రిగారు శ్రీరామభజనమందిరమును స్థాపించిరి. శాస్త్రోక్తముగా లిఖింపఁబడిన పటమొకటి వారికిఁ గార్వేటినగరపురాజుగా రిచ్చి సంభావించిరి. కొన్నినెలలకు నా యన్నయైన నరసింహారెడ్డి జ్వరగ్రస్తుడయ్యెనఁట. ఆ పటమునకుఁ బూజయు నైవేద్యము లేనందున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీ వ్యాధివచ్చెనని కుప్పనయ్యంగార్లు గుఱిపలుకఁగా, తత్‌క్షణమే భజనకేర్పాటు చేయునట్లు మ్రొక్కుకొని కొంతకాలముననే గొప్ప మందిరమును గట్టించి శ్రీసీతారాముల పట్టాభిషేకపటము నందు స్థాపించిరి. మా యూరిలోని పాఠశాలయు నందే నడుపఁబడుచున్నది. నేను బరీక్షలలో జయమునంది నప్పుడెల్ల విశేషనైవేద్యములతోఁ బూజచేయుటకునై రెండురూపాయ లిచ్చుచుండురు. ఊరిపిల్లల నందఱను జేర్చి వారికా తినువస్తువులనిచ్చి కృతకృత్యుఁడ నౌచునుంటిని.

తమ్ముఁడైన రామస్వామిరెడ్డి ద్వారమున నాగప్రతిష్ఠఁ జేయించెను. మఱియు విఘ్నేశ్వరుని గుడియొకటి కట్టించెను. దేవపూజలన్నియుఁ గ్రమముగా నడచునట్లు విచారించుకొనుచు మా గ్రామములో ఋజువర్తనము నుద్ధరించుచుండెను.

మా తండ్రిగారు ప్రచురించిన గ్రంథములు రెండు. భారతసారరత్నావళి, భాగవతసారముక్తావళి. సొంతకవనముపొంతఁ బోఁగూడదను నియమము దాల్చిన వారగుటవలన, నీ సంపుటీకరణములతోఁ దృప్తిఁజెందిరి. ఈ గ్రంథముల ప్రాశస్త్యమును గుఱించి నేను జెప్పఁబూనుట సమంజసముగా నుండదు. ఆ పని పండితులకు సమర్పించుచున్నాను. సంప్రదాయానుసారముగాఁ బ్రధానసీతులని తోఁచినవానిని బ్రోఁగుచేసి వర్గీకరించి భారతసారమును దొలుత 1885 వ సంవత్సరములోఁ బ్రచురించిరి. పిమ్మట మూఁడేండ్లకు భాగవతసారప్రకటన. భారతముయొక్క నిజమైన సారమేదియను నంశము నానామహాగాథవిమర్శనలకుఁ బ్రకృతము లక్ష్యమైయున్నది. అయినను జనబాహుళ్యమెయ్యది దానియొక్క నిజతత్త్వమని, సంప్రదాయానుగతిని, నెంచుచున్నదో దానిని సుబ్రహ్మణ్యారెడ్డిగారు సంపూర్ణముగను, విశదముగను, వర్గీకరించి ప్రదర్శించినారు. భాగవతముయొక్క నిజమైన భావమును గుఱించిన యభిప్రాయభేదము లంతగా లేవు. కొందఱద్వైత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరముగను, మఱి కొంద ఱితరదర్శనములపరముగను సమర్థించి యున్నారు; కాని యిదియే యీ భేదముల పరిమితి.

నా తండ్రికి నద్వైతమే పరమసిద్ధాంతము. అయినను ద్వైత విశిష్టాద్వైతములు గూడ సత్యమును వహించిన వగుటయే కాక యావశ్యకములనియు వారి నమ్మిక. ప్రతియొక్కనియు నాత్మయొక్క పరిణామస్థితి ననుసరించి యన్నియుఁ గావలసిన వే. కేవలత్వమునకు సంసిద్ధుఁడై యున్నవాని కద్వైతమే యనుకూలించు మతము. దానికంటెఁ దక్కువదశలలో నుండువారికిఁ దక్కిన మతము లనుకూలించును. త్రిమతములకు నీరీతినన్వయము గలిగించుట న్యాయమని నేను జెప్పఁ జాలను. భక్తి, జ్ఞానము, కర్మ,—యీ త్రికాండములకుఁ గల సంబంధములఁ గ్రహించుట యనఁగా తత్త్వశాస్త్రమథనము పరిపూర్ణముగాఁ జేసి యమృతమును బడయుట. న్యాయవాదిగా నున్నను, వివాదములన్నఁ జడిసి వెనుదీయునాతండ్రి, నిరాఘాటవిమర్శనవ్రతము నవలంబింపలేదు. ఏదో యొకరీతి నన్నింటిలో నీశ్వరుఁడున్నట్లే యన్నింటిలో సత్యమున్నదని సంధిమార్గమునుబూని యొకరిని నొప్పింపక తానొవ్వక తనజీవయాత్రఁ గడతేర్చుకొనెను. ఎట్లు విచారించిచూచి నను నాతఁ డజాతశత్రువు.

కుప్పనయ్యంగారీ గ్రంథములను సవరించినారని ముఖపత్రమున నున్నది. స్నేహభావముచేత వారి పేరున కా ప్రాముఖ్యము నొసంగిరే కాని వారెక్కువ యేమియుఁ జేయలేదు. అయినను, మాయూరిలోని ప్రసిద్ధాంధ్ర పండితులును, మాముత్తాత రామలింగారెడ్డిశిష్యులును, నగుటచే సహకర్తగా గ్రహింపఁబడుట సహజమే కదా!

నాముత్తాతయైన రామలింగారెడ్డియొక్క కృతులను ముద్రింపఁ గోరి 1889 వ సంవత్సరములో నాతండ్రి యెత్తి వ్రాయించ నారంభించెను. వారి కృతులలో ముఖ్యమైనది భాస్కరశతకము. అప్పుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుట్టిన పుణ్యావశముచేత నా చిన్నతమ్ముఁడు, ఇప్పుడు డిస్ట్రిక్టుమునిసిఫ్‌గా నుండువాఁడు, భాస్కరనామధేయాంకితుం డయ్యెను. ఏకారణము చేతనో యీ ముద్రణకార్యము నెఱవేఱినదికాదు. 1926 వ సంవత్సరమున నాభాస్కరుని సాహాయ్యముచే రామలింగారెడ్డి కృతులను నేను మదనపల్లెలో నచ్చు వేయింపఁ గలిగితిని.

ఈ సంగ్రహ జీవితమును, నేను కుప్పసయ్యంగారి సర్వలక్షణ సార సంగ్రహమునకును, రామలింగారెడ్డి కృతులకును వ్రాసిన పీఠికలను జదివినయెడల మావంశచరిత్రమే కాక, పూర్వమున మాగ్రామవృత్త మేరీతి నుండెననుటయుఁ గలఁగన్న మాడ్కినైన గోచరింపక పోదు.

1895 వ సంవత్సరమున డిశంబరు 6 వ తేదీని నాతండ్రి కాల ధర్మముఁ జెందెను. నేనప్పుడు చెన్నపురిలో నుంటిని. ఆనరబిల్ రంగయ్య నాయుఁడుగారికిఁ దంతివార్తరాఁగాఁ గమలమ్మను, నన్నును బిలుచుకొని బయలువెడలిరి. నాదుఃఖమునకంటెఁ గమలమ్మయొక్క దుఃఖమే యెక్కువ. పాపము! ఆఁడుది. రక్షకులులేనిది. పుట్టిననాఁటఁ గోలె యేచింతయు సోఁకకుండునట్లు కాపాడిన పెంపుడుతండ్రి చని పోయెఁగదా! నాకింకగతియేమని పనవి పనవి యేడ్చుచువచ్చెను. ఆనాఁడు రైలుబండి చిత్తూరొకగంట యాలస్యముగాఁ జేరినది. మేము వచ్చునరికిఁ జిత్తూరినుండి కట్టమంచివఱకు జనులు గుంపులు గుంపులుగఁ జీమల బారులట్లుండిరి, నరసింగరావు, సుందరయ్య, వెంకయ్య, అరుణా చలమొదలి, దొరసామిమొదలి, మొదలయిన వకీళ్లు, వర్తకులు బంధువులు, బీదసాదలు, కోటిగారి మునిసామిసెట్టి మొదలయిన స్నేహితులందఱు మామహనీయుని యంత్యదర్శనార్థము తండోపతండములుగఁ బరివేష్టించి కన్నుల నీరుఁగార్చుచుండిరి. దహనసంస్కారానంతరము డిస్ట్రిక్టుజెడ్జియైన "రాబర్ట్సునెల్" వచ్చి విచారించెను. ఒక నెలవఱకు మాయిల్లు సత్రముగానుండెను. మా జిల్లావారి గొప్పతన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునకు సూచకమయిన యొక్క విషయమిట నల్పమైననను జెప్పక తీరదు. కక్షిదారులెల్లరు మేమడుగకయు తామీయవలసిన పైకమును దామే తెచ్చి మాతల్లికి దేవుని ముడుపులట్లు చెల్లించిరి. దాదాపు ముప్పదియేండ్లు దాటినవెనుక నేను ఎలక్షన్ దండయాత్రకు వెడలఁగాఁ గట్టమంచి సుబ్బారెడ్డిగారుకను ధ్వజమే యనాయాసవిజయావహమైనది. "తమ్ముఁ గపిధ్వజప్రభుల యంధీభూతులం జేయవే" అనుమాడ్కి. నాకుఁ దెనుఁగున నుండు విద్య వారిచ్చిన భిక్షయే కాని వేఱు కాదు భారత భాగవతములను మనసులోనాటి, కాలక్రమమున వికసనమునకు వచ్చునట్లుచేసిరి. రామాయణమునందు వారికి రక్తి లేశమాత్రము. ఏలనఁగా నది కథ; కావ్యము; వేదాంతవిచారణలు, ధర్మాధర్మ ప్రసంగము లంతగాలేనిది. వారెంత చెప్పినను భాగవతము యొక్క శైలి నాకంత రుచింపలేదు. వారి చావుపడకలో నారాయణ కవచమును బదింబదిగఁ జదివితిని. కాని, యందుఁ గవితాకళ న్యూనమని కాఁబోలు, ఆ చిన్నవయసునఁ గూడ, మనసు తఱచు, భారతము మీఁదనే ప్రసరించుచుండెడిది. భారతము పునఃపునః పారాయణము చేయించి నాయందు వారు సాహిత్యరసజ్ఞతను బుట్టించిరి. అందు చేతనే నాకవిత్వతత్త్వవిచారమును నాతండ్రి కంకితముచేయుచు నిట్లు వ్రాసితిని:—

క. నాతండ్రి సుగుణమణిఖని
శ్రోత్రియుఁ డురువైభవుండు సుబ్రహ్మణ్యుం
డాతతగతి నాటిన వి
ద్యాతతుల ఫలంబుమీకు నభివేదింతున్.

తొలుదొల్త నేను రచించిన మునలమ్మ మరణములో

క. భారతభాగవతోజ్జ్వల
వారిధిగతసారపద్యవరమణి చయముల్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హారాలు గట్టెనెవఁడా
సూరిని మజ్జనకుఁదలఁచి చూడుఁడు నన్నున్.

అని వారి యాశ్రయము, నాప్రధానాశయమంటిని. ఈపద్యము కూచిమంచి సోమసుందర కవిగారి ప్రశంస కనుకరణము. ఈ కవి సర్వేడిపార్టుమెంటులో గుమాస్తాగానుండి మాజిల్లాకువచ్చి మాయూరిలో మాయింట నొకదాననుండి మాతండ్రిగారి కత్యంత మిత్రుఁడాయెను. వారికిని సర్వేసూపరింటెండెంటునకును భేదములు తటస్థించి నప్పుడు మాతండ్రి మాధ్యస్థము వహించి కుదిర్చెనఁట. ఆయన, భారతసారరత్నావళి ననుగ్రహించుచు నిట్లు వ్రాసెను.

మ. తతబోధాఖిలదీపితాఖిలమహాధర్మోర్మికోపేతభా
రతవార్ధింగల సారపద్యమణులన్ రత్నావళిం గూర్చెనీ
శ్రుతితత్త్వజ్ఞుఁడు సూతుఁడో, శుకుఁడొ, వ్యాసుండోగదే!
యంచుధీ
రత మిమ్మందురు కట్టమంచికులసుబ్రహ్మణ్య పుణ్యాహ్వయా!!

ఒకానొకప్పుడు భారతవ్యాఖ్యానరచనాచింతాబంధురహృదయుండనై యీ క్రింది పీఠికాపద్యములఁ దలపోసితిని:—

క. ఘనమగు ప్రీతిం బెంచిన
తనయను నేధారవోసి ధన్యుఁడనయ్యున్
మునిఁగితి శోకార్ణవమున
మనసునకుఁ సుఖములేని మందిరమయ్యెన్.

క. కానఁ భాషాకన్యం
బూని పునఃప్రీతి నింటముద్దుగనేని
త్యానందతకై నిలిపెద
నేనాఁడును జేయివిడిచి యేగద నన్నున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అని చింతాక్రాంతం బగు
మనసున ననుకొన్న మాడ్కి మహితగ్రంథం
బును జేయంబూని భారత
మనూన శాంతప్రధానమగుటను మఱియున్.

క. శైలిని, వృత్తమున, నగా
ధాలోచనలన్ మహాద్భుతాఖిలవిధపా
త్రాళిప్రదర్శనంబున
భూలోకమునందు మొదటిపుస్తకమగుటన్.

క. నాతండ్రి కనారతమును
జేతో ముదమిచ్చినట్టి శిష్టచరిత్రం
బై తనరారుట మొదలగు
హేతువులం జేసి మనసునీడ్చిన దగుటన్.

క. దానికి నానేర్చిన వి
ద్యానిపుణతకొలఁదిఁ జేతు నాంధ్రంబున వ్యా
ఖ్యానము యథార్థసంవి
జ్ఞానవిధానముల నవ్యకళలేర్పడగన్.

అని ప్రతిసమయమునను నాతండ్రిని ధ్యానించుచుండుట నాసాహిత్యమునకు నాతండ్రియ యధిదేవత.

ఈవ్యాసమును బెజవాడలో నుపక్రమించితినిగాని, నానాకారణ సంజనితమైన చిత్తవైకల్యముకతనఁ దుదముట్టింపనేరనైతిని. ఈనెల 23 వ తేదీని బెజవాడవదలి నాయల్లుఁడైన ఎగ్జిక్యూటివ్ యింజనీయర్ రామలింగముగారి, ధవళేశ్వరములో గోదావరీతీరముననుండు నింటికి వచ్చి చేరినతోడనే మనసు కొంతకుఁగొంతకుదిరి యెట్లో యిటువ్రాసి ముగించితిని. దోషములు లోపములు మెండుగానున్నట్లు నామనస్సు నన్ను బాధించెడిని. పాఠకుల యౌదార్యమే నాకు శరణ్యము.

16

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈగ్రంథముల నెత్తివ్రాసి మూలములతోఁ బోల్చిచూచి, చేయవలసిన దిద్దుబాటులుచేసి, సర్వవిధముల నిర్దుష్టములుగానొనర్చి, ముద్రణకార్యభారమును జయప్రదముగా నిర్వహించి, యనతికాలము లోన ప్రచురణస్థితికిఁ దెచ్చిన, సుప్రసిద్ధకవులును బండితులునయిన శ్రీశేషాద్రిరమణకవులయొక్క సాహాయ్యగౌరవమును శక్తికొలఁదిఁ బొగడఁగలనకాని యర్హతకొలఁదిఁ జేయఁజాలను. అట్టి విద్యావిశారదు లీకార్యమును సమర్థించుట నాతండ్రియొక్క సుకృతవిశేషము కాఁబోలు! సంచితపుణ్యములు సఫలములుగాక పోనేర్చునా?

శ్రీశేషాద్రిరమణకవులకు నాయొక్క ధన్యసూక్తులతోఁ గృతజ్ఞతాభివందనములను నిండుమనస్సుతో సమర్పించుచున్నాను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3

# వరదరాజశతకము



## పీఠిక

ఈ గ్రంథమును రచించిన యామె చిత్తూరికిఁ గొంతదూరమున నుండు గుండ్లపల్లె యనుగ్రామములో నివసించు నరసమ్మగారు. ఆమె నాకు అక్కవరుస. మా వంశములో నీ మహాత్మురాలి మించిన రూపవతిగాని, గుణవతిగాని యవతరించి యుండలేదని నా నమ్మకము. జీవితమొక్కటి సుఖభాజనము కాకపోయినదిగాని, యింక నేకొదవయు నీమె యెఱుఁగదు. సుఖమనఁగాఁ దనయొక్క సుఖము. గొప్పవారికి శోకమేగదా యీకలికాలములో భగవంతుఁడిచ్చెడు శుల్కము. చిన్ననాఁటనే భర్త కాలగోచరుఁడయ్యెను. ఆతని పేరు అప్పాసామిరెడ్డి. వారి గ్రామము 'వల్లివేడు'. వారితమ్ములైన శ్రీ నరసింహారెడ్డిగారు చిత్తూరు జిల్లాలోని యగ్రగణ్యులలో నొకరు. ధనియనియు, దాతయనియు సమప్రసిద్ధి వడసినవారు. రెడ్డిజనసంఘమున కిరువది వేలరూప్యముల నిచ్చిరి. వారు నాయక్కయైన సుందరమ్మగారి భర్త. ఇట్లు సర్వవిధముల నాకత్యంతసమీపబంధువులైనందున నాపసితనమునుండియు నేనీగ్రంథకర్త్రిని జక్కగా నెఱుఁగుదును. ఆయమ్మను దర్శించినఁజాలును; పూజించుట తప్పదు. ప్రేమించుట యంతకుముందే తప్పదు.

మా యింటిలోఁ బూర్వము మేనమామల యిండ్లకు బాలురమైన మేమేఁటేటఁ బోవుట పద్ధతిగా నుండెను. ప్రతిసంవత్సరమును అరగుండ, వావిల్ తోట, దామల్ చెఱువు, ఎల్లంపల్లె, వల్లివేడు, గుండ్లపల్లె నొకచుట్టు వేసికొని వచ్చుచుంటిమి. పోయినప్పుడెల్లఁ బట్టించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పంచెలు, ఒక్కరూపాయి నాకు మామూలు సంభావన. ఇంక విందుల సంగతిఁ జెప్పఁబనిలేదు. కోళ్లు, పొట్టేళ్లు, గడ్డపెరుఁగు, ఇంటకాచిన నెయ్యి,—ఇత్యాదినైవేద్యము శ్రీబాలరామలింగనికి యథేష్టముగ దొరకుచుండెను. కాలము మారినది; మేలుపడినది కాదు. ఆ సుఖములు, సాంగత్యములు, స్మరణమాత్రములైనవి; ఇఁక ననుభవమునకు రాఁజాలవు.

గుండ్లపల్లెకుఁ బ్రయాణమనఁగా నదియొక పండుగ; తీర్థయాత్ర యనియుఁ జెప్పవచ్చును. మా "అమ్మాయమ్మ"—నరసమ్మగారియొక్క ముద్దుపేరు—మాకు భోజనముపెట్టుటతోఁ దృప్తిజెందువారు కారు. ఆమె నడతలు, పలుకులు మనస్సును వికసింపఁజేయునవి. మఱియు—ఇదియ, యనన్యసామాన్యమైన విందు—ఊకుడుకథలు చెప్పుటలో మిక్కిలి నేర్పరి. ప్రొద్దస్తమానమును నాపెను వంటయింటికిఁ బోనీయకుండఁ గథలఁ జెప్పుమని నిర్బంధపఱచుచుండెడివాఁడను. రాత్రులలో నాపెవద్దనే పరుండి నిద్రవచ్చువఱకుఁ గథలు చెప్పుమని వినుచుంటిని. ఆపెవద్ద నేర్చుకొన్నవి నాకావయస్సున, 10, 12 సంవత్సరములపుడు, నూఱుకథలకంటె నెక్కువ వచ్చియుండెను! నూఱుకథలవాఁడనని మావారందఱు నన్ను మెచ్చుకొనుచుండిరి; నేనును ఈవిషయములో నహంభావములేనివాఁడనుగా నుండి యుండలేదు! బాల్య మహంకారప్రధానమైన వయస్సుగదా! ఇప్పుడా కథలన్నియు మఱపునకు వచ్చినవి; జ్ఞప్తికి రావు! నాస్మృతిమాంద్యము దలఁచుకొనిన నాకే సిగ్గగుచున్నది. మా "అమ్మాయమ్మ" గారెవ్వియు మఱచినట్లు కానము. కారణమేమనఁగాఁ దరతరములుగా నితరుల బిడ్డలనాదరించి పోషించుచుఁ గథలఁ జెప్పుచుండును గాన. పరులకు నభేదబుద్ధితో మేలుచేయుచుండెదమేని, మనయొక్క యాత్మయు నిత్యశక్తిని, నిరంతరవికాసమును దాల్చినదిగా నుండుటకు నిదియొక నిదర్శనము గదా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మానరసమ్మగారికి వైధవ్యదుఃఖము కొంతకుఁ గొంత తీఱునను నుద్దేశముచే నాపె యన్నయైన నరసింహారెడ్డి యాపెకుఁ దనవల్ల నైనంతకొలఁది విద్యచెప్పించెను. విద్యతోడఁ జీట్లాటయుఁ జెప్పించెను. కాలహరణమునకు వలయు సామగ్రులు గలిగియుండుటయేకద చింతాపనోదనక్రియ. అయిన నీపెకు వచ్చినవిద్య గురువులయొక్క గాని పరులయొక్క గాని భిక్ష గాదు. అది సహజపాండిత్యమునకుఁ జేరిన వరప్రసాదము. 13, 14 సంవత్సరముల కంతయు నాతండ్రిగారైన కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డి ప్రీతిప్రసాదముచేత నేనును దెనుఁగులో భారతభాగవతముల నించుమించుగ నర్థజ్ఞానముతోఁ జదువునంతటి వాఁడనైతిని. గుండ్లపల్లెకుఁ బోయినప్పుడెల్ల నన్ను భారతమును జదువుమని అమ్మాయమ్మగారు వినుచుందురు. పద్యముల కర్థము చెప్పుమందురు. శంకలేక తప్పో యొప్పో యేదేనొక వ్యాఖ్యానము చేసి నాపాండిత్యమును నిలువుకొనుచుంటిని. పూర్వము నాకామె ఊకుడుకతలు చెప్పి జ్ఞాపకశక్తిని, భావనాశక్తిని వృద్ధిపఱచెను. ఇప్పుడామెకుఁ గలిగిన ప్రతిఫలము భారతశ్రవణము.

ఆవయసుననే యాపెయందున్న గొప్ప శక్తియొకటి నాకు గోచరమయ్యెను. కవిత్వమునకుఁ బ్రధానబీజములలోఁ జెవియొక్కటి. కంటితోఁ జూచిచూచి, గణములను, యతులను, బ్రాసములను బరీక్షించుకొనుచుఁ, బద్యములను వ్రాయునట్టి మూఢులు తెలుచుగా లేరు కాఁబోలు. పద్యమును జదువునప్పుడును, భావములోఁ దీర్చునప్పుడును శబ్దమునుబట్టియే యది సరిగానున్నదా లేదా యనుట, కవిత్వశక్తిగల వారికెల్లను నప్రయత్నముగ నిర్ణయమగును. ఆ కర్ణప్రభావము మా నరసమ్మగారికి వెన్నతోవచ్చిన గుణము. అట్లగుట పద్యముల ధోరణి, శయ్య, గణయతి ప్రాససరణి, మొదలగు పద్యలక్షణములను జెవిచేతనే గ్రహించినది. నాకుఁ దెలిసి యామె ఛందశ్శాస్త్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చదువలేదు. వ్యాకరణమును జదువలేదు. ఆశుష్కపఠనమును నేను గొంతవఱకు చేసియున్నాను. మాయక్కకాదార్భాగ్యము సంభవించి నట్లు కానము. శ్రుతిప్రమాణముతో సాహిత్యమును సాధించెను.

కవిత్వమునకు జీవకళ భావము. పద్యము శరీరమాత్రము. ఇట్టి యుదారచిత్తురాలికి భావములు తక్కువగానుండునా ;

చింతాపూరితమైన జీవితముగావునఁ బరమేశ్వరుఁడేతప్ప నింకెవ్వడు నాకు దిక్కను దీనత్వముతోడ భక్తియుఁబెరుఁగుట యేమి యాశ్చర్యము ! ఈ గ్రంథముయొక్క యాధారభావము భక్తి. అందును, అకృత్రిమ స్వభావము వహించెడు సహజమైన భక్తి. పాండిత్యము, తత్త్వపరిశోధనము, వేద వేదాంత విచారము మొదలగు కారణముల చేతఁ గొందఱకుఁ దటస్థించెడు జ్ఞానవాదము కాదు. మఱి మీరాబాయి, సక్కూబాయి, ఘోరాంకుంభార్ మొదలగువారిచేఁ బ్రకటింపఁబడిన హృదయముయొక్క యావేశము.

తనదుఃఖమును దానెట్లాడంబరములేక తిన్నని సూటిమాటలచే వ్యక్తపఱచెడునో చూడుఁడు :—

“ సీ. జయరామ నేభువిఁ జన్మమెత్తినదాది
తల్లిదండ్రులఁబాసి తల్లడిలితిఁ,
బతితపావన బాలప్రాయంబునందు నేఁ
బతిసిఁగోల్పడి చాలఁ బాటుపడితి,
నమరవందితనిన్ను నర్చించనేరక
యన్నల బాసినే నధమనైతి,
నిన్నియు నెడఁబాసి నిన్ను నేమఱవక
ధైర్యంబుతోనుండి ధన్యనైతి,
గీ. నెన్నికష్టంబులుండిన నెపుడుమిమ్ముఁ
దలఁచువారల పాపముల్ తొలఁగుటరుదె ? ”

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈమె యన్నలిరువురు మంచివయస్సున మరణించిరి.

భక్తులు సొంతగాండ్రరీతి భగవంతునితో వాదాడి తిరస్కరింతురుగదా! చిన్నబిడ్డలు తల్లిదండ్రుల ముద్దుమాటలుగా గద్దించు మాడ్కి ఈ ముగ్ధభక్తి, యెంతసొంపుగా నున్నదో యీ క్రింది పద్యమునఁ దెలియనగును. ఇది మూఢభక్తి కాదుసుమా!

"సీ. పక్షివాహన! లక్ష్మి వక్షమందుండంగ
భిక్షమెత్తితివేల బిడియపడక!
పాలసంద్రపువెన్నఁ బంచిపెట్టెడునాఁడు
స్త్రీరూపమెత్తితి సిగ్గుపడక!
ధర జీవతతిఁ బ్రోచు దొరవయ్యునడవుల
గోవులఁగాచితి కొంచెపడక!
గొల్లనెలంతల యిల్లిల్లు దిరుగుచు
వెన్న మెక్కితిగదా! వెలితిపడక!
గీ. యిట్టికారానివగుపను లిందిరేశ
యెట్టులొనరించినావహో! యెగ్గులేక"

పెండ్లికార్యములలోఁ 'దలుపుతీసే' పాటలును ఈ సరసవివాదములకు నిదర్శనములు. ప్రణయకలహములును ఈ తరగతికిఁ జేరినవియ. భగవంతునితోఁ బ్రణయకలహములు పెట్టుకొని ఆదరపరిహాస వాక్యములఁ బ్రయోగించుట భక్తులకుఁగల హక్కులలో నొకటి.

ఈ శతకములో నీతిపద్యములున్నవి; దశావతార వర్ణనములున్నవి; రామాయణ భాగవత కథాసంగ్రహము లున్నవి; భారతము (నాకుఁ బ్రాణపదమైన గ్రంథము) యొక్క సురభి శీతల పవనము వ్యాపింపక పోలేదు. హిందూస్త్రీలకుఁ బ్రాణములకంటె నెక్కువమైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాతివ్రత్యాదిసాంసారికధర్మము లున్నవి; జ్ఞానమార్గ పద్యములున్నవి. ఇంక భక్తిమార్గపద్యములఁ దడవఁ బనిలేదు. అవి దట్టము.

తెనుఁగుదేశములో భక్తుల కెత్తినచ్చిన గ్రంథము భాగవతము. విషయమువారి కింపైనది. శైలియన్న దాసరివారి ఘంటానాదము వోలె లింగులింగని యుండునేమో! ఎట్లును భాగవతముయొక్క శైలిని యనుక్రమించుట యంతకష్టముకాదు. 'అంత' యనుట యేల నఁగా భారతముయొక్క శైలితోఁ బోల్చిన యెడలనని. దీనికి నిదర్శనముగాను, ఈమె స్వీయచరిత్రసంబంధిగాను నుండు రెండుపద్యముల నిట నుదాహరించుచున్నాను.

"సీ. అత్తమామలమాట కడ్డమాడని కాంత
కాంతయే రతనాలదొంతిగాని!
బావమఱఁదులకు బదులుపల్కని బాల
బాలయే యది విరిగోలగాని!
పతిసేవ కెన్నండుఁ బ్రాలుమాలని యింతి
యింతియే యది పూలబంతిగాని!
పతిబంధువులఁ బ్రేమ భావించెడు నతివ
యతివయే యపరంజిప్రతిమగాని!
గీ. ఇట్టి సద్బుద్ధిగలిగిన యింతితోడఁ
గూడుకొన్నట్టి పతికి వైకుంఠమదియె.
సీ. తల్లిదండ్రులమాటఁ దగవినకుండినఁ
గూఁతురేయది వెట్టికోఁతిగాక!
అన్నదమ్ములతోడ నైకమత్యము లేని
కూఁతురే యది వెట్టికోఁతిగాక!
మాటకు మాఱాడి మంకుచేష్టలు చేయు
కూఁతురే యది వెట్టికోఁతిగాక!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కనుసన్నతోఁ బనుల్ గావింప కుండినఁ
గూఁతురే యది వెఱ్ఱికోఁతిగాక!
యిట్టికూఁతుల నోరులకునిచ్చి తల్లి
యత్తగారిది తప్పనియనఁగనేల!

మిక్కిలి జాలిపుట్టించెడి యీ పద్యమును గమనింపుఁడు.

సీ. అవనిలో నావంటి యాఁడుజన్మముకంటె
బండగానడవిలో నుండవచ్చుఁ!
బుడమిలో నావంటిపొలఁతి జన్మముకంటె
గుట్టపైఁ జెట్టుగాఁ బుట్టవచ్చు!
వసుధలో నావంటి వనితజన్మము కంటె
వనములో మృగముగాఁ దనరవచ్చు!
క్షితిలోన నావంటి యతివజన్మము కంటెఁ
జెట్టుపైఁ బిట్టగాఁ జెలఁగవచ్చు!
నిట్టి సంసారవారాసి నిముడుకంటె
నీస్థలంబున గతికరై నెగడవచ్చు.

రెడ్లకులములోఁ బుట్టినవారికి వేమనయొక్క గాలి కొంతయైనఁ దగులకయుండునా!

వారియొక్క బోధతో నన్వయము చెందిన మాటలు కొన్ని యున్నవి.

సీ. కాశికిఁ బోవఁగాఁ, గర్మంబు తీఱునా
కాశికిఁబోవవే కాకులెపుడు!
జలములఁగ్రుంక, రాఁజాలునా మోక్షంబు
జలముల నుండవే జలచరములు!
తపముచేఁ దనువును దపియింప ఫలమౌనె!
తలక్రిందు వ్రేలవే ధరఖగములు!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వనబిలంబున నుండ వశుఁడౌనె దేవుండు ?
బిలము లందుండవే యెలుకలెపుడు !
ఇట్టి కష్టమౌ విద్యల నెల్లవిడిచి
బుద్ధినీయందు నిలిపినఁ బొందుముక్తి.

సీ. ఒరులపై శత్రుత్వ ముంచకుండినఁజాలు
సుపవాసములు నిత్యముండినట్లు
పరులమనసు నొవ్వఁ బల్కకుండినఁజాలు
జతురత వేదముల్ చదివినట్లు
ఇతరుల సొమ్మాశ్రయించకుండినఁజాలు
నోపికతో ధర్మ మొసఁగినట్లు
వారు వీరని పర్వవాటికుండినఁజాలు
దివ్యతీర్థములకుఁ దిరిగినట్లు
చాడిమాటల నొకరిపై సాహసమునఁ
బెట్టకుండినఁ జాల్ గుడుల్ గట్టినట్లె.

ఇట్టి జ్ఞానమార్గమునకు శాస్త్రపఠనమునకు సంబంధములేదు. ఇది ప్రతియొక్కఁడు తనంతటఁదానే చేసికొనఁజాలు విచారము. "కులముచూడంగనేల సద్గుణముగలుగ", "జ్ఞానులజ్ఞాను లొకలీలఁ బూనియున్న, నేమి? మహిమవలన వారలెఱుగఁబడరె?" "ఎట్టివారికి నొకనింద పుట్టుచుండు ; సకల జనసమ్మతిగ నుండఁజాలు నెవఁడు?"

ఇట్టి రచనలనేకములున్నవి. అవి యన్నియు సామెతలై జన సామాన్యమునందు వ్యాపించుననుటకు సందేహము లేదు.

ఆంధ్రలోక గురువులలో వేమన మొదటివాఁడందుమేని, సుమతి రెండవవాఁడు.

"వనితకాభరణంబు పతిభక్తి వెలయుట, ఇంటికాభరణంబు లెనయసుతులు" ఇత్యాది 'సుమతి' యొక్క యనుకరణములును నున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంతటి మంచిగ్రంథములో స్త్రీలప్రకృతి చెడ్డయని సూచించెడు పద్యముండుట నాకు చింతగానున్నది. ఈదోషము వేమనయందును నున్నది; హిందువులయందెల్ల నున్నది; మనజాతి దోషములయందెల్ల నిది మిక్కిలియు నసహ్యమని నాయభిప్రాయము.

సీ. వనితలహృదయంబుఁ గనఁజాలకయె గాదె
త్ర్యంబకుండాగంగఁ దలనుదాల్చెఁ
గాంతలమర్మముల్ కానరాకయెగాదె
పడఁతివాక్కునునుంచెఁ బద్మభవుఁడు
అతివలచిత్తంబు లరయఁజాలకకాదె
యురమున శ్రీలక్ష్మినుంచెహరియు
నింతులభావంబు నెఱుఁగఁజాలకకాదె
సతి నరుంధతి వశిష్ఠమునిగాచె
నెంతపతిభక్తిగలిగిన నింతివిభుఁడు
చెంతనుంచుట ధర్మంబుసృష్టిలోన.

అయినను స్త్రీలు స్త్రీలను నిందించుకొన్నఁ గొదవలేదు కాఁబోలు. పురుషులైన నీసనాతనధర్మమును వదలినమేలు.

ఇంక నేనెక్కువగ నీశతకమునుగుఱించి ప్రస్తావింపను. ఇప్పటికే యీపీఠిక నేననుకొన్నదానికంటె దీర్ఘమైనది. మా "అమ్మాయమ్మ" గారియందలి ప్రీతియు భక్తియు దీనికి ముఖ్యహేతువులు. ఆయమ్మగారు చెప్పినట్లే దోషములెవ్వియైననున్న విబుధులు మన్నింతురుగాక.

మావంశమున కేదివచ్చినరానిండు, తెనుఁగుభాష యొక్కటి మాత్ర మక్షయముగ నిలచియుండినఁ జాలును.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సర్వలక్షణసారసంగ్రహము

## పీఠిక

ఈ గ్రంథమును రచించినవారు మా గ్రామమైన కట్టమంచికిఁ బురోహితులుగాఁ బూర్వముండిన శ్రేష్ఠులూరు కుప్పనయ్యంగార్లు. వీరి నామాంతరము శేషాచార్యులు. వీరు 1894 వ సంవత్సర ప్రాంతమున స్వర్గస్థులైరి. అప్పటికి వీరివయస్సు దాదాపు 85 ఏండ్లని ప్రసిద్ధి. వీరిని నేను స్వయముగఁ జిన్నప్పటినుండియు నెఱుఁగుదును. వీరివద్ద మూఁడేండ్లు హైస్కూలులో విద్య నేర్చుకొంటిని. అదియును గాక యొక యూరివారమైనందునను, మా యింటి పురోహితులు గనుకను, నా తండ్రిగారైన సుబ్రహ్మణ్యారెడ్డిగారికి స్నేహితులు గావుటను, వారి యింటికి మా యింటికి రాకపోకలు బహుళముగా జరుగుచున్నందునను, బుట్టిన నాఁటఁగోలె వారి నెఱుంగుదుననుట, నిజస్థితి. నాకు నామకరణమును జేసినవారీ కుప్పనయ్యంగార్లే యని నా తల్లిదండ్రులు నాతో నుడివెడివారు.

వారియింటికి మా యింటికిఁగల సంబంధము ప్రచురణపాత్రము. నా ముత్తాతగారు కట్టమంచి రామలింగారెడ్డి. నా ఫాల పట్టికయందలి యొకానొక చిహ్నము భావిపాండిత్య సూచకమని గ్రహించి కుప్పనయ్యంగార్లు నా ముత్తాతపేరు నాకిడిరఁట!!

నా ముత్తాతగారు గొప్పవిద్వాంసులు. సంస్కృతాంధ్రముల రెంటను ప్రగల్భులు. కవులు. వారు రచించిన భాస్కరశతకాది కృతులను మదనపల్లెలో నా తమ్ముఁడైన భాస్కరరెడ్డియొక్క తనిఖీక్రింద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముద్రింపించుచున్నవాఁడను. ఈ రామలింగారెడ్డిగారు కుప్పనయ్యంగార్లకు సంస్కృతాంధ్రవిద్యలను, గొనరుగ జ్యోతిషమును బోధించిన గురువులు. కుప్పనయ్యంగారియొక్క సంతతి యల్పాయుష్యమై గతించినందున, నేనాయింటివారి కెవ్వరికిని గురువునగుట తటస్థించినదికాదు. లేకున్న నాయందు గుణములేకున్నను నాచారము ప్రకారమాకార్యము నడచినట్లు పురాణము గల్పింపఁబడియుండును.

ఒకానొకప్పుడు నేను రెండవఫారములోఁ జదువుచుండిన కాలమున సహపాఠియైన బ్రాహ్మణబాలకుఁ డొకఁడు రెడ్డివంశమును హేళనము చేయుచు మా జిల్లాలో వాడుకగా నుండు "రెడ్డిమడ్డి, సారాయిబుడ్డి" యను నిందావాక్యమును బహిరంగముగ నుడివెను. పాలసుఁడనగుట, నేను పంతులవారితోఁ జెప్పితిని. కుప్పనయ్యంగార్లాగ్రహపరవశులై యీ కాలపు టనాచారపూరితులైన బ్రాహ్మణులను జెడఁదిట్టి మా యింటియొక్క సంప్రదాయమును వెల్లడించుచుఁ, దమగురువులైన మా ముత్తాతగారి స్తుతిని దీర్ఘముగఁజేసి, తనయొక్క గురువుకులమును దూలనాడినందులకు శ్రీనివాసాచారిని అనరాని మాటలనిరి. ఆ సందర్భములో నీ సంగతిని దెలిపిరి :—ఒకానొకప్పుడు గొప్పవానలు కురిసి మళ్లన్నియు రొంపిగా నున్నకాలమునఁ దాను బురదలో దిగఁబడి కాళ్లెత్తఁజాలక చిక్కువడి యుండఁగా గురువులు రామలింగారెడ్డిగారు గనిమమీఁదఁ బోవుచుండుటఁ జూచి సాహాయ్యము చేయరమ్మని ప్రార్థించిరఁట. ఆ తొందరలోఁ బ్రార్థన వ్యాకరణవిరుద్ధమైన వాక్యముగా నున్నందున, మా తాతగారు కోపగించుకొని, దానిని దిద్ది పునశ్చరణచేసిననే కాని సహాయము చేయనని భీష్మించుకొనఁగాఁ గుప్పనయ్యంగార్లు క్షమాపణవేడి సంస్కరించి పల్లించిరఁట. ఆ నాఁటి శిక్షాక్రమములు నేఁడు చెల్లకుండుట చూడఁగాఁ గలియుగమే మేలనిపించెడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాయవ్వగారైన జ్ఞానమ్మగారు చనిపోయినప్పుడు మాయింట గోదానముగ్రహించి, కుప్పనయ్యంగార్లు చాలసేపు మమ్మెల్లర నోదార్చుట నిన్ననడచిన వృత్తమట్లు నా స్మృతిలో స్పష్టముగానున్నది.

మాతండ్రిగారు "భారతసార రత్నావళి," "భాగవతసార ముక్తావళి" యను గ్రంథములఁ గ్రోడీకరించి ప్రచురించునప్పుడు కుప్పనయ్యంగార్లును దోడ్పడిరఁట. తోడ్పాటెక్కువగాకున్నను ఒక్కయూరివారగుట, వీరు పరిష్కరించినట్లు మాతండ్రిగారు వ్రాసియున్నారు. పూర్వము గ్రామస్థు లవిభక్తకుటుంబము లట్లుండెడివారు. ఇప్పటివలె మన హిందూసంఘము విచ్ఛిన్నతఁ దాల్చి యుండలేదు.

కుప్పనయ్యంగారి కొక్కఁడే కుమారుఁడు, రంగస్వామి. అతఁ డిరువదియైదేండ్లకే చనిపోయెను. అతనికిఁ గొడుకొక్కఁడే కృష్ణసామి. అతఁడు దుర్బలశరీరి. అవివాహితుఁడై పదునారేండ్లకంతయుఁ గాలధర్మమునొందెను. ఇట్లుకుప్పనయ్యంగారిసంతతి నిశ్శేషమాయెను.

ఈ గ్రంథకర్త యిప్పటి సామాన్యపుఁ దెలుగుపండితులలో గణింపఁదగినవాఁడుకాఁడు. మంచిభూస్వామి. మంచియాదాయము తెచ్చెడు పౌరోహిత్యము వహించినవాఁడు. జ్యోతిర్విద్యావిశారదుఁ డనియుఁ బ్రసిద్ధిఁగాంచినందున నానాజనులు వీరినాశ్రయించుచుండెడివారు. తనయింట నాకుఁదెలిసిన యిరువురు బాలురకు భోజనాది సత్కారములుచితముగ నడపి విద్యావ్యాసంగమున కానుకూల్యము లేర్పఱచియుండెను. అందొకఁ డైదుమైళ్లదూరములోని చెరుకూరు గ్రామవాసియగు కమ్మవంశస్థుఁడు. కట్టమంచికిఁ జిత్తూరునకు దూరము రమారమి యొక్కమైలు. స్కూలునకు రెండెద్దులబండిలోఁ బోవువారు. నాతండ్రికిని రెండెద్దులబండి యాచారము. ఒంటెద్దుబండి నెక్కుట క్రూరమని, పాపమని వారిమతము. వీరిబండినిదోలువాఁడు వీరివలెనే మిక్కిలివృద్ధుడగు చిన్నయ్య యనుపల్లెవాఁడు. యజమానుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డును బనివాఁడును సదా పరస్పరవాగ్యుద్ధము చేయుచుండెడివారు. అయినను వారికొండొరులయెడ నసాధారణమైన ప్రీతియుండెనని వేఱుగఁ జెప్పవలెనా?

కుప్పనయ్యంగార్ల యుపాధ్యాయత్వమువలెఁ బ్రసిద్ధివహించిన గురుత్వమును మాజిల్లాలలో నొక్క శ్రీతిరువేంగడసామినాయఁడు గారు తప్ప నింకెవ్వరు గడించియుండలేదు. "చిత్తూరిపులి" యని బిరుదుగాంచిన తిరువేంగడసామినాయఁడును, గుప్పనయ్యంగార్లును జనులస్మరణలో నేఁటికిని బచ్చగఁ బదిలముగ నున్నారు. "నీ వేమి కుప్పనయ్యంగారా" యని యాక్షేపించినయెడల "అంత గొప్ప విద్వాంసుఁడవా" యని ప్రశ్నరూపమైన తిరస్కారము. "ఏమయ్యా, కుప్పనయ్యంగార్లనలె మాట్లాడుచున్నావు" అని చెప్పిన నతిశయో క్తులు ముఖస్తుతులు బాగుగఁ గలిపి చందనమలదుచున్నావని భావము. వీరివద్ద నేర్చికొని స్కూలుపండితులైన వారిసంఖ్య మిక్కిలియుఁ బెద్దది. నా మట్టుకు నా సాక్ష్యమిచ్చుచున్నాను. కుప్పనయ్యంగారును వారి యనంతరము పండితులుగా వచ్చిన వేంకటకృష్ణమాచార్యులును నేర్పిన దానికంటె నెక్కువ నేను కాలేజీకి వెళ్లిన తరువాత నేర్చుకోలేదు. అనఁగా కాలేజీపండితులు చెప్పలేదని కాదు—నేను నేర్చుకోలేదు. ఆ వచ్చిన దానితోనే నా భాషాయాత్రను గడపుచున్నాను.

వీరు దాదాపు 1886 వ సంవత్సరములో పింఛనుమీఁద నుద్యోగ నివృత్తిని గడించిరి. 1889 వ సంవత్సరములో సర్కారు హైస్కూలు నకుఁ బోటీగా "నేటివ్ హైస్కూలు" ను దాక్షిణాత్య బి. యే. లు ముగ్వురు నెలకొల్పిరి. కుప్పనయ్యంగారి యొక్క యాకర్షణమాహా త్మ్యమును గ్రహించి, వారు వీరిని నేటివ్ హైస్కూలులో నాంధ్రోపా ధ్యాయులుగా నియమించిరి. గవర్నమెంటు స్కూలు ఖాళీపడుట కారంభించెను. అది చూచి గవర్నమెంటువారు 1890 వ సంవత్సర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములో వీరిని మఱల హైస్కూలులో నుపాధ్యాయులుగా గ్రహించిరి. వీరి రాకయు నేటివ్ హైస్కూలు పోకయు నేక కాలాంశములు.

అప్పుడు వీరి వయస్సు రమారమి 80 ఏండ్లని వదంతి. మిక్కిలి పొడుగైన మానిసి. దాదాపాఱడుగుల పొడుగు. నిమ్మపండువంటి మనోహరమైన చాయ. శ్వేతవస్త్రుఁడు. పండ్లులేకున్నను ఉచ్చారణ స్పష్టముగ నుండును. గంభీరమైన కంఠనాదము. సాధారణముగ నేదైన నత్తరు పూసికొని క్లాసునకు వచ్చును. "ఏమండీ! మీ క్లాసు ఎంత మంచి వాసనగా నున్నది." అని యొకప్పుడు నేను బొగడఁగా "బాలురారా! మాతృభాషయొక్క పరిమళము సుమండీ! మీ యింగ్లీషు... ......పోలె దుర్గంధపూరితము కాదు." అని సింహము నవ్వునవ్వినారు. వీరి మాటలనేకము లసభ్యములు. అయ్యు నెవరికిఁ గోపము రాదు.

వీరిక్లాసులో నింగ్లీషుమాటలే మాత్రము పలుకకూడదని యాజ్ఞ. ఎవరైనఁ దెలియక పలికిరో వారితల్లియొక్క పాతివ్రత్యమునకు వచ్చిన భంగముఁ జెప్పరాదు. తాను మాత్ర మాగ్రహపరవశత్వములో "On the bench" అని శిక్షించును. అదితప్ప వేరు ఇంగ్లీషుముక్క వీరు వాక్రుచ్చుట నే నెఱుంగను. "Home exercise" అనఁగూడదు. గైహికమనవలయును. "Dictation" అని పొరపాటునఁ జెప్పినయెడల మా కులస్త్రీలు కులటలగుట తప్పదు. ఉక్తలేఖనమని దాని పేరు. వారమునకు మూఁడుపర్యాయములు, పర్యాయమునకుఁ బదినిమిషముల చొప్పునఁ గఠినపదములకు ఉక్తలేఖనము వ్రాయించుట వారిపద్ధతి. అందు మాకుఁ బ్రాణకంటకములైన మాటలివి. త్ర్యంబకశాస్త్రి, అవాఙ్మానసగోచరుఁడు; పయఃకాంతి; యశఃపాళి; శత్రుఘ్నుఁడు; కఱ (బండి ఱా రా విధవ) కంఠుఁడు; (కడుపులో సున్న ఉండే వత్తు ఠా రా, గాడ్దెకొడకా) ఇత్యాదులు. వార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున కొకపర్యాయము "గైహికము." ఇంటిలో వ్యాసములు వ్రాసి చూపించువారి సంఖ్యయల్పము. పంతులవారి యాగ్రహమనల్పము.

వీరు హైస్కూలులోఁ బునఃప్రవేశము చేయునపుడు నేను మొదటిఫారములో విద్యార్థిని. వీరివద్ద నేఁ జదివిన మూఁడేండ్లయిన పిదపఁ బనినుండి పునర్నివృత్తి నవలంబింపవలసిరి. ఆ మూఁడేండ్లు చదివినది యొక్క పుస్తకమే. నలోపాఖ్యానము. అయిన నెట్టిచదువు? వ్యుత్పత్త్యర్థములు, నానార్థములు, సంధులు, సమాసములు, వ్యాకరణము, ఛందస్సు, అలంకారములు మొదలగు విషయములన్నియు సర్వాంకషముగ బోధించిరి. ఈ సర్వలక్షణసారములోని విషయములన్నియు నలోపాఖ్యానప్రయుక్తముగను సరసముగను మనమున నాటి వికసించునట్లుఁ జేసిరి.

కుప్పనయ్యంగార్లకుఁ దమ శిష్యులయందుఁ బ్రీతి యపరిమితము. తానుమాత్రము మమ్ముఁ జెడఁదిట్టవచ్చును. ఇంకెవ్వరు మా జోలికి రాఁగూడదు. ఇంకెవరివల్ల మాకే యిబ్బందియుఁ గలుగఁగూడదు. తుదను బరీక్షల క్రమములు సయితము మా యందుఁ జెల్లరాదు.

ఆ కాలమున సాంవత్సరిక విచారణకు వచ్చువారు 'మిల్టన్' అను ఆంగ్లకవీశ్వరునకు వ్యాఖ్యానకర్తలైన 'బ్రౌన్‌షా' యను దొర. ఆతఁడును మిక్కిలి వృద్ధుఁడు. ఈ యిరువురి మునలివారికిని నొకరిభాష యొకరికిఁ దెలియకపోయినను సఖ్యము సంపూర్ణము. ఒకరినొకరు చూచి చిరునవ్వులు ప్రయోగించుకొందురు. ఇంతకంటె నెక్కువ సంబంధము వారి కసాధ్యమైన యీప్సితము. ఆ బ్రౌన్‌షా దొరగారితోఁ దెనుఁగుక్లాసుల తనికీకి వచ్చువారు జానకిరామయ్య యను సబ్ అసిస్టాంటు ఇన్‌స్పెక్టరు, బ్రాహ్మణుఁడు. తెనుఁగు తెలిసినట్లు నటించువాఁడు. జానకిరామయ్య యనిన మా కుప్పనయ్యంగారికి సరిపడదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఏమండీ. శుద్ధవెధవ. ఓలంటె నారాని...కొడుకు నాతరగతి పరీక్షించడమట. బాలులారా, ఆవెధవనుజూచి భయపడవద్దు. వాడు వ్యాకరణసూత్రాలనడుగును. మీకు తెలిస్తే తెనుగుసూత్రాలు చెప్పండి. మీకు తెలియకుంటే ఈ సంస్కృతసూత్రములలో మీకు అప్పుడు తట్టినదాని నేదైన నొక్కదానిని ధైర్యముగచెప్పి గంభీరముగా కూర్చోండి. జ్ఞప్తియున్నదా—కొడుకులారా. "అకస్సవర్ణే దీర్ఘః", "అదేజ్గుణః" "వృద్ధిరాదైచ్" వల్లించండి. ఇంకా గట్టిగా వల్లించండి. బాగా జ్ఞప్తియున్నదా. ఏదైనచెప్పివేసి కూర్చోండి. నిలువబడి యుండకూడదు, తెలిసిందా—కొడుకులారా." ఈరీతిని రంగము సిద్ధముచేయఁబడియుండును. జానకిరామయ్యగారి ప్రవేశము. పొడుగు మానిసి. ఎఱ్ఱటిరంగు. జరీతలపాగా; గర్వపుఁజూపులు; అదలింపు మాటలు. వచ్చినదే వైయాకరణత్వము ప్రకటింపఁబూనును. "విచ్చింగలువలు" సూత్రమేమి రాధాకృష్ణయ్యా జెల్దీచెప్పు." రాధాకృష్ణయ్యకుఁ దెనుగులో శక్తి, రక్తి పూజ్యము. "అదేజ్గుణః" అని కేకవేసి గుభాలున ప్రక్కనుండు బాలునిపైఁ గూర్చుండును. "ఎంత బాగా చెప్పినాడండీ! జవాబంటే అట్లుగదా నుండవలయును. ఆహా! ఆహా! సరియైనసూత్రము. సంస్కృతశక్తిని చెప్పినాడు, చూచితిరా, జానకిరామయ్యగారూ! నాబాలునిధోరణి" అని కుప్పనయ్యంగారు జయధ్వానముచేసి బిగ్గరగానవ్వుదురు. పాపము, జానకిరామయ్య యేమిచేయఁగలఁడు! మహావిద్వాంసులు మెచ్చుకొనిరి. తనకా 'తల' యిది 'తోక' యిది యని తెలియదు. "అవునండి. మీ బాలురు బాగా ఉత్తరమిచ్చుచున్నారు." అని కొంతసేపు "అదేజ్గుణః, వృద్ధిరాదైచ్, అకస్సవర్ణే దీర్ఘః" ల నాలకించి యాందోళనచెంది వెళ్లుచుండెడివారు, జానకిరామయ్యగారు క్లాసు విడిచిపెట్టినదేచాలును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాపంతులవారి దుర్భాషాప్రయోగములు మామీఁద జడివాన కురిసినట్లు పడకపోవు.

పరీక్షాసమయములో వీరిని సూపరెంటుగాఁ బెట్టిరేని ప్రతి వాఁడెట్లు వ్రాయుచున్నాఁడో యని చూచి చూఁచి, సదుత్తరముల సలహాల విచ్చలవిడి వారిచెవిలో నూదుచుఁ దిరుగుచుండురు. చక్కగాఁ నుత్తరములు వ్రాయువాని కాగితములు తీసికొని మొద్దన్నల బల్ల మీఁద రహస్యముగాఁ బెట్టి, "నఖలు త్వరలో తీయరా...కొడకా" యని సహాయము చేయుటయుఁ గలదు. ఈ విషయమై వీరితో నేహెడ్‌మాష్టరును బోరాఁడి గెలువఁజాలఁ డాయెను.

"ఏమండీ! వెధవపరీక్షలో నా బాలురు ఫెయిల్ అవుతూవుంటే నేనూరక చూచుకొని యుంటానా! యేమి? ప్యాసైన వెనుక వారిని దిద్దుకొంటాము." ఉక్తలేఖనములో వచ్చుచిక్కులు :–ర, అ, లు, శ, స, లు "నేను మూఁడుమార్లు చదివితినంటే బండి 'అ', 'శ' వర్ణము...కొడుకులారా! మామూలు రెండుసార్లు చదివితినంటే సాధారణమైన 'ర' 'స' కారమున్ను, భద్రం, వెధవలారా!" అని సూత్రధారిత్వము చేయును. మా హెడ్‌మాష్టరులలో నగ్రగణ్యులనఁ దగినవారు భాష్యం అయ్యంగార్లు; అరవాయన. శిక్షాపద్ధతులలోఁ బారంగతుఁడు. మంచివాఁడు. మర్యాదాపరుఁడు. శిక్ష కొంతవఱకు కఠినము, సరళము కాదు. మే మెప్పుడైన శ్రమకోర్వఁజాలక యాట విడుపుదినము కోరి కుప్పనయ్యంగార్లతో మొఱపెట్టుకొంటిమేని, "ఆలాగే. రేపు సెలవిప్పిస్తాను." అని చెప్పి తక్షణమే ఆ మఱునాఁడు మహావ్రతదినమనియు, బాలురకు సెలవిచ్చుట సంప్రదాయమనియు, హెడ్‌మాష్టరు వారితోఁ జెప్పి 'రజా' గోరుదురు.. కుప్పనయ్యంగారి యందలి గౌరవభావమున, భాష్యమయ్యంగార్లు ముసిముసి నవ్వుతో నంగీకరింతురు. ఇట్టివి కుప్పనయ్యంగారి పక్షపాతలీలలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

1893 వ సంవత్సరములోఁ బనినుండి పునర్నివృత్తిఁ గాంచిరి. పాపము! అంత్యవర్షములు మనస్సుఖపూరితములు కాకపోయెను. జీవనమునకుఁ గష్టమేమాత్రమును లేదుకాని, మనుమఁడు చచ్చుటవలన మతిభ్రమణము సంఘటిల్లినది. నాతండ్రి మొదలగు స్నేహితులు సఖులుగా నుండినను వృద్ధతకతమునను సంతానక్షయముచేతను జిత్తము శిథిలమైన ట్లొకసంవత్సరముండెను. అప్పటికిని దమ దానధర్మముల నన్నింటిని యథారీతిగా నడపెడివాఁడు. పిమ్మట, 1894 వ సంవత్సర ప్రాంతమున గ్రామస్థులందఱుఁ బరివేష్టించి పరివేదన చెందుచుండఁగాఁ బరమపదసౌఖ్యమును స్వీకరించిరి.

వీరికిఁ బరవస్తు చిన్నయ్యసూరిగారితోఁ బరిచయముండెనని వదంతి.

వీరు రచించి ప్రకటించినది యీ "సర్వలక్షణసారసంగ్రహ" మొక్కటియె. దీని రచనలో, నింగ్లీషు విద్యను గడించినవారగు శ్రీ పరమాత్ముని నరసింహయ్యగారు తోడుపడిరి. ఇందు నింగ్లీషు పదములు సంపూర్ణముగను, వర్గీకరణము, విషయానుక్రమణము కొంతమట్టునకును పరమాత్ముని నరసింహయ్యగారికిఁ జెందవలసిన ఋణమని తోఁచెడిని. గద్యరచననుగూర్చి చర్చించియుండు వ్యాకరణములు మన భాషలో నంతగా లేవు. ఆ సకృత్ గ్రంథములనెల్ల కుప్పనయ్యంగారి "సర్వలక్షణసారసంగ్రహ" మాద్యము. వ్యాకరణమునకు వచనరచనా కళ నంటఁగట్టినవారిలో వీరు ప్రథములు.

రెండు నెలల క్రిందట శ్రీ పరమాత్ముని నరసింహయ్యగారును స్వర్గస్థులైరి.

ఇది నిజమ్ముగా సర్వలక్షణసార సంగ్రహము. కూచిమంచి తిమ్మకవి గ్రంథమును వీరు చూచియైన వినియైన నుండనట్లున్నది. కావున గ్రంథముయొక్క నామకరణ మాకస్మికానుకరణము కాని,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేఱు కాదు. మొదటిఫారము మొదలు రమారమి బి. ఏ. వఱకు పఠనీయమైన యీ సర్వాంకషలక్షణగ్రంథమునుగూర్చి యెక్కువగా వ్రాయుట యనావశ్యకము.

ఈ గ్రంథము మొట్టమొదట ప్రచురింపఁబడినది నా పుట్టుటకు ముందు! రెండవకూర్పు నయితము నా శైశవమునందే ప్రకటిత మాయెను. పిమ్మట వేయఁబడినట్లు కానము. మూఁడేండ్ల క్రిందట వెదకి వెదకి, విచారించి, విచారించి, వేలూరిలో నొక ప్రతిని గనిపెట్టి సేకరించితిని. దానిని పునర్ముద్రితము చేయవలయునని కాలక్షేపము చేసినందులకు నాకే సిగ్గగుచున్నది. ఇటీవల 'వేంకటరామ్' కంపెనీవారి పక్షమున వేలమూరి సత్యనారాయణగారు నన్నుఁ జూచుటకు రాఁగాఁ బూజాగ్రంథమువలె రక్షించుచుండిన దీని నిచ్చి ప్రచురింపుమని కోరితిని. వారును బండితులకుఁ జూపించి వారెల్ల రేకగ్రీవముగఁ బ్రచురణార్హమన్నందుపై నట్లు చేయఁదొడంగిరి. ముద్రణకుఁ బ్రారంభించినమీఁదట రెండు పత్రములు నష్టములై యుంట గోచరించెను. పిమ్మట నా బంధువులైన పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు, ప్రయాసతో సంపాదించిన యింకొక ప్రతి లభింపగా, నది మాకు గావలసినచోట్ల శిథిలమైయుండినను, బూరించుటకు సాధ్యమైయున్నందున, దానిని బట్టి, పోయిన పుటల విషయమును వ్రాయించి ముద్రణకార్యము నెఱవేఱునట్లు చేసితిమి.

దైవకృపచేతను, మిత్రుల సాహాయ్యముచేతను నాదోషములను నేను బ్రుంగకుండ నస్మద్గురుఋణమును ఈమాత్రము తీర్పఁగలిగినందులచే ధన్యుఁడను. ముమ్మాటికి ధన్యుఁడను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧

# ఆంధ్ర వాఙ్మయ చరిత్రము

## పీఠిక

ఆంధ్రవాఙ్మయమునకు నేడుగదా సరియైన చరిత్రము లభించినది. ఈభూషణమును జేకూర్చి మాతృభాషకు నూతనరాగమును గల్పించినవారు విద్వద్రసికులైన వంగూరి సుబ్బారావుగారు. ఈకృతిచే దమకును మనముద్దులభాషకును గృతార్థతఁ బ్రతిపాదించుకొనిరి. మన యామోదమునకుఁ దీటగు మనస్సంతుష్టిని వారు వడయుదురేని వారికి మించిన సుఖజీవులుండరు.

ఈగ్రంథ మసమగ్రము.* హారము సంపూర్ణముగాఁ గట్టఁబడకున్నను, వేయఁబడియుండు ప్రతిరత్నమును నిక్కము, నిర్దోషము, అమూల్యము. రాశికంటె గుణముకదా ప్రధానము. రాశియు నిఁక ముందు సమగ్రమగును. త్వరలో నీప్రారంభమును బూరించి పునర్యౌవనయగు నాంధ్రభాషకుఁ గంఠాభరణము వేయుదురని నాప్రార్థన.

కవులచరిత్రల ననేకులు మహనీయులు వ్రాసియున్నారు. కాని, యవి వాఙ్మయచరిత్రలు కావని నామనవి. భాషాచరిత్రకును, గవుల జీవితములకును సంబంధమున్నప్పటికిని నవిరెండును నొక్కటి గావు. మఱి భిన్నములు. కవుల చరిత్రముల వ్రాయుటలో శ్రీవీరేశలింగముగారసాధారణప్రజ్ఞులు. వారికి మించినవారు లేరు. వారిగ్రంథములయందుఁ జరిత్రశోధనయనఁగా ముఖ్యముగాఁ గాలశోధనయె.

* ఈగ్రంథము మొదటిభాగము మాత్రమే ప్రకటింపఁదలఁచినప్పు డిట్లు వ్రాసిరి. వారి యాజ్ఞానుసారము గ్రంథము పూర్ణముగనే ప్రకటించితిని. వం. సు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలనిర్ణయము వారిప్రధానోద్దేశము. ఈరీతి జాతకములువ్రాయుట యనివార్యమైనను దానికిని జరిత్రరచనకును వ్యత్యాసమెక్కువ. చరిత్రకారుని వివిధార్థములలోఁ గాలనిర్ణయమొక్కటి. అది సమస్తము గాదు. మఱియేయంశములు ప్రధానములనగాఁ, బరిణామముయొక్క ధోరణిని వర్ణించుట, దానియందలి ముఖ్యస్థితులకుండు పరస్పరసంబంధములను విశదీకరించుట, వివిధదశలను నిర్ణయించు హేతువులను, వానినుండి ప్రభవిల్లు ఫలములను వివరించుట, ప్రకృతవిషయము—అనఁగా భాషాచరిత్రాదులు—ఏరీతి, సాంఘిక, ఆర్థిక, రాజకీయాదిపరిస్థితులచే నిర్ణీతములో దానిని వ్యక్తపఱచుట, యివి మొదలైనవి. పురోహితునట్లు జన్మనక్షత్రము నిరూపించినఁ జాలదు. సంఘముయొక్క యంగములయు, వ్యాపారములయుఁ, దద్వికారాకారములయుఁ గారణములనారసి, మార్పులన్నియు సహేతుకములనియు, సహజములనియు, నిర్ణయించి వ్యష్టిసమష్టులకుఁగల సంబంధములనుజూపి చరితముయొక్క మైక్యమును బ్రకటించుట చారిత్రకుని కర్తవ్యము.

ఐక్యమనఁగా నిర్వికారస్థితిగాదు. కేవలత్వము కాలాధీనులమైన మనయందుఁ జెల్లుభాగ్యముగాదు. పుట్టి పెరిగి చచ్చులోపల నెన్నియో మార్పులఁ జెందువాఁడయ్యును, మనుష్యుఁ డొక్కఁడుగ భావింపఁబడియెడిని. తాను నట్లే భావించును. దశదశకును భిన్నుడైఁన వేఱొక్కఁడుగా గణింపఁబడఁడు. పదియేండ్లప్పుడు, ఇరువది సంవత్సరములనాఁడు, ఏఁబది వర్షముల వయస్సైనన పిమ్మట, చర్యలు, భావములు, స్వభావము పెక్కువిధముల మాఱినవైనప్పటికిని బాత్రము భిన్నముకాదు. కావుననేకదా యిరువదియేండ్లప్పుడు చేసిన యప్పు నలువదియేండ్లప్పుడైనఁ దీర్పవలయుననువిధి. “అప్పుడీసిన నాఁటికిని, నేఁటికిని నాప్రకృతి యెంతయో మాఱియున్నది. ఆనాఁటి తనమునకు నీనాఁటితనమునకును నేసామ్యములేదు. కాఁబట్టి యెవఁడో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిరువదియేండ్ల మూఢుఁడుచేసిన యప్పును ఈ యఱువదియేండ్ల సుజ్ఞాని యెందునకుఁ దీర్పవలయును" అని యెవ్వఁడైన వాదించిన, వానిని విచ్ఛిన్నచేతస్కుఁడని పిచ్చియాస్పత్రికిఁ బంపుదుము. కావున నైక్యమునకు నిర్వికారస్థితి ప్రధానముగాదు. వికారములున్నను నైక్యస్థితి పూసలలోని దారమట్టులుండఁగలదు.

హఠాత్తుగ నున్నట్టులుండి యెవఁడైనను "నేను దేవేంద్రుఁడను. లోకములన్నియు నాయధీనములు. నాయింటిలో వజ్రాయుధమున్నది. రంభాద్యప్సరసలు నృత్యమాడుచున్నారు. ఊరివారందఱావినోదమును జూచుటకురండి" యని కేకలు వేసిన, వాని నున్మత్తుఁడనియు నప్పుడు చేయుకార్యములకును బూర్వముచేసిన వానికిని జవాబుదారి కాఁడనియు వానిని దూరస్థుని జేయుదుము. దీనికిఁ గారణము వానియందలి మార్పు. సహజపరిణామమునకు విరుద్ధముగ నుండుట యనఁగా సకారణముగాకుండుట. ఇట్లనుటచేఁ బిచ్చియెత్తుటకుఁ గారణములులేవని యర్థముగాదు. మెదడు క్షీణించుట మొదలగు నుపాధులు దీనికిఁ గారణములు. మఱి యాచిత్తభ్రమచే సృజింపఁబడిన దేవేంద్రత్వము, రంభాదులు, మిథ్యలనుట.

మొత్తముమీఁద సకారణము, సహేతుకము, సహజము, అనునవి సమీపబాంధవ్యముగల తత్త్వములనియు, నవి కుదిరినచో వికారములున్నను భిన్నత్వముండదనియు, నిట్టి సవికారభిన్నతయ యైక్యమనుగుణమనియు గ్రహించితిమేని, ప్రకృతవిచారణకుఁ జాలును.

కావున దేశము, సంఘము, భాష, యిత్యాదుల చరిత్రవర్ణనమున, మార్పులకు నాధారభూతములగు హేతువులను, వానిచే నుద్భవించు ఫలములను వివరించి, యవస్థ లావశ్యకములనియు, ననిరోధములనియుఁ జూపితిమేని, పరిణామము విరుగుడులేదనియు స్వభావానుసారమనియుఁ, జూపినవారమగుదుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈతత్త్వప్రదర్శనముచేఁ గలుఁగుప్రయోజనము లెవ్వియనిన:— ఐక్యమనునది స్థితియొక్క లక్షణములలో నొకటి. ప్రపంచమంతయుఁ గార్యకారణబద్ధము. మనము గుర్తించినను, గుర్తింపకున్నను అది నిత్యము. అకుంఠితము. ఒక్క భగవంతుని కరుణారసముతప్ప నిర్హేతుక జాయమానములు ప్రపంచములో నహి. ఈయపవర్గము విషయము నందును భక్తులసాక్ష్యముదప్ప నింకేప్రబలసాక్ష్యము లేకయున్నది. అది యేమాత్రము నమ్మఁదగినదో నాకుఁదెలియదు. ఎట్లును నీకలియుగములో దానిప్రచారము తెలుగుడువడినట్లు తోఁచెడిని. కాక యున్న, భక్తులతో నిండియుండు నీదేశము దురాచారమువలన క్షయము దాల్చినదయ్యు నేల యానిష్కారణకరుణను నాకర్షించి, యిన్నిశతాబ్దములుగ నుత్కృష్టస్థితికి రాకయున్నది? నిర్హేతుకజాయమానమాహాత్మ్యముల నాశ్రయించి మనదోషముల మనము దిద్దికొనకుండుట మూఢమతము. ప్రకృతిలక్షణముల నరయుట శాస్త్రము యొక్క పని. అట్లగుట నీయైక్యతాగుణమును వివక్షించుట దాని ధర్మము. రెండవది—అన్నిమార్పులు హేతువుల ననుసరించి వచ్చుచున్నవని దృఢముగా గ్రహించితిమేని ఛాందసములు నశించును. మంత్రములు మొదలగు బూటకములమీఁద బుద్ధిపోదు. ప్రతియొక కార్యమునకును దదనుగుణమైన ఫల మనివార్యమని యెఱింగితిమేని కార్యోత్సాహము ప్రబలును. తద్ద్వారమున సంస్కారములకుఁ బ్రారంభించి మనముక్తి మనశక్తిలోనిదగుట, దానిని గడింప యత్నింతుము. "కార్యకరణములకును హేతుఫలములకును సాంగత్యములేదు. అంతయు దేవునిదయ" అని నమ్మువారు కార్యములు చేసియు ఫలములు కలుగునో కలుగవో యనుసందియము కలిగి యుందురుగానఁ బౌరుషవంతులు గాఁజాలరు. మనదేశస్థులు బీఁకువడిన వారుగా నుండుటకు, నిర్హేతుకములు సాధ్యములను నమ్మకము మూల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారణము. దీనివలెఁ బౌరుషమును లోలోపలఁ దినివేసి జీవితము నిస్సారముచేయు చీడపురుగు వేఱొకటిలేదు. కావున నింద్రజాలములు, నిర్హేతుకములు, నిష్కారణములు, అవ్యాజములు, ఆకస్మికములు, ప్రకృతియందు లేవనిగ్రహించుట పౌరుషోద్దీపకము. ఈన్యాయమును బ్రకటించుట మనుష్యులకును దేశమునకును శ్రేయోగౌరవదాయక మగుపని.

కవులయొక్క జీవితములమాత్రము పరిశీలించినచో భాషా సమష్టియొక్క చరిత్రము చక్కఁగా వేద్యముకాఁగలదు. వ్యష్టికంటె మొత్తముమీఁద సమష్టిప్రధానము. వాఙ్మయసర్వస్వము నేకసత్తుగాఁ గొని చరిత్రశోధనము చేసినవారిలో వంగూరి సుబ్బారావుగారు ప్రథములు. ఈచరిత్రములోని విషయము లితరగ్రంథములలోఁ గనపట్టినప్పటికిని గర్తగారిదృష్టియు నవిగూర్పఁబడిన తీరును వేఱు. దీనికి మార్గదర్శకములైన గ్రంథములు పాశ్చాత్యభాషలలో వేన వేలున్నవి. మనభాషయందు నాకవి యగోచరములు. ఇటీవల లూయిస్‌రైస్‌గారు వ్రాసిన కన్నడవాఙ్మయచరిత్రమును సుబ్బారావు గారు ప్రాతిపదికముగా ననుగమించి యున్నారు. రైసువంటి చారిత్రకా గ్రేసరుఁడు చూపినమార్గము సంభావ్యమని వేఱుగాఁ జెప్పవలయునా?

ఆంధ్రవాఙ్మయముయొక్క పరిణామమందలి దశలును, వాని హేతువులును నిందుఁ జక్కఁగాఁ జూపఁబడియున్నవి. ఈవిచారణలు తఱచు సంఘశాస్త్రమునకుఁ జెందినవిగాన నీకవిగారిదృష్టి, ప్రభుత్వ ములు మతములు మొదలగువాని నాక్రమించి, వానిచేఁ గలిగిన ఫలములను విమర్శించి యున్నది. వాఙ్మయచరిత్రము సంఘశాస్త్ర సంబంధిగా వ్రాయబడియుండుట శ్లాఘనీయమైన విశేషము. అనేక స్థలముల సుబ్బారావుగారు నూతనయోజనలఁ బ్రయోగించి క్లిష్టార్థ ములకు నన్వయము నద్భుతభంగిఁ గల్పించియున్నారు. ఇవిమొత్తము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మీఁద వెట్టియూహలకుఁ జేరినవిగాక విమర్శనపద్ధతి ననుసరించిన దృఢసత్త్వములుగా నున్నవి. ఎన్నియో గ్రంథములఁ బరిశీలించి, పరిశోధనల నెన్నియోచేసి, యట్లు సేకరింపఁబడిన సామగ్రులఁ దేట తియ్యని విధమున నివేదించియున్నారు. శైలి రసవంతముగాను, స్పష్టముగాను నున్నది. వాఙ్మయచరిత్రరచనకుఁ గావలసిన గుణములన్నియుఁ దాల్చినట్టి సుబ్బారావుగా రీగ్రంథమున కుద్యోగించుట భాషాభాగ్యమే కాని వేఱుకాదు. వీనికిని వీరిగ్రంథమునకును సర్వవిధముల నభ్యుదయమును జయమును గలుగునుగాక!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧

# ఆంధ్రభాషానుశాసనము

---

సూర్యనారాయణీయమను పేర దేశప్రసిద్ధిగాఁ జిరకాలము పఠనీయముగా నుండఁబోవు నీవ్యాకరణమందలి విషయ మఖండము. రచనాపద్ధతి నూతనము, గంభీరము. ఆంధ్రభాషయందు వాత్సల్యము గలవాఁడనగుటచేఁ గారణాంతరములచేతను గార్యాంతరములచేతను వ్యవధిచాలనివాఁడనయ్యు నేదో యొకవిధముగా నీయాంధ్రభాషానుశాసనమునకుఁ బీఠిక వ్రాయఁబూనితిని. దీనిని బాఠకులాదరింతురుగాక!

వ్యాకరణమును వ్రాయుపద్ధతులు రెండు. చరిత్రానుసారముగా వ్రాయుట యొకటి. సిద్ధాంతధోరణి రెండు. చరిత్రానుసారముగా వ్రాయువారు భాష యేయేకాలముల నేయేమార్పులు చెందినదియు వివరించి పరిణామప్రకారమారసి తమకాలమందలిస్థితి యిట్టిదని తెలుపుదురు. మఱియు గుణదోషములనఁబడునవి స్వతస్సిద్ధములై శాశ్వతత్వమును వహించినవి కావనియుఁ, గాలానుసరణములనియు నానాఁటి పాలీనాఁటి విషమగుటయు, నీనాఁటి పాలానాఁటి విషముగ నుండుటయు సంభవించుట ప్రకృత్యతీతముగాదనియు నిరూపింతురు. ఇంకను వ్యాకరణముతోడి జ్యోతిషమును బ్రకటింపఁదలఁచిన సాహసాత్ములు భావిపరిణామమట్లుండునేమోయని యనుమానించుటయుఁ గలదు.

కాలక్రమాగతములైన వికారములను నిర్వచించిన మాత్రమున బరిణామపద్ధతి సంపూర్ణము గానేరదు. ఆవికారములకు జనకములైన హేతువులను విశదీకరించుట దాని విధి. ఈహేతువులెన్నియో విధములు. కొన్నిమార్పులు స్వాభావికముగఁ గాలకల్పితములై యుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మఱికొన్ని పరభాషాసంపర్కముచే సంభవించును. ఒకజాతిజనులు వలసపోవుట, పరాక్రమమున నితరదేశములాక్రమించుట, వాణిజ్యాదులచే నితరరాష్ట్రములతో సంబంధముగలిగి యుండుట, విదేశీయులు దౌర్బల్యక్షయపీడితులమైన మనల వశముచేసికొని, వారిభాషలను నాగరకతను మనదేశమునఁ బ్రసరింపజేయుట—యిత్యాది హేతువు లెన్నియో యీసందర్భమున నూహ్యములు. శాస్త్రకారుఁడు నిష్పక్షపాతబుద్ధితో సర్వసమునట్లు వివేకమొక్కటి మాత్రము వినియోగించి యీకారణములను వీని ఫలములనుగూడ నారయవలయును.

హిందువులలోఁ జరిత్రాత్మకదృష్టి చాలవఱకుఁ దక్కువ. అధికారమే యాధారముగాఁగల యమోఘసిద్ధాంతములవిరచన వీరి మనస్సున కెత్తినచ్చిన మార్గము. ఈపార్శ్వదృష్టి యిట్లు ప్రబలి యుండుటకుఁ గారణము లేకపోలేదు. నిరంకుశప్రభువులు. నిరంకుశ గురువులు. వీరికాళ్లక్రింద జన్మాంతరములు పడియున్నవారికి హేతువాదము పరిణామపద్ధతులు నలవడుట దుర్ఘటము. ప్రభువులును, బూజారులును దమమాట వేదమని విధించి, విధేయత్వము సాధించి, తమమతములు వికారములని యేర్పడినచో గౌరవభంగమగునను భయముచేతఁ దమకల్పనలన్నియు నిర్వికారములు, సనాతములునని ప్రకటించుటయకాక, విద్యావ్యాపనమును నిర్మూలించినవారై స్వతంత్రయోజనలను మొలకెత్తనీయక, యొక్క జ్ఞాపకశక్తికిఁ దప్ప మఱి యేమనఃశక్తులకును వికాసము గలుగఁజేయక, దాదాపు వెయ్యేండ్లు మూయఁగట్టినందున విజ్ఞానము, ఉపజ్ఞ, నిరాఘాటపరిశోధనలు, మనయందు శోషించియున్నవి. సుమారు క్రీ. శ. 900 వ సంవత్సరము వఱకు దినదినప్రవర్ధమానమై నూతనములైన కొమ్మలు, చిగుళ్లు, పువ్వులు, పండ్లు వెలయించుచున్న హిందూమహావృక్ష మేసందర్భములచేత, నేహేతువులచేతఁ బెరిగెడుశక్తిని గోల్పోయినదో యది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యితిహాసమండలమునకుఁజేరిన విచారము. ఏది యెట్లున్నను నిపు డొకటిరెండు తరములుగఁ బునర్వికాసభాసురమై యది తలిర్చుచున్నది. మనలోని నూతనకవిత్వములు, విమర్శనలు, చరిత్రగ్రంథములు, భాషాపరిశోధనలు మొదలగునవి నా యీ యుత్సాహవాక్యమునకు దృష్టాంతములు.

మనజీవితము పునర్యౌవనముదాల్చి నవ్యకళాశోభితమగుచున్నదనుటకుఁ దార్కాణముగాఁ జూపఁదగిన యుద్గ్రంథములలో శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి "ఆంధ్రభాషానుశాసన" మొకటి. 'ఆంధ్రభాషానుశాసన పరిణామప్రకార' మని దీనికి ద్విజత్వసూచకద్వితీయనామకరణము చేయుదురేని గ్రంథముయొక్క స్వభావమింకను బరిస్ఫుటమగును. ఏలననఁగాఁ జారిత్రాత్మకదృష్టిమైఁ బరిణామపద్ధతినిబట్టి వ్రాయఁబడిన వ్యాకరణమియ్యది. ఈయాధునికాచారము రీతిని రచింపఁబడిన గ్రంథమింకెద్దియు నాకుఁ దెలిసినదిలేదు. ఒకవేళ నెందైన నుండెనేమో! గాంభీర్యమునందును, సర్వాంకషత్వమునందును దీనితో సమానముగానుండుట ప్రకృత మరిదియని తోఁచెడిని. ఈశ్లాఘన యతిశయోక్తిదోషభూయిష్ఠమై యున్నయెడల దానిని నా యవిచారణ కారోపింతురుగాని పక్షపాతమునకు వలదు.

పరిణామప్రకారము వ్రాయుట కాధారములైన సామగ్రులు ప్రతిదినమును సేకరింపఁబడుచున్నవి. 'బిషప్ కాల్డువెల్డు' ద్రావిడభాషల సమీపబాంధవ్యమును స్థాపించి మార్గదర్శకుఁడాయెను. 'ఫీలాలజీ' యనఁబడు భాషాతత్త్వశాస్త్రప్రకారము మరాటి, తెనుఁగు, అరవము, కన్నడము మొదలగుభాషలను బరిశీలించి వానియొక్క సాదృశ్యములను శేషగిరిశాస్త్రిగారు మొదలగు కొందఱు పండితులు వ్యక్తపఱచియున్నారు. మఱియుఁ బ్రాచీనశాసనపరీక్ష లీకాలమున గొప్ప సర్కారు శాఖగనేర్పడి నెఱవేర్పఁబడుచున్నవి. తెనుఁగు దేశములో

20

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కే. వి. లక్ష్మణరావుగారు, శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, ఇతిహాసకమండలివారు, ఆంధ్రసాహిత్యపరిషత్తువారును, ఇత్యాదిమహనీయులు శాసనముల ప్రతిబింబములను బ్రచురించి యాయాకాలముల యందు లిపిస్వరూపము లెట్లుండెను, ప్రయోగములు, అర్థములు, ఛందస్సు లెట్లుండెను, అను విషయములకు నిర్ధారణసూత్రము లేర్పఱుచుటలో విశేషించి కృషిచేసి శాస్త్రాభిమానుల మన్ననలకుఁ బాత్రులైరి. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన నన్నెచోడుని కుమారసంభవము భాషావిషయికవిచారములో నూతనయుగమును స్థాపించినదనవచ్చును. శ్రీ నడకుదుటి వీరరాజు ప్రభృతి పండితులు ప్రాచీనసంప్రదాయములను వితర్కించుచు నూతనాంశములను బ్రసిద్ధిపఱుచుచున్నారు. రాజరాజనరేంద్రుని పట్టాభిషేకసంచికలో నన్నయ్యభట్టుయొక్క ప్రయోగవిషయములు కనఁబడును. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో వీరరాజుగారి పరిశోధన నామమర్యాదకు నన్నెచోడుని గురిగాఁజేసి యనేకవ్యాసములు వ్రాసియున్నారు.

వ్యావహారికభాష లనుష్ఠేయమను వాదనకుఁ బ్రమాణముగా శ్రీ గిడుగు రామమూర్తిపంతులవారు ఆంధ్రవాఙ్మయమును విశేషవిచక్షణతతోఁ బరిశీలించి ప్రయోగసామగ్రిని బుష్కలముగా సేకరించియున్నారు. దానిని 'ప్రయోగచంద్రిక' యను పేరిటఁ బుస్తకముగాఁ బ్రచురింపవలయునని వారిని నేనొకానొకప్పుడు ప్రార్థించియుంటిని. అంగీకరించిరిగాని యేకారణముచేతనో యాకార్యమునింకను బ్రారంభించినట్లు గానము. భాషాపరిణామప్రకారమును విశదపఱచుటకు శ్రీ గిడుగు రామమూర్తిపంతులవారి వ్యాసములును, జర్చలును లక్షింపఁదగినవని తోఁచెడిని. ఈవిశాలప్రపంచమున శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారును స్వయంకృషిమైఁ బంటకుఁదెచ్చిన వస్తురాశి గుణమునందును, బరిణామమునందును నమేయమైయున్నది. ఎన్నియో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంవత్సరములుగఁ దదేకనిష్ఠతో నార్జించిన యర్థచయములను భాషా కైంకర్యార్థ మిందు మనభాగ్యమున సమర్పించి యున్నారు. ఇట్లు నానాఁటికి భాషాజ్ఞానము విస్తరించుటయగాక శాస్త్రవిధేయమైన వికారముగూడఁ దాల్చుచున్నది. ఈభాషాసామగ్రి యింతటితో ముగియదు. దినదినాభివృద్ధిని గాంచును. అందుచే నిఁక నెట్టినూతనానుమానములు స్థాపింపఁబడనున్నవో యెవరికెఱుక.

నేను విద్యార్థిగా నున్నకాలములో సంప్రదాయము నుపన్యసించు సిద్ధాంతవ్యాకరణములేకాని చరిత్రాత్మకవ్యాకరణములు మందునకైనలేవు. తుద కింగ్లీషుభాషలోనున్న విషయములైనఁ బరివర్తించి మాకెవరును జూపరైరి. శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు పెట్టినదే భిక్ష. నన్నయభట్టీయమును స్పృశించుటయుఁ గలదు. కాని, దేనిని జదివిన నొక్కటే; భక్తిరసముతో వేదపారాయణముచేసిన మాడ్కియే గాని యుక్తిరసము, స్వతంత్రవిమర్శనములేదు. "నిత్యము. వికల్పము. బహుళము. ఆర్యవ్యవహారంబులదృష్టంబులు. గ్రాహ్యంబులు." అని వర్గీకరణమున కేకారణముచేత నీ వివిధపరిణామములు సంభవించెనో దాని నారయవలయునన్న చిత్తవికారమైన మాకుఁ గలిగినదిగాదు. తుదకు భాషాప్రయోగములనైన నామూలాగ్రముగ నారసి సూత్రనిర్ధారణచేయుటయుఁ దలఁచు కానరాదు. వ్యాకరణమనిననే తలనొప్పి. కారణములుచెప్పి చూపి విశదీకరింపక మతమురీతిగా వల్లింపఁజేసిన యెడల శిరోవేదనగాక చిత్తవికాసమెట్లు గలుగును. కాలేజీక్లాసులలో సైతము వ్యాకరణమనిన గ్రుడ్డిపాఠమనిపేరు. తుదకుఁ దర్కశాస్త్రసంబంధిగానుండు కారకపరిచ్ఛేదమునైన హృదయాకర్షకముగాఁ జెప్పెడి యాచారములేదు.

కారణాతీతమైన సనాతనసిద్ధాంతముగా వ్యాకరణము వ్రాసిన వారిలో నన్నయ్యయు చిన్నయ్యయు నగ్రగణ్యులు. ఆవ్యాకరణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లును సప్రయోజనములు. వానియందు గౌరవభావముంచుట న్యాయమె. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి పద్ధతి నవీనము. స్వతంత్రము. వీరి యనుశాసనపరిణామప్రకారములోని నూతనాంశములెల్ల వివరింపఁ బూనినయెడలఁ బీఠికకుమాఱుగా గ్రంథము వ్రాయవలసి వచ్చును. ఈనాఁటివఱకుఁ బ్రోగైన సామగ్రులను వివేకముతో నుపయోగించి యున్నారు.

ప్రతిప్రకరణమునందును జారిత్రకదృష్టియు నసాధారణయోజనాశక్తియు విస్పష్టములు. ఇందు సుమారు 160 గ్రంథములలోని ప్రయోగములు క్రోడీకరింపఁబడియున్నవి. ఇం దన్నిప్రకరణములును జదువవలసిన వేయైనను బ్రథమభాగములోని యవ్యయసంధిప్రకరణములును, ద్వితీయభాగములోని యన్నిప్రకరణములును (అందును ముఖ్యముగా శబ్దకారకప్రకరణములు) ఈశాస్త్రిగారి యనన్యశాస్త్రసవిచారణవిన్యాసములకు మంచియుదాహరణములు. పండితులకును, విద్యార్థులకును, రసవంతముగా ద్రాక్షాపాకముగా వ్యాకరణమును నివేదించు గ్రంథమును రచించిన శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి నెంతప్రశంసించినను నత్యుక్తి తటస్థింపదు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧

# తొలకరి — తొలిపలుకు

ఈ గ్రంథమును రచించిన కవులు శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారును, కాటూరి వేంకటేశ్వరరావుగారును. "తొలకరి" యని భావగర్భితమైన శీర్షిక నిడియుండుటచేత వీరు వయసునఁ జిన్న వారనియు నియ్యదియ వీరి మొదటికృతి యనియు నూహించెదను. ఎట్లును నానాభావబంధురమైన హృదయము గలవారనుట స్పష్టము. రసార్ద్రహృదయులు నిత్యయావనులు గదా!

ఈపుస్తక మనేకకృతులచే రచింపఁబడిన సుకుమారపుష్ప మంజరి యన నొప్పుచున్నది. ప్రతికృతియొక్కయు రససౌరభము, ఆకృతివిలాసము, కాంతియొక్క వినోదము, అనన్యమును నసాధారణ మును నైయున్నవి. శైలుల తెఱంగులును వివిధములు. "రక్త తిలకము" ప్రాచీనధోరణిని దిద్దఁబడియున్నది. "సమశీలవయస్కులు" "నిడుదకనుల్ విశాలమయి" ఇత్యాదిపద్యములయొక్క రచనకును, "కోకిల" "జొన్నచేను" మొదలగు కృతులకును భేదమున్నది. ఈ భేదము భావము ననుసరించి యుండుటచేతఁ గళాకౌశలమునకుఁ బోషకముగా నున్నది. మొత్తముమీఁద నీకవులధోరణి యాధు నికము. యాధునిక మనుటకంటె నవీనమన్న నింకను సత్యము. ఆంధ్ర భాష యను మహావనము కొన్ని శతాబ్దములుగఁ బెరుగుటమానియుండి నూతన దేశీయజీవితమను ఋతువు వచ్చినందునఁ బ్రాంతప్రబంధములను పండిన యాకులను రాల్చి, పాశ్చాత్యసంపర్కమను కృషి మొదలగు కారణములచేతఁ దనకు నైజమైన పునర్వికాసము నూపుట కారం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భించి, క్రొత్త క్రొత్త చిగుళ్లను, బూవులను వెలిఁబెట్టుచు నవీన వసంతమును ధరించి యెంతయు మనోహరముగనున్నది. ఈ మహనీయసృష్టి ప్రభావమునకును బ్రకాశమునకును జేరినవారిలో నీకవులు ముఖ్యముగ గణనీయులు.

ఈకృతు లనేకములు భావగీతములని యిప్పుడు ప్రచారమునకు వచ్చిన క్రొత్తకవితా ప్రపంచమునకుఁ జేరినవి. ప్రకృతివర్ణనలు కడుఁ జక్కఁగను సూక్ష్మదృష్టితోను, జేయఁబడియున్నవి. అంతియకాక, ప్రకృతిస్వరూపములు వికారములు మొదలగు వానికిని, మనుజుల యొక్క — యందును నకృత్రిమస్వభావులయొక్క — చిత్తసంచారములకును గల సంయోగమును గవులు మఱచియుండలేదు. గుణమున నింతకంటె శ్రేష్ఠమైన కృతులు మన భాషలోఁ బెక్కులులేవు.

ఈకవిత్వము ముఖ్యముగ సరసుల నాకర్షించునదిగా నున్నదని నాయభిప్రాయము. గడుసు బాఱిన నాలుకల కియ్యది యట్టె రుచింపదు కాఁబోలు. కవిత్వముయొక్క చెప్పరాని, చూపరాని, పట్టరాని, యంటరాని సొగసుఁదన మెంతయభిరామముగా వర్ణించియున్నారో చూడుఁడు.

“ సీ. చూతురా ? దీనిని జూతపల్లవఖాది
 ని పికాంగనాగాననిస్వనంబు,
కొందురా ? దీనిని క్రొమ్మెఱుంగులజిల్గు
 పనికిఁ గాఁదగిన కుందనపుఁదళ్కు
కావలెనా ? యిద్ది, కలువపూరేకు పొ
 త్తములఁ జిప్పిలెడు మెత్తందనమ్ము,
వలయునా ? మలయపర్వత సానువులనుండి
 దిగుమతియగు కమ్మతెమ్మెరలివి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. తీయుదుర ? దీని వెన్నెల తేటనిగ్గు
ఒఱియుదుర ? దీనిఁ బచ్చకప్పురపుఁదావి
కోరికొందుర ? దీనిఁ బటీర జలము
త్రావిచూతుర ? తీయని పూవుఁదేనె. ”

ఇఁకఁ బ్రకృతితో లీనమై యా సాయుజ్యసుఖముచేతఁ బరవశులై మాటలాడినారో యను నట్లుండెడు నీక్రింది వాక్యము లాకర్ణింపుఁడు.

గీ. నీడలారెడు నీ చెట్లతోడ దొంగ
బూచి దోబూచియాడుచుఁ బ్రొద్దుగడపు
చందమామను బట్ట నెంచవుగదన్న ?
ఎచట కేగును జాబిల్లి ? యింట నీదు
చిన్ని చెల్లెలు నీవులేకున్న బువ్వ
తిననసుచుఁ బోరుపెట్టుచుండెనుగదోయి ?
పలుగు పలుగునఁ జనుము, నిన్నరయువారి
కంటె ముందుగఁ జెల్లితో నింటిముందు
నారుబయటను గంచమ్మునందుఁ దొంగి
చూచు జాబిల్లితోడ దోబూచియాడు
కొనుచు బాలును నన్నమ్ము తినెదుగాని. ”

“ జొన్నచేను ” అనిర్వాచ్యమైన మాధుర్యముగలయది. దాని యందలి యీ భాగమును దిలకింపుఁడు.

“ గీ. సెనగపూరైక తొడిగిన చిన్నదాన !
చిలుకయొక్కటి వ్రాలె నామలుపునందు
నెంతతోలిన పోవదేనేమి నేతు ?
మెఱపలీయేడు మీకుసమృద్ధి, వంగ
చెట్లు లిప్పుడిప్పుడె పూతపట్టుచుండె

21

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బంతిపూవులు ముగ్గులపండువునకు
నక్కరకుపచ్చు, నిమ్మ్యెడనొక్క మిఱప
పండుపండెను—గోయకవదల దీనిఁ.
దోలుచుంటిని నేఁ బిట్టవ్రాలకుండఁ
గోసికొనుమింక గుప్పెడు—దోసతీవ
లున్న వాదరిగాఁ ; గాయలున్న వేమొ
చూడుమీ—నాల్గుకఱ్ఱల నూడబెఱికి
కంకులను గొట్టుచుందు, నాకంచె కేగి
చిదుకులందెమ్ము వీనిఁ గాల్చెదవుగాని.
పచ్చజొన్నలు తీయని పాలుగారు
లేతగింజలు తినుము కాలిచిన నింత
తీపియుండదు—తట్టనెత్తెదవదేల ?
నూగుపోవ నూడెడిదన్క నాగలేవె ? "

ప్రాచీనశైలికిని—అనఁగా ప్రాచీనవిషయవర్ణనల కనుగుణమైన శైలికిని—ఆధునిక శైలికిని—అనఁగా నవ్యభావములవర్ణనల కనుగుణమైన శైలికిని—గలతారతమ్యముల నెవరైన విమర్శకు లొకరు పరికించి వివరించిన బాగుండును. వాడఁబడు పదములు వేఱు. అవి కూర్పఁబడు విధములు వేఱు. పూర్వులాశ్రయించిన పద్యములు ముఖ్యముగా వృత్తములు, కందములు. ఇప్పటి నవకవులకు విశేషముగా యోగ్యములయినవి గీతములు, ద్విపదలు. పూర్వకాలపు స్వతంత్రాంధ్ర గ్రంథకర్తలు విశేషించి 'తరువోజ' 'అక్కర' మొదలగు పద్యరీతులను వాడియున్నారు. సీసముగూడ మనయదియేయని చెప్పవచ్చును. ఇప్పటివారు కొంద అపూర్వచ్ఛందస్సులను గ్రహించియున్నారు. ఇట్టి మార్పులింకను నెన్నియో సంభవించినవి. వాని నామూలాగ్రముగా విశదీకరించుటకు నాకుఁ గాలముచాలదు. శక్తి యంతకుమున్నె లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయిన నొక్కమాట. ఈ పరిణామము సహజమనియు ననివార్య మనియుఁ దోఁచుచున్నది. పూర్వుల భావముల రీతులు, వారిమార్గ ములు వేఱు. ఇప్పటివారి భావప్రచారము వేఱు. మనకు రంగస్థలము విశాలముగా నుండవలయును. మనభావస్రవంతి యనేకోపనదుల కూడికచేఁ గల్లోలమను నెడ తెగని ప్రవాహముగలదిగా నుండుటచే సంక్షేపవిక్షేపములకు సులభసాధ్యములైన గీతములు, ద్విపదలు, అను కూలించినట్లు వృత్తము లనుకూలింపవు. మఱియు వృత్తములు సంస్కృతమునుండి పుట్టినవి. అవి తద్భవములునుగావు, తత్సమములు. ఆంధ్రులయాత్మకు నవి తగిన శరీరములు కానేరవు. కావున మనము స్వాతంత్ర్యముగాఁ గృతులు రచింపఁబూనిన యీవర్తమాన కాలమున ద్రావిడలోకసంజనితములైన ఛందోభంగులు పునఃస్థాపితములు కావచ్చు టలోఁ జోద్యమేమి! మంజరీద్విపదయందుఁ బాడఁబడిన పల్నాటి వీర చరిత్రమునకంటె, వేమన్న యాటవెలఁదులకంటె మించినకవిత్వము నూహింపసాధ్యమా? కాదని నావిన్నపము. అట్లగుట మనలో స్వచ్ఛందముగా మొలచి పెరిగిన వృక్షముల నీడలలో మనమానసి కాయాసమును మనము దీర్పఁజూచుకొనుట సహజముకదా!

ఇదివఱలో మనకవితాది కళలు పరతంత్రములుగా నుండినవి. ఇప్పుడు మనతోపాటు వానికిని స్వాతంత్ర్యము వచ్చినది. కావున సంస్కృతముయొక్క దాస్యమునుండి విముక్తినొందుచున్నారమని నానమ్మకము. ఆర్యుల మతములు, వారి వర్ణధర్మములు, సంఘనీతులు, మొదలగునవియన్నియు స్వతంత్రపరీక్షకుఁ బాత్రములు. వర్జనీయము లైనను గావచ్చును.

అయిన నొక జాగ్రత్త. ఆర్యదాస్యమువదలి యాంగ్లేయదాస్య ములోఁబడుట యేమాత్రమును మంచిదిగాదు. ఎట్టి పారతంత్ర్యమును స్వాతంత్ర్యమునకు నీడుగాదు. స్వాతంత్ర్యమనఁగాఁ బరులతో సంబం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధము లేకయుండుటగాదు. మఱి మనబుద్ధిని బ్రయోగించి యన్ని కాలములందలి, యన్నిదేశములందలి గుణములను సాధ్యమైనంత వఱకు గ్రహించి మనలో జీర్ణముచేసికొని దినదినప్రవర్ధమానులమై యుండుట. ఎండి బిఱ్ఱబిగిసికొని గాలినిబీల్చలేక నీళ్లనుద్రావలేక పడి యుండు వంటకట్టె స్వాతంత్ర్యమునకు నిదర్శనముకాదు. తుదకు సజీవత్వమునకును గాదు. దానిగతి క్రమముగఁ గాల్పఁబడుటయు. నే నాదేశించునది స్వాతంత్ర్యము. కేవలత్వముగాదు.

ఈ కవులు నిక్కముగా స్వతంత్రులు. ఆర్యాంగ్లేయాది వాఙ్మయముల సారములఁబీల్చి తమయందు లీనమగునట్లుచేసి దానిచేఁ గలిగిన పుష్టిచేఁ బుష్కలముగా వ్రాయువారు. వీరి కవిత్వమున నిక్కంపు మంచినీలములున్నవి. తళుకుబెళుకు రాళ్లులేవు. అయినను రత్నపరీక్షయందు సమర్థులగువారికిఁగాని సామాన్యులకు వానిగుణము నెఱుంగనలవికాదు.

"సుకవి భోగ్యమ్ములిచటి వస్తువులు, వీని
నలిపివేయకుఁ డటునిటు కలఁచివైచి."

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨

# శాలివాహన గాథాసప్తశతీసారము

## ప్రస్తావన

ఈ గ్రంథమును రచించిన శ్రీ అనంత కృష్ణశర్మగారిని గూర్చి ప్రశంసింపఁబూనుట యధికప్రసంగము. వీరు ఆంధ్రసాహిత్యలోకమున సుప్రసిద్ధులు. సంస్కృతవిద్యాపారీణులు. సంగీతకళాకోవిదులు. ఒక పాండిత్యమేకాక రసికత్వమును సంపూర్ణముగ వహించిన ధన్యులు. ముఖ్యముగా నాకెంతయు మిత్రులు. వీరు మొట్టమొదట నాతోఁ బరిచయము చేసినది సుమారిరువది యేండ్లక్రిందట. అప్పుడు వయసునఁ జిన్నవారయ్యుఁ బాండిత్యమునఁ బ్రగల్భులై యుండిరి. కొంతవఱకుఁ బాండిత్యపరాయణులును. అయినను వారి సహజ సౌమనస్యమును, బహుశః, ఒకించుక నాయొక్క దోహదమును జేరి సరససాహిత్యమునకుఁ బ్రేరేపించినవి. అప్పటినుండియు వీరు రచించిన గ్రంథములన్నియు నానందవాహినీతరంగములు. "మీరాబాయి" యు "తార" యు నిందునకు నిదర్శనములు. భావనాశక్తియందే కాదు, విమర్శనక్రియయందును వీ రసాధారణప్రజ్ఞ కలవారు. వీరు రచించిన ఎఱ్ఱన్న నాచనసోమన్నల తారతమ్యనిరూపణ మమోఘమైన వ్యాసము. వేమన్నపై వీరు వ్రాసిన గ్రంథమిప్పటి వచనగ్రంథములలో నగ్రగణ్యము. ఇది గ్రంథమనుటకంటె కావ్యమనుట యింకనునిజము. అట్టి వారీగాథాసప్తశతీసారము నాంధ్రీకరించుట వారియొక్క రసజ్ఞతకును మన భాషకును గురుత్వమాపాదించు కార్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏ పరిస్థితులయందు గ్రంథములు రచింపఁబడినవో యవి కొంతకుఁగొంత మనకుఁ దెలిసిననేకాని వాని స్వారస్యమును సంపూర్ణ ముగ గ్రహింపఁజాలము. నాకీగ్రంథవిషయ మైన చరిత్రజ్ఞానము సర్వ శూన్యము గావున దానిఁగూర్చిన ప్రశ్నలనువేసి శ్రీ శర్మగారినే బదులుచెప్పుమంటిని. తమ శోధనలచేఁ దేలిన విషయములను సమగ్ర ముగ వారు నాకు నివేదించిరి. ఆ లేఖనే యిందుదాహరించు చున్నాను :—

"......ఈ గ్రంథము ప్రాకృతభాషలో ఆర్యావృత్తములలో వ్రాయఁబడినది. ఏడువందల పద్యములుగలిగి ఏడు శతకములుగా విభజింపఁబడినది. ఒక్కొక పద్యమును స్వతంత్రమై పరస్పరసంబంధము లేనిదనుట స్పష్టమే. ఇట్టివానికి 'గాథలు' అని వ్యవహారము..... దీనిని సంగ్రహించినవాఁడు శాల, హాల, సాతవాహన, శాలివాహన, సాలాహణ, ఇత్యాదినామములుగల ఆంధ్రరాజు. ఇతఁడు శకారాతి యగు విక్రమాదిత్యుని సమకాలికుఁడైన కుమ్మరిదొర యనియు, ఇరువురికిని జరిగిన యుద్ధములో విక్రమార్కుని జంపి చక్రవర్తియై రాజ్యమేలెననియు వాడుకకథ ప్రసిద్ధమే. విక్రమార్కునికిఁ బ్రతిగా నితనిపేర నొక శకమేర్పడి దక్షిణదేశమం దింకను బ్రచారమునందున్నది గదా. క్రీస్తుపూర్వము మొదటిశతకము నడుమ విక్రమశకమును, క్రీస్తుతరువాత మొదటిశతకము తుదిని శాలివాహనశకమును బ్రారంభ మగుచున్నవి. క్రీ॥ శ॥ ఎనిమిదవశతకపు బాణభట్టు ఇతనిని పేర్కొని యున్నాఁడు. అతనికంటెఁ బ్రాచీనమైన వాత్స్యాయన కామసూత్ర మున నితనిపే రుల్లేఖింపఁ బడియున్నది. చరిత్రశోధకులితనిని ౧, ౨, 3, శతాబ్దములకు వేఱువేఱుగా వేయుచున్నారు. అనేకులితనిని మొదటి శతకము వాఁడనియే నమ్ముచున్నారు".

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"దీనికి సంస్కృతప్రాకృతములందుఁ బ్రసిద్ధమైనపేరు 'గాథా సప్తశతి'. కాని 'శాలివాహనసప్తశతి' యనియు వాడుకగలదు. "నూనూఁగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్తశతి నొడివితి" నని శ్రీనాథుఁడు వ్రాసెను. అతని యాంధ్రీకరణము మన దౌర్భాగ్యముచే—లేక నాభాగ్యముచే—నశించినది. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు తమయొద్ద ఆగ్రంథమున్నట్లు సూచించినారు... ఇదిగాక శాలివాహనుని విజయములను దెలుపు 'లీలావతి' యను ప్రాకృత కావ్యము లభించినదనియుఁ బ్రకటించుచున్నామనియు వారు బహిరంగపఱచినారు. కీ. శే. నంగూరి సుబ్బారావుగారు తమ శతక కవుల చరిత్ర యుపోద్ఘాతములో ఎక్కడనుండి సంపాదించిరో కాని—శ్రీనాథుని శాలివాహన సప్తశతిలోనిదని యీక్రిందిపద్యము నుదాహరించినారు.

'ఉ. వారణసేయఁ దావగొనవా, నవవారిజమందుఁ దేఁటి క్రొ
వ్వారుచునుంట నీవెఱుఁగవా, ప్రియవా తెఱఁ గంటిఁ గంటికె
వ్వారికిఁ గెంపురాదె, తగవా మగవారలదూఱ, నీవిభుం
డారసి నీనిజం బెఱుఁగు నంతకు నంతకు నోర్వు నెచ్చెలీ!'

కాని యిప్పటి సప్తశతి ప్రతిలో దీనికి మూలమైన ప్రాకృత గాథ కానరాదు. ఇప్పుడచ్చైన ప్రతికిని నందందు లభించు వ్రాత ప్రతులకును పద్యముల సప్తశతసంఖ్య యొక్కటైనను తారుమారులు చాల కలవని తెలియవచ్చుచున్నది. ప్రతులలోని పద్యములన్నియుఁ జేర్చిన సుమారు రెండువేల పద్యములగునఁట! ఒక పండితుఁడు దీనిని నూతనముగా సంస్కరించి ప్రకటింపఁ బ్రయత్నించుచున్నాఁడని వినికి."

"సర్వజ్ఞ చక్రవర్తి, వీరనారాయణుఁడు—ఇత్యాది బిరుదులు గల కొండవీటి పెదకోమటి వేమభూపాలుఁడు—శ్రీనాథకవి కాశ్రయ దాత—ఈసప్తశతిలోనుండి సారమైన నూఱుపద్యముల నేఱుకొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్కృతమున వ్యాఖ్యానము చేసినాఁడఁట. 'కోట్లకొలఁది గాథల నుండి హాలుఁడు ఏడువందలు సంగ్రహింపఁగా నేనిప్పు డందును సార భూతమైన నూఱింటినేర్చి టీకను వ్రాసితి' నని యతఁడు చెప్పుకొన్నాఁడఁట. (ఆంధ్రపత్రిక, శుక్లసంవత్సరాది సంచిక, పుట ౧౬౩ లో శ్రీ అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు.)"

"ఇప్పుడు ప్రకటింపఁబడిన గ్రంథమందలి యేడువందల పద్యములపైకి సుమారు నాలుగువందల పద్యములకుఁ గర్తలపేళ్లు వ్యాఖ్యానమం దుదాహరింపఁబడినవి. తక్కినవి తెలియలేదు. ఒక్కొక్కఁడు వ్రాసినవి పెక్కుపద్యములు గలవు. తక్కినవారిలో నెందఱు సమకాలికులో నెందఱు ప్రాచీనులో దెలియుమార్గములు లేవు. ప్రవరసేనుఁడనువాని పేర కొన్నిగాథలు ఈ నా సంగ్రహమునందుఁ జూడవచ్చును. ప్రవరసేనుఁ డనువాఁడు ప్రాకృతభాషయందే కందములలో వ్రాసిన 'సేతుబంధము' అను ప్రసిద్ధ ప్రాచీనకావ్య మొకటి కలదు. ఇతఁడతఁడే కావచ్చును. సేతు బంధకర్త కాలమును మనకు స్పష్టముగాఁ దెలియదు. కాని క్రీ॥ శ॥ 7 వ శతకమునకంటెఁ బ్రాచీనుఁడని, నికరముగాఁ దెలియును. ఇదిగాక హాలమహారాజుయొక్క యాస్థానపండితుఁడగు శ్రీపాలితుఁడు, అతనిచేఁ జాలపూజలు గొన్నాఁడని వేఱొకచోఁ జెప్పఁబడినది. ప్రకృత గాథాసంగ్రహములోఁ బాలితకవి పేరఁ గొన్ని గాథలున్నవి. 'బృహత్కథ' యను పైశాచభాషాగ్రంథమును రచించిన గుణాఢ్యపండితుఁడు సాతవాహనుని యాస్థానమందుండెనని కథాసరిత్సాగరమునఁ దెలియవచ్చును. ఈ గాథాకవులలో రోహా, రేవా, మాధవీ, అణులచ్ఛీ అనులద్ధీ, పహాయి, ససిప్పహా, నాతా అను ఎనమండ్రు స్త్రీలు గలరనుట యాకాలపు స్త్రీలగౌరవమును పురుషుల యౌదార్యమును సూచించు విషయము."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఇందలి పద్యములలో ననేకములు ప్రస్తావవశముగాఁ జెప్పఁబడిన చాటుపద్యములే యనవలసియున్నది. ఆకాలపుఁ బ్రాకృత వాఙ్మయమంతయు ముక్కాలు మువ్వీసము నష్టమైయుండుటచే నిందలి కొన్ని పద్యము లేగ్రంథములనుండియైనను ఎత్తి కూర్పఁబడినవాయను విషయము నిర్ధరింప వీలులేదు.

"ఇప్పుడు నేను ప్రకటించు పద్యములన్నియు ఆంధ్రీకరణములే కాని నా సొంతపురచన యొక్కటియును లేదు. నేను చేసినదంతయు ఆ యేడుః నూర్లలో నాయభిరుచికి నచ్చినవాని నేఱుకొనుట, మూల భావమును జెడనీయక తెలుఁగులోఁ బెట్టఁ బ్రయత్నించుట—ఇంతే..."

ప్రాకృతభాషలో పుంఖానుపుంఖములుగ గొప్ప కావ్యములును శాస్త్రములు నుండెననుట నిర్వివాదము. ఆభాషచేసిన దురదృష్టము, అది బౌద్ధమతమున కాలవాలముగా నుండుట. ఆపాపపరిహారార్థము వైదికమతపునరుద్ధారకులు దానిని ద్రవ్వి యందున్న పుస్తకముల మంటఁగలిపిరి. కొన్నిమాత్ర మీ మారణతంత్రమునుండి తప్పించుకొన్నవి. మఱికొన్నింటి స్వరూపము చీనా, టిబెత్తు (త్రైవిష్టప) భాషలలో లీనమైయున్నందువలన నిర్మూలము కాలేదు. భాగ్యవశమున నీగాథలును మనపాలికి నిలిచినవి.

ప్రాకృతములు జనసామాన్యములో వ్యవహరింపఁబడుచున్న భాషలు. ఇప్పటి దేశభాషలంబోలినవి. వ్యావహారిక భాషయందు వ్రాయఁబడిన వేమన్న పద్యములఁ బోలిన గ్రంథములెట్లు సామాన్య ప్రజల జీవితముఁ బ్రదర్శించునో యట్లే ప్రాకృతకావ్యములును బ్రదర్శించుచుండెనేమో. సిద్ధాంతముగఁ జెప్పలేము. కథాసరిత్సాగరము నందు మన పురాణకథలు లేవు. రామాయణభారతవీరుల ప్రస్తావనయు నించుమించు సున్న. ఇంద్రాది దేవతలు నట్టేకానరారు. మొత్తముమీఁద దేశీయులదైనందిన జీవితమే యందుఁ బ్రతిఫలితము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఊహించి యూహించి యెంత విపరీతాతిశయోక్తులకుఁ బోయినను బ్రపంచజీవితవాసనను వదలినదికాదు. ఇది యీ విషయమున నొక్క శతాబ్దమునకుఁ బూర్వము పాశ్చాత్యులలోఁ బ్రబలియుండిన 'రోమాన్సు' (Romances) లను బోలినది.

ఈ గాథాసప్తశతిలోని యనన్యసాధారణమైన విశేషమే మనఁగా నట్టి విపరీతపు టూహలును వర్ణనములుఁగూడ నిందు లేవు. విషయములు సహజములు. జీవితమునకు యథార్థములు. ఆజీవితము సైత మెట్టిది? ఇందు నాగరక వాసనలేదు. మన ప్రబంధములలోని నాగరకవాసన పట్టణములలోని మురికికాలువల దుర్గంధము. 'వప్రస్థలీ చుంబితాంబరము' లైన పట్టణములు; అందు దినదినమును—అనఁగా అమావాస్యనాఁడుతప్ప—చంద్రునిలోనుండు కాటుకనుదీసి కండ్లకు రాచుకొను కన్యామణులు; కామావేశముతో స్త్రీల యంగపరిశీల నమే ప్రధానకార్యమైయుండు రాజులు; మోహాతిరేకముచే నుద్యాన వనములోఁబడి పొర్లుచుండెడు నారీరత్నములు; వారి పచ్చితలంపులు, అంతకంటె పచ్చివియైన మాటలు—ఇత్యాది రోఁతలీగ్రంథమున లేవు. మఱి యిందలిది పల్లెటూరివారి జీవితము. పొలముల ప్రక్కన గుడిసెలలోనుండు బీదసాదల మనోహరమైన ప్రేమచర్యలు, గుట్టుదాచి నర్మగర్భముగాఁ బలుకు తీపిమాటలు, చిఱునవ్వుతోఁజేయు హాస్యములు మొదలైనవి యిందుఁగలవు. గుడిసెలు, వాననీళ్లు కాఱుచుండు కప్పులు, పిండిదంచుట, పొలములలోఁ గృషిచేయుట, యిత్యాదులు—ఈరంగములోని ముఖ్యాంశములు. మనసును నీరుగాఁజేయు లీలలనిన నిందుండునట్టివ. శాంతముగానుండు ప్రేమసాగరమునందలి లేఁదరఁగలలోఁ బున్నమచంద్రుని కిరణములుసోఁకఁ బ్రతిఫలించిన కాంతుల కెనయైనవి దీనియందలి భావములు. ఇందలి భావములు, మాటలు, ఉపమలు మొదలగునవి స్వచ్ఛందముగ నుప్పతిల్లినవి. దూరవుటూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాల సహాయముచే బలాత్కారముగఁ బొందింపఁబడినవి యొకటి రెంటికంటె నెక్కువగాలేవు. పద్యములన్నియు భావాంబరమునఁ బ్రకాశించు చుక్కలు. మందహాసమునఁ గన్నులతో సైఁగచేసి మన భావములను వశపఱచుకొని పైకి నాకర్షించునవి. కన్నును మనసును వశపఱచుకొను నాకృతులన్న నిందలి స్త్రీలే. స్త్రీ ప్రకృతికి వన్నెను గౌరవమును గల్పించువారు వీరు. ఆడంబరములు లేనివారు. చీని చీనాంబరములు రత్నాలనగలు కలనైనఁ జూచియెఱుఁగరు. సహజ సౌందర్యోపేతలు. సహజవిలాసభాసితలు. స్వచ్ఛందానురాగమను రంగమున వెల్లివిరిసిన భావములనుబట్టి యాటలాడు బాలికలవంటి వారు. మఱుఁగు, మానము, సుకుమారత్వము, ఉన్నవిగాని మనసునకు విపరీతముగ వర్తింపరు. వారి మనసులు మంచివిగాన వారి చర్యలును సహజముగను మనోహరముగను నుండును.

'పువువిల్తు శాస్త్రమర్మము' లిందు వివరింపఁబడినట్లు ఏ గ్రంథ మందును లేవు. 'శాస్త్రమర్మము' లనుటకంటె 'కళామర్మము' లని యుండినచో నింకను బాగుండెడిది. ఏలన శాస్త్రము జ్ఞానప్రపంచము నకుఁ జెందినది. కళ యనుష్ఠానమునకు; అనుభవమునకు శాస్త్రము. శాస్త్రముదెలిసినవాఁడు కళయందసమర్థుఁడుగా నుండవచ్చును. కళ యందు సమర్థులైనవారు దానికి మూలాధారమైన శాస్త్రము నెఱుఁ గనివారు గావచ్చును.

ఈగ్రంథములోని నాయికలు భాగవత దశమస్కంధములోని గోపికలట్లు ముగ్ధలు. కృత్రిమమనునది యెఱుఁగనివారు. వీరనుభవించు సుఖములు, ఆనందములును దినదినజీవితమను పాలనుండి తీయఁబడిన వెన్న. చూడుఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శృంగారము :—

" ఆ. అడుగుఁ దమ్ములందుఁ బడివేడు పతిపేఁపు
చిన్నికొమరుఁడెక్కి చెలఁగియాడ,
అలుకయెంత తెగని దయ్యాను నిల్లాలి
మోమునందు నవ్వు మొలచెనపుడు." (ప. ౫)

" ఆ. వంటయింటి పనుల నంటిన మసిచేయి
సోఁకియుండఁ జంద్రసుందరముగ
నింపుగొల్పుచున్న యిల్లాలి మోమును
భర్త నవ్వుచున్నవాఁడు చూచి." (౭)

ఇంక నతిశయోక్తులును ఉత్ప్రేక్షలును నన్న నిట్టివిగదా నిక్కములు!

" తే. పూనియూఁదెదు నెఱజాణ! ప్రొయ్యిమీఁద
నలుకగొనఁబోకు; రక్తపాటల సుగంధ
మైన నీయూర్పుఁ జవులకు నాసగొనుచు
పొగలెగయుఁగాని మండదీ ప్రొయ్యినగ్గి." (౮)

పల్లెటూరి జీవితమును బ్రదర్శించు పద్యములలో నొకటి రెండు మచ్చుకు :—

" ఆ. దొరకకుండ నేఁడు దొరకిన చెంగావి
చీరఁగట్టి కాఁపువారి కోడ
లదిగో! చిన్నదయ్యా నడగక తిరిగెడు
విరివియైనయూరి వీధులందు.!" (౧౬౨)

" క. కనుపాపల నరమూయుచుఁ
గొనగన్నులఁ జూచుచుండు కోడలి తెఱఁగున్
గని యజమానుఁడు వలద
న్నను దెరువరి మందిరాంగణముననె విడిసెన్" (౧౭౧)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రకృతి వర్ణనము :—

“క. కలఁగవు కమలంబులు ; హం
సలుగదలవు ; చూడవమ్మ చక్కఁగనెవరో
తలక్రిందుగ నాకాశము
నిలిపినవారత్త ! చెఱువు నీళులలోనన్.” (౬౯)

నర్మ వచనములు :—

“ఆ. కనులు గానరాని కటికి చీఁకటి రేయి ;
వలనపోయెమగఁడు ; వట్టియిల్లు ;
దొంగలెవ్వరైన దోతురు సుమ్ము ; ని
ద్రింపవలదు ప్రక్కయింటివాఁడ !” (౨౧౮)

భావము నకస్మాత్తుగాఁ ద్రిప్పుట :—

“తే. కలికి ! సాజంబుగా నిండుఁగనుల, వానిఁ
జూచెదవుగాని క్రీఁగంటఁ జూడకమ్మ ;
అతనిఁ జక్కఁగఁ జూచిన యట్టులగును ;
నీవు నొక ముగ్ధవనుచు మన్నింత్రు జనులు.” (౧౫౩)

అపురూపమైన యనన్వయాలంకారము :—

“ఆ. చక్కఁదనము గలుగు చానలు జగములో
నెందఱున్ననేమి ? యింత వినుము—
ఒడలిచెలువునందు నెడమనగంబుతోఁ
గుడిసగంబె సాటి గూడుఁ జెలికి.” (౧౯౨)

ఉపమతో శ్లేషించినట్లుండుట దీనియందలి యనన్య సాధారణ మైన గుణము.

ఒక్క శృంగారమే కాదు, ఈ గ్రంథమందు దొరకురసము. భర్తృహరి, వేమన మొదలగువారికి మార్గదర్శకములో యను నట్లుండు పద్యము లనేకములుగలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఆ. కలహములనుగూడ వెలికిరావాత్మలో
సమసిపోవు, సాధుజనులు విన్న
మఱుఁగుమాట, లొక్కమాఱుగ నాయువు
గడచినప్పు డగ్గిఁగాలుఁ గాని." (౨౦౮)

కాఁపువారికి వసంతమునకంటె వానకాలమెక్కువ హృద్యము. వర్షర్తువును గూర్చిన యీపద్యముఁ దిలకింపుడు—

"ఆ. చూడు వింధ్యశిఖరిసొబగు! వర్షర్తుల
క్ష్మీపయోధరములు మేనుసోఁక,
అన్నికడల మొలచుచున్న లేఁబచ్చిక
గుంపు పేరఁ బులకరింపఁ దొడఁగె." (33౨)

ఇట్టి దృష్టాంతరములెన్నియైన జూపవచ్చును.

రసబంధురములైన యీపద్యములనన్నిటిని బీఠికలోఁ బ్రదర్శింపంజూచినయెడల వేఱుగా గ్రంథమునే ముద్రింపవలసి చర్వితచర్వణమగును. భారతము "ప్రతిపర్వరసాస్పద" మందురు. ఇది ప్రతిపద్యరసాస్పదము. విరహము నెందఱో వర్ణించియున్నారు. ఈపద్యమెంత దుఃఖజనకమో యెంతసహజమో చూడుఁడు—

"ఆ. ప్రీతిపాత్రమైన పెండ్లాము సచ్చిన
యింటి పాడుసూచి యేడ్వలేక,
చనఁడు పొలమువిడిచి పనిలేకయున్నను
పామరుండు కాఁపువాఁడు కంటె!" (౧౧౦)

ఇఁకఁ బ్రతిదినజీవితతంత్రమున కీపద్యమెంత మంచిసూత్రమో యరయుఁడు:—

"ఆ. సుగుణవంతురాలు, సుందరి, నిజమది;
నేను బనికిరానిదాన నిజము;

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని యొక్కమాట ; దాని బోలఁగలేని
వారలెల్లఁ జావవలయునే మి ? ”
(౨౯౭)

దొరకినది గంభీరముగా ననుభవింపుము. ఊరకకొనరనేల ?

మనవారిలో నాశుకవిత్వమున్నదిగాని మొత్తముమీఁద నాపద్యములలోఁ జమత్కారము, పాండిత్యము, ప్రకటనకు వచ్చినంతఘనముగా రసము రాలేదు. ఈసప్తశతిని జదువునప్పుడు నేను జిన్ననాఁడు విన్న యీపద్యము స్మరణకు వచ్చినది.

“ జొన్న చేనిలోన సొగసుకత్తెను జూచి
నిన్నటాళనుండి నిద్ర రాదు ;
దాన్ని నన్ను గూర్చి దయసూపు మాధవా
పొన్నపూలుదెచ్చి పూజసేతు. ”

ఒక్క పద్యములోననే హృదయ ప్రపంచమున భూకంపము పుట్టునట్లు చేయువారలలో జపాను దేశీయులు ప్రథములు. ఇట్టి కవితా రచన వారిలోఁ బారంపర్యముగ వచ్చిన సనాతనకళ. ఒకానొక స్త్రీ తనకొడుకు చావునకు విలపించిన విధము వినుఁడు :—

“ తే. తుమ్మెదలఁబట్టుచు మఱచి తొలఁగి యెటకుఁ
బోయినాఁ డొకో నేఁడు నాముద్దుకొడుకు ! ”

జపానులో బాలుర క్రీడలలోఁ దుమ్మెదలను బట్టుటయొకటి. చిన్నబిడ్డలు నిద్రపోయినట్లు శాంతముగ మరణింతురు. ఈబిడ్డయు నేతొందఱయు నీయక ఆటకుంబలె వెళ్లినాఁడా ? ఆఁకలి ప్రొద్దెఱుఁగని వారు బిడ్డలు. కావున నింటికి వేళకురాకపోయెనా ? దారితప్పెనా ? మఱియు మృత్యువు కట్టకడపటి స్థితియని ప్రేమ యంగీకరింపదు. సావిత్రి యట్లు చేయలేదు. ఎవ్వరును జేయరు. పునస్సమాగమము సిద్ధించునను దృఢమైన యాశయుండును. తుమ్మెదలఁబట్టుచుఁ బోయిన కొడుకు మఱలవచ్చును. తల్లిని దలఁచుకొని రాకుండునా ? ఎప్పుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చునోయని తల్లి హృదయము వేఁగుచున్నది. ఎప్పుడైన నొకప్పుడు వచ్చుననుట సత్యము. ప్రేమ యమృతము. సముద్రమునకంటె లోఁతైనది యీపద్యము. అనఁగా హృదయమెంతలోఁతో యంత లోఁతు. ధ్వనియను గుణమున్నదని మన సంప్రదాయము ప్రకారము చెప్పవచ్చును; హృదయమునందలి ప్రత్యాక్రోశముయొక్కయు ప్రతిధ్వనిగూడ! అరబ్బులును ఇట్టి కవిత్వమునఁ బ్రవీణులు.

ఒక్కపద్యమే వ్రాయవలయును. అది మెఱుఁగుదీఁగవలె మనలఁ గ్రమ్మియుంసు నంధకారము నొక్కక్షణము పోఁద్రోలి నూతనలోక మును హఠాత్తుగ గోచరింపఁజేయవలయును. ఆలోకము, ఒక్కనిమిషము మాత్రమైనటనున్న నేమి? దాని రామణీయకము జీవము నంతయు నాక్రమించి చచ్చువఱకును దదేకధ్యానములో మునుఁగు నట్లొనరించును. అట్టిదియె కవిత. గుణము ప్రధానము. రాశి కాదు.

ఈ గాథాసప్తశతి బౌద్ధయుగమునాఁటి యుత్కృష్టజీవితమును దెలుపుచున్నది. భావములు కోమలములు. వానికిదీటైనది అనంతకృష్ణశర్మగారి శైలి—మధురము, లలితము, రమణీయము. వీరి సరసత్వము అర్హ్మతకాలేది పొగడుట యసాధ్యము.

తినఁగాలఁది నాకలి! ఇంకను నిట్టిగ్రంథముల శర్మగారు వ్రాసి తనివిదీర్పఁ బ్రయత్నింపరేని మనకుఁ గష్టముగల్పించిన వారగుదురు. ఆపాపమునకుఁ బాల్పడకుందురుగాత!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3

# కృషీవలుఁడు

ఆంధ్రవాఙ్మయమునఁ బ్రకృతము ప్రసిద్ధికి వచ్చుచుండెడు గణ్యములగు నూతనసృష్టులలో నీకావ్యమొకటి. విషయమందును భావములందును నిది మనదేశముయొక్క నవజీవితమునకుఁ జేరినది. అచ్చటచ్చట, శైలియందును దూరోపమలు మొదలగు నలంకారములయందును బ్రాచీనవాసన యింకను గొంత వదలవలసి యున్నటులు దోఁచెడిని.

కవి కాఁపు యువకుఁడు : విషయము కాఁపుల జీవితము : దృష్టి యభిమానప్రేరితము. కృషీవలుల జీవితమును బ్రధానాంశముగ గ్రహించిన తెలుఁగు గ్రంథములలో నిదియ మొదటిది. ఈ విషయనవ్యతను దలంచియ కాఁబోలు రామిరెడ్డిగా రీక్రిందివిధమున వితర్కించి యుండుట :—

"అన్నాహాలిక! నీదు జీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్నన్ నిర్ఝరసారవేగమున వాక్పూరంబు మాధుర్యసం
పన్నంబై ప్రవహించుఁగాని, యితరుల్ భగ్నాశులై యీర్ష్యతో
నన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యముల్ వల్కరే!"

తాను పూర్వలాక్షణికుల కరిగాఁపు గాఁడనియు స్వచ్ఛందవిహారశీలుఁడనియు నీక్రిందిపద్యములో బాహాటముగాఁ జాటించి యున్నాడు :—

"వనలతమైన నాకవిత పత్త్రపుటంబులఁ బూవురెమ్మలన్
దినదినజృంభమాణమయి తేజరిలెఁ సహజప్రరోహ వ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్ధన నియమానుసారముగఁ దల్లత యెన్నఁడుఁ దోఁటమాలి పా ణినిగనుఁగోని నవ్యరమణీయతఁ జిలుకు నపూర్వపద్ధతిన్."

"పంజర నిబద్ధకీరంబు బయలుగాంచి
యడ్డుకమ్ముల దాఁటంగ నాశచేయు
నటు బహిర్నియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు"

"కాన నెవరేమి యనుకొన్న దానదేమి
గలుగుఁ; గాల మనంతము; ఇలవిశాల;
భావలోకము, క్రమముగాఁ బడయుమార్పు
ఏల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు."

తనకవిత వనలత. స్వచ్ఛందవ్యాసముగలది. చెన్నపురిలోని మాలీల దోహదములు, కత్తిరింపులు మొదలగు చికిత్సలచేఁ గృత్రిమ సౌభాగ్యము వహించిన పూలచెట్లవంటిదికాదు. "సహజప్రరోహ వర్ధన నియమాను సారముగ" నల్లునట్టితీఁగె. "అపూర్వపద్ధతి" నవలంబించినది. శాస్త్రకారుల యాదేశములను పారంపర్యప్రాప్తి బహిర్నియమములఁ బాటింపదు. ఆగమపుంజములకుఁ జేరిన గతాను గతికముగాదు. స్వాతంత్ర్యసీమను జరించునది. ఏమీ! పూర్వికుల విధుల నతిక్రమింపవచ్చునా? వారేర్పఱచిన కృతివిధానములుగాక యన్యము లెక్కడనైన నున్నవా? అని మూఢభక్తు లెవ్వరైన నాక్షే పించినయెడల "కాలమనంతము; ఇల విశాల: భావలోకము క్రమ ముగాఁ బడయుమార్పు;" అని కవి వారిని దిరస్కరించి తనదారిని దానేగెడిని. వీరు చేసియుండు కవితావిషయమైనచర్చను గొన్ని యేండ్లక్రిందట సందర్భాను సారముగ నేను "కవిత్వ తత్త్వవిచా రము" లోఁ జేసినాఁడను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఐరోపాలోని కొందఱు కవీశ్వరులు కాఁపువారు, సైనికులు, మొదలైన తక్కువ వృత్తులవారి బ్రతుకులను వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగాఁ గావ్యములలో వ్రాసియున్నారు. మన గ్రంథముల మాత్రము చదివి యీ పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రముయొక్క స్థితిగతుల నరయఁజూచువారికి నీ దేశమున బీదసాదులపై నాదరము గల కవి యెవఁడైన నున్నాఁడా? తుదకు బీదసాదులైన నున్నారా? యను సంశయము పట్టినను తప్పు వారిదిగాదు! శోకరసము వర్ణింప వలయునన్న ననుకూలమగు సందర్భమేయ్యది? క్రొవ్వుకాఱెడి నాయికా నాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినము కన్నీరు గార్చుటకైన నవకాశము లేక కుడుచుచుండు పరిపరివిధములైన గోడులా? శాంతరసమునకుఁ బోషకమెయ్యది? తమకుఁ గష్టము లేనట్టివైన రాజులయొక్క యుదారచర్యలా? ఆఁకటమాఁడి మలమల మాఁడుచు నింటికి వచ్చి వంట సిద్ధము కాకుండినను భార్యపైఁ గోపింపక కన్నులు మూఁతవడుచుండ విధిని ధ్యానించుచు నొకమూలఁ గూర్చుండు పొలము కాఁపులయొక్క నడవడియా? ఆహా! జనసామాన్యములయొక్క ప్రతిదినవృత్తములలో నెంతభావము, రసము గుణము నుపగతములైయున్నవో మన కవులకుఁ దెలియదుగదా; రాజపుత్రులను, రాజకన్యలను,—చాలనందులకు—బ్రాహ్మణులను, వేశ్యలనుబట్టి జంఝూటమాడుట తప్పఁ గవితకు మేలైన యన్యకర్మములు లేవా!"

ఉన్నవి యనుటకీ 'కృషీవలుఁడు' ను అబ్బూరి రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బారావు, మొదలైన యువకులు విరచించియుండెడు నవ్యకావ్యములును బ్రమాణములు.

ఈ గ్రంథమునందుఁ బొలముకాఁపులయుఁ గాఁపుటిల్లాండ్రయు దైనందిన చర్యలతోడ ఋతువర్ణనములను గవి బహుచమత్కారముగ సమన్వయించి యున్నాఁడు. ఇది భావగంభీరులకే కాని శుష్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పండితులకు సాధ్యమగు క్రియగాదు. ప్రాతఃకాలమునుండి రాత్రి నిద్దురపోవువఱకుఁ గృషీవలులు సేయుచుండు కార్యము లొకకూర్పు. వీనితో సమ్మేళించిన విధమునఁ జేయంబడి యుండెడి ఋత్వాది ప్రకృతి వర్ణన మింకొకకూర్పు. రెండును భావకళానిర్మితములును శోభితము లును నయిన ప్రకృతి ప్రతిబింబములట్ల సత్యమును రామణీయకమును దాల్చి యున్నవి. కృతి పరిమాణమునఁ జిన్నదైనను గుణమున నానా సౌభాగ్యశోభితముగ నున్నది. వీని నన్నింటిని విడఁదీసి ప్రదర్శింప వలయునన్న సూత్రమునకంటెను వ్యాఖ్యానము విపులమగును. అట్లు చూపుటచేఁ జదువరుల భావపరిశ్రమవిక్షేపములకు నిరోధము గల్గును. కాన, కొన్నియంశములను బేర్కొని విరమించెదను.

ఇందు గ్రామనివాసము, వ్యవసాయవృత్తి—యిత్యాదిప్రకృతి సామీప్యజీవితమునకును మనుష్యస్వభావప్రవృత్తికిని నుండు సంబంధము చూపఁబడియున్నది. మొత్తముమీఁదఁ బట్టణవాసు లంతమంచివారు గారనియు, గ్రామవాసులు నడవడియందు మేలుతరమైన వారనియుఁ గవి యొక్క యభిప్రాయము. ఇది నిర్వివాదము కాదని నా మనవి. పట్టణస్థులకుఁ గ్రామస్థులకుఁ జర్యాభేదములు, స్వభావభేదములు లేవన లేముగాని, పోలికలను బెంచి యెక్కువ తక్కువలను రూపించుట సాహ సకార్యము. దేశాభ్యుదయమునకుఁ బల్లెలెటులో పురములును నట్లే యావశ్యకములు. మఱియు నార్థికప్రపంచమునకు నాధారము వ్యవ సాయమని మన కవిగారు చూపియున్నారు. ఇది నిజమేకాని తక్కిన వాణిజ్యాద్యభ్యుదయములు లేనిచో దేశము సమగ్రతఁ దాల్పనేరదు.

"నవ్యపాశ్చాత్యసభ్యత నాగరకత
పల్లెలందున స్పష్టరూపములఁ దాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను విముఖత్వముం గొంతకలుగఁజేసె."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"నేఁటి నాగరకత నీమేలుగోరక
యప్పుజేసి బ్రదుకుమని విధించు
న్యాయవృద్ధికన్న నావశ్యకపదార్థ
సంఖ్య హెచ్చఁ జిత్తశాంతియున్నె."

కవికిఁ బరిణామములు వలయునో వలదో తెలియకున్నది. కవితాభావములను శాస్త్రతత్త్వములం బలెఁ దార్కికదృష్టితో విమర్శింపఁదగదు. వానియందు రసికులు గమనింపవలసిన విషయము, సౌందర్యము. ఆగుణమీకావ్యమందు నఖండముగా నున్నది.

అసంబంధములగు వర్ణనలు సంగతు లీగ్రంథమునలేవు. ప్రతియంశమును జిత్తరువున కనుకూలించునదియు నగత్యమైనదియుఁగ నున్నది. సంయోగతాలక్షణమిందు నేమాత్రము భంగముచెంద కుండుట కవియొక్క భావనాగాంభీర్యమునకు నమోఘమైన సాక్ష్యము. తావర్ణించు జీవితమును విషయములును దనకు ననుభవవేద్యములు కాఁబట్టియు, వానియందుఁ దనమనోహృదయములు సంపూర్ణముగ లీనమై యుండుటచేతను వర్ణనలన్నియు హృద్యతాగుణపరిశోభితములు. వానియందు సత్యస్ఫురణ, మనోహరత హృదయాకర్షణాదిశక్తు లున్నవి. ఇదియ శిల్పముయొక్క పరమార్థము.

పాశ్చాత్యభాషలలో "పాస్టొరల్సు" నాఁబడు పశుపాల్యాది గ్రామాంతరవృత్తులవారి యకృత్రిమజీవితస్వభావాదుల వర్ణించు కావ్యము లనేకములున్నవి. అయ్యవి "గ్రీక్, లాటిన్" భాషలలోఁ బుట్టి యాధునికైరోపా వాఙ్మయములందును వ్యాపకమునకు వచ్చి యున్నవి. హైందవభాషలలో నీతరగతికిఁ జేరిన కావ్యములలో శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, బృందావనజీవితము, గోపగోపికా సంచారములు, ఎంతయు హృదయరంజకములు. భాగవతమందలి దశమస్కంధమును, విశేషించి యెఱ్ఱాప్రగ్గడయొక్క హరివంశపూర్వభాగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును దేశీయవాక్ప్రపంచమునఁ దమస్సునడంచి చల్లని వెన్నెలలను గురిపించి చిత్తానందముకల్గఁజేయు చంద్రబింబములవలె నున్నవి. జయదేవకృతమైన గీతగోవిందమును నిట్టిదయ. గోపికలను వదలిన గ్రామజీవిత మలభ్యమనియో, కృష్ణకాంతల యనంతరము గోపికాసంత తులు నశించిరని భ్రమగొనియో, మనకవులట్టివృత్తములఁ బ్రధానాంశ ములుగాఁ గైకొని వర్ణించుట మానివేసిరి. ఈనాఁటి కావ్యవృత్తములు మరలఁ గవితాదృష్టికి నర్హములని భావింపఁబడుట తటస్థమైనది. ఇట్లిప్పుడో నశించిన మహోత్తరమైన వృత్తమును బునరుజ్జీవితముం జేసి దివ్యాకృతిగ మనముందర రామిరెడ్డిగారు నిలిపియుంచుట వారి యసాధారణప్రజ్ఞను సూచించుచున్నది.

కృషీవలుని జీవితమంతయుఁ బువ్వుల పాన్పుగాదనియుఁ గవిగా రెఱుంగకపోలేదు. పట్టణవాసులకును, వారికినుండు నార్థికస్పర్థ, సర్కారువారు వారియెడలఁజేయు ననాదరము, దానిచేవారిని బట్టి బాధించెడు దురాచారపిశాచముల విషయమును, రాజకీయ సాంఘి కాది నీతులును, సంస్కారముల యావశ్యకతను సూక్ష్మముగఁ దడవి యున్నారు. మింటికెగయు పక్షియైనను భూమిమీఁదఁ బెట్టియుండెడి గూఁటిపైఁ జూపు వేయకయుండునా? కాఁపువారియొక్క దుస్థితి యెప్పుడు తొలంగును.? వారికముందైనఁ బూర్వపు రెడ్డిరాజుల కాల మందువలె నున్నతపదవికిరారా! అను విచారములు సహజములే గదా! " కాలగర్భమునందెట్టి ఘటనగలదొ: భావిపరిణామమెవ్వరు పలుకఁగలరు. " ఎవ్వరు పలుకఁగలరో గాని నావలనమాత్రముగాదు. రైతులెట్టి దారిద్ర్యము పాలైయున్నారు? " కార్యారంభమున్ ధైర్య మున్ విడకుమయ్యా " అని కవిగారు సంబోధించుచున్నారు. వీరి మాటల నాలకించి యాదరింతురుగాక. ముఖ్యముగా మాకులము వారికి నతిథిసత్కార మొకరు చెప్పక చూపక వచ్చిన సదాచారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నదానము మావారివలెఁ జేయువా రితరులున్నారో లేదో ; ఎట్లును మించినవారు లేరనుట యతిశయోక్తిగాదు. ఈవిషయమును రామిరెడ్డి గారీ క్రింది విధమున రమ్యముగా నుడివియున్నారు.

" ఉండియున్నను లేక పస్తున్నఁగాని
యాసచేయవు పరుల కష్టార్జితంబు
నాఁకలెత్తఁగ నీ పంచకరుగునతిథి
తినక త్రావక పోయిన దినములేదు."

కాఁపుటిల్లాండ్రనుగూర్చి కవిచేసిన స్తుతులన్నియు సత్యమునకు మీఁజినవిగావు: తక్కువ. వారియొక్క " శాంతి నీతియు సురకష్ట సహనశక్తి, నెవరెఱుఁగుదురు. ? " స్త్రీలంగూర్చి వీరొనరించిన ప్రశంస యెంతయు సత్యము ; గంభీరమును.

" అతుల సంసార సాగర మందుఁగాల
జలము సుకృతదుష్కృతవాతచలితమగుచు
సుఖవిషాదపుఁ దరగలై నుడియుచుండఁ
బడవవై గట్టుఁజేర్తువు పతిని, గృహిణి." .

సంగ్రహించి వ్రాయుశక్తియం దీకవినిమించి వ్రాయువారుండరు గాఁబోలును. ఈగ్రంథమును జదువఁజదువ " ఇన్నియంశములను నిన్ని కొద్దిపుటలలో నిక్షేపించినాడు." అను నాశ్చర్యముఁ దాల్పనివారుండరు. పునరుక్తి, నిరర్థకవృత్తి, యిత్యాది కాలవ్యయమును స్థలవ్యయమును జేకూర్చు పద్ధతులులేవు. తనకులస్థులయట్లె యీకవియు మితభాషి. అర్థమెక్కువ, పదములు తక్కువ యనుశ్లాఘనకుఁ బాత్రుఁడు.

మనుచరిత్ర కళాపూర్ణోదయాదులలోని పద్యముల ననుకరించిన తలపోఁతలు వ్రాఁతలు నొకటి రెండుచోట్ల నున్నట్లు తోఁచెడిని. ఇది దోషముకాదు. ప్రమాదము కావచ్చును. వీరి యాదార్థ్య వర్ణనా శక్తిని జూపించుటకై కొన్ని పద్యముల నుదాహరించుచున్నాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లయవిభాతి

"చలువగల కప్పురము చిలికినటు చల్లనయి
లలితకలధౌతమృదు విలసనము పోలెన్
మొలకలిడు వెన్నెలల చెలువము దిగంతముల
కలముకొని తారకలు తళుకులను గప్పన్
కలువపొడి గందపొడి దొలఁకనుడి రేఁగుచును
మెలఁగు నెలపయ్యెరలు నలసతఁజరింపం
దలఁపున రసార్ద్రిమగు వలపు లిగురింప దిన
కలకలమడంచి నిశగొలిపెఁ బ్రమదంబున్."

"స్నానమొనరించి వెన్నెల చలువబయల
బిడ్డలున్నీవు నిల్లాలుఁ బ్రీతిగుడిచి
పొడువుకతలు, సమస్యలు, పూర్వచరిత
లంత వచియింపు వారలు సంతసింప"

"శ్రమ, విషాదమ్ము లాసలు, సర్వకాల
హృదయ భేదక చింతలు, నిదురయనెడు
శాంతవారిధి లీనమై సమసిపోవ
విశ్రమింపుము సైరికా వేగువఱకు."

నేనును విశ్రమించెదను. వేగువఱకుఁగాదు. మఱి రామిరెడ్డి గారింకొక గ్రంథము వ్రాయువఱకు. వ్రాసిన తోడనే పఠనమునకుం దొడంగెద.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪

# అపూర్వ సంఘ సంస్కరణము

## ఉపోద్ఘాతము

హిందూదేశములో హేళనకావ్యములు మెండుగా లేవు. "ఆదగవగిహాసవాక్యములు" మనకు సహజములు గావేమో! మోటు సరసమున్నదిగాని, పచ్చితిట్లకును దానికిని భేదము మిక్కిలి తక్కువ. ఈ హేళనమునకు లక్ష్యములు మతము, సంఘచరిత్రము, తత్త్వములు మొదలగు సర్వజనులకు సంబంధించిన విషయములైనను గావచ్చును; లేదా స్త్రీపురుషులెవరైనను గావచ్చును. కూచిమంచి జగ్గకవి యొకా నొకరాజును, నతనిప్రేయసిని నిరసించుచు నొకకావ్యమును వ్రాసెను; దానిశైలి పచ్చిదూషణకుఁ దోడుపోయినది గాన నది విషయమును బట్టికాని, శైలినిబట్టి కాని, సరసరంజకము గాదయ్యెను. ఆంగ్లేయ భాషలో "స్విఫ్ట్" అను మహోద్దండభావుఁడు మనుష్యప్రకృతి నామూలాగ్రముగ ఖండించుచు నతితీవ్రములు హృదయవిదారణ ములు నగు గ్రంథము లనేకములు వ్రాసెను. ఆయన ననుకరించుచు శ్రీ వీరేశలింగముగారు, "సత్యరాజు దేశయాత్రలు" మొదలగు వానిని వ్రాసిరికాని, మనభాగ్యముకతన వారు వాక్పారుష్యము నవ లంబింపలేదు.

ఫ్రెంచికవిమండలమునకు నాయకుఁ డనఁదగు 'వాలేరు' అను చిత్రవిచిత్ర నవ్యభావవిలాసుఁడు మానవప్రకృతిని, నిజసమకాలి కైరోపాఖండసంఘచరిత్రమును, క్రైస్తవమతమును, వినువారెల్లరుఁ బట్టరాక నవ్వురీతిని సరళమగు హాస్యరసమును బ్రకటించుచు, మాన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భంగముఁ జేసి విడిచిపెట్టెను. ఈ మహనీయమూర్తినుండి నిరంతర ధారగాఁ బ్రవహించు చిత్రపుటూహ లతిమానుషములు. తెనుఁగున స్వచ్ఛందముగఁ బరిహాసరసమును గొప్ప ప్రయోజనార్థమై ప్రయోగించిన వారిలోఁ బ్రథముఁడు నద్వితీయుఁడునైన వాఁడు వేమన. అనేక విధముల నీతఁడు వాలేరునకు సముఁడైనవాఁడు. పరిహాసమునందుఁ బారుష్యము లేని పరిహాసముత్తమము. అది వేమనకు స్వతస్సిద్ధము. శ్రీ వీరేశలింగముగారు నీ క్రియయందు దక్షులు.

హేళనకృతుల ననేకు లనేకార్థముల నాసించియు, ననేక భావములచేఁ బ్రేరితులయ్యు వ్రాసెదరు. మూఢమతము, వేషధారితనము మొదలగు కౌటిల్యములకు వేమన శత్రువు. వాలేరు లోకహితప్రారంభుఁడు; క్రైస్తవమతము, పూజారులదాడి, రాజుల నిరర్గళాధికారము మొదలైనవి మనుష్యమహావృక్షమునుబట్టి పీడించెడు చీడలనియెంచి, వానిని విధ్వంసముచేయఁ గంకణముఁగట్టిన జగద్బాంధవుఁడు. స్విఫ్టునకు మనుష్యజాతియన్ననే యసహ్యము. మృగములు మనకంటె మేలైన జీవితములు గలవియని వానియభిప్రాయము. మనుష్యప్రకృతిని సంస్కరించుటయన, వానియభిమతము ప్రకారము, పొసఁగనియోజన; నిర్మూలించుటయే కర్తవ్యమఁట! అట్లగుట మానవస్వభావమందలి ప్రతిదుర్గుణమును బాగుగ విప్పిచూపి సుగుణముల మఱుఁగువెట్టి మనుష్యులను రాక్షసపిశాచాకృతులుగఁ దీర్చి, దుస్సహులఁ జేసినాఁడు.

ప్రకృతమీ 'అపూర్వసంఘసంస్కరణ' కర్తయగు శ్రీగోపాలరావుగారి యూహాపోహలనుగూర్చి నేనేమియుఁ జెప్పజాలను. బహుశః హిందూదేశపు దుస్థితినిజూచి మనసునొచ్చి కాయకాయఁగాఁ గారిన్యము వహించిరికాఁబోలు. కొందఱు తమకుఁ గష్టమువచ్చినపుడు లోకమును నిందింతురు. తమకు దుఃఖమైనపుడు తమనేరమేయని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భావించువారిసంఖ్య యత్యల్పము. అపాత్రుల యైశ్వర్యమును జూచి కలుషించువారనేకులు. పాత్రుఁడో యపాత్రుఁడో యాజీవుఁడు సుఖపడు చున్నాఁడు గదాయని సంతోషించువారిసంఖ్య యత్యల్పము. కొందఱు తమకెన్నిమంగళములు సమకూడినను, దేశము హీనదశంగాంచి యుండుటనుజూచి సహింపఁజాలని కోపము వహింతురు. మఱికొందఱు తమకును విశదీకరింపరాని యేదో యొకవిధమగు నసంతృప్తిపాలై నిష్కారణముగ సందఱను గఱవబోదురు. ఈప్రపంచమునఁ బ్రత్యక్షముగఁ బ్రత్యంశమునందును న్యాయము ప్రవర్తిల్లలేదని కొందఱు మనసుమెత్తనివారు నొచ్చినవారై 'ఈ పాడులోకములో న్యాయమున్నదా, దేవుఁడున్నాఁడా?' యని యార్తనాదముఁ జేయుదురు. మన కవిగారును నిట్టి హృదయాందోళనము లేనివారుకారు.

తే. "యోగ్యులకు శిక్ష, మఱి యయోగ్యులకు రక్ష;
ఏమి యీ వైపరీత్యము? సృష్టికర్త
కలఁడె? ఉన్నచో వానికిఁ గలదె బుద్ధి?"

తే. "అల్పుఁడొనరింప నదిచౌర్యమనఁగఁ బరఁగు,
నధికుఁడొనరింప నదె శౌర్యమై రహించు;
కర్త్రవస్థానుసరణి లక్ష్యములెకాని,
మంచిచెడ్డలు కలవె ప్రపంచమందు?"

వీరికి ముఖ్యముగ నాగ్రహము గల్గించునది మన జనుల స్వప్రయోజనపరత్వము. సంఘసంస్కర్తలు, దేశభక్తులు, మతోద్ధారకులు మొదలగు పెద్దలందఱు వేషధారులు, కపటచిత్తులు! వారు ధనమునో పదవినో యాశించి పనిచేయునట్లు నటించువారు! మన త్రికరణశుద్ధిగఁ బలికిన తత్త్వమునునుష్ఠించువారు లేనేలేరు! మన జాతియంతయు నీరీతిని గ్రుళ్ళి కంపెత్తుచున్నదనుట నాముకుౘనకింకను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దట్టలేదు. ఇంక ముందును దట్టకుండునుగాక! ఈ కవి యింతపరిష్కారముగ హిందూజనులకు నీతిబహిష్కారముం గలిగించియుండుట కేమి కారణము లుండవచ్చును? తాను దేశభక్తుఁడు; ఇతరులు కపటోపాయులౌదురో కారో; తాను శక్తికొలంది హృదయపూర్ణముగ దేశశ్రేయమును గోరినవాఁడు. అట్టివానికి స్వప్రయోజనపరులను జూచినప్పుడు కోపము రాక మానునా? మఱియు నిస్వార్థధురంధరులు దేశాభివృద్ధి పేర నిజాభివృద్ధినిమాత్రము నేకూర్చుకొను జిత్తులమారులై యున్న, నతని హృదయము మండకుండునా? ఇదియే ముఖ్యకారణమని నానమ్మిక. అయినను వీరు సంఘతత్త్వమునింకను నెక్కువగఁ బరిశీలించియుండిరేని, యింత నిరాశయు, నిష్ఠురమును దాల్చియుండరని తోఁచెడిని. ఎట్లన, మనుష్యుల ప్రవృత్తియందు గణింపవలసిన యంశములు మూఁడు; పరమార్థము, కార్యము, భావము, అనునవి. దృష్టాంతము:—దేశభక్తిచేఁ బ్రేరితుఁడై స్వరాజ్యసిద్ధి వడయఁగోరి యొకానొకఁడు బాంబు వేసి యొక ముసలివానిని జంపినాఁడనుకొందము. ఇందుఁ బరమార్థము స్వరాజ్యము. భావము దేశభక్తి; ఇఁకఁ గార్యమన్ననో ముసలమ్మ మరణము! మొదటివి రెండును మంచివి; మూఁడవదగు బాంబుప్రయోగము నింద్యము, నిరర్థకము. అనఁగా, భావము మంచి దయ్యును కార్యము చెడ్డది కావచ్చును. ఇఁకఁ గార్యము మంచిదయ్యును భావము చెడ్డదిగా నుండవచ్చుననుట యీ గ్రంథముఁ జదివినవారికి వేఱుగ నిరూపింప నేల? అర్థము, భావము, కార్యము—వీనిలో నన్నియు మంచివిగను, అన్నియుఁ జెడ్డవిగను, గొన్ని మంచివిగను, గొన్ని చెడ్డవిగను నుండవచ్చును. అట్లగుట దేనినిబట్టి జనుల తారతమ్యమును నిరూపింపనగును? అను ప్రశ్న కలుగుచున్నది. మన కవిగారు భావములను బట్టి యనియందురేమో! ‘కార్యములను బట్టి’ యని యేలయనఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గూడదు! బిరుదముల నాశించి ధనవంతుఁడొకఁడు మదరాసులోని మృగములకును మనుష్యులకు నత్యంతోపయోగముగునట్లు కొళాయిలు వేయించెననుకొందము. అతఁడు దుర్భావముతోఁ జేసినందుననే ప్రయోజనము తక్కువపడియెనా? మన దప్పి తీఱకపోయెనా? లోకమునకు భావములతోఁ బనియేమి? పనియేగదా ముఖ్యము. సైనికుఁ డే కోరికతో యుద్ధముఁజేసిన నీకేమి! వాఁడు చక్కఁగా యుద్ధముచేసినదియే చాలును. కార్యశూరుల లక్షణము కార్యములఁ బట్టి గణించుట—ఐరోపాఖండమునకును హిందూదేశమునకును గల ముఖ్య తారతమ్యములలో నిదియొకటి. మనవారు తమ కన్నులకుఁ గనఁబడువానిని జూచి గణింపక "వానిభావమేమి? ఏయుద్దేశముతోఁ జేసినాఁడు?" అని యగోచరార్థములను గల్పించుకొనుచుఁ బొత్తు కలయిక లేనివారై యుండెదరు. ఇట్లు హృదంతరాళములలో గనులు త్రవ్వి యెత్తఁబోయిన యెడల బ్రదుకు దుర్భరమగునుఁడీ!

ఇంగ్లీషువారట్టి యోజనలకు మాటలకుఁ దొడఁగరు; కంటికిఁ గనఁబడువారితోఁ దృప్తిఁజెంది విరమింతురు. మన సూక్ష్మదృష్టి వారికి లేదు. సంఘపరమైన దృష్టితోఁ జూచినఁ గార్యములకుండు గౌరవము భావములకు లేదు. పరమాత్మ పరమైన దృష్టితోఁ జూచిన భావములు ప్రధానములే మోకాని, కార్యశూన్య సద్భావ సమృద్ధియే దేవునకును నింపుగాదు. మఱియు సంఘచరిత్రమును నిర్ణయించుటలోఁ దమతమ యనుభవముల కొలఁదిఁ దాము పోయినయెడలఁ బొరబాటులకు వీలు లేకపోలేదు. ప్రతిమనుజుని దృష్టియుఁ బరిమితచక్రమునఁ దిరుగు నదియ; తమతమ కష్టసుఖములచేతను, స్వభావముచేతను వికారము గాంచుచుండునదియ. సంఘము మొత్తముమీఁద మేలుఁజెందినదా కీడుఁజెందినదా యను విచారణ కాధారము దేశచరిత్రము. ఇండియా దేశ మీముప్పది నలుబది యేండ్లలో ముందునకు వచ్చెనా, వెనుకఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడెనా యని మనకవిగారు యోజించి యుండినయెడల నింత పశ్చా త్తాపకరమయిన ప్రతిమను జిత్రించి యుండరు; చిఱునవ్వులు కొన్ని యామొగమున మొలకలెత్తి యుండును!

ఇట్లనుటచే నీగ్రంథమునం దనాదరబుద్ధిగలవాఁడననుకొనకుఁడు. ఇదిమిక్కిలి శ్రేష్ఠమైన పుస్తకము. శీలమునకు వృద్ధిఁదెచ్చును; మాయదారి దొంగతనములకు మృత్యువువంటిది. మన దేశములో నిట్టి గ్రంథముల కవకాశము దట్టముగ నున్నదనుట విషాదముఁ బుట్టించెడు సత్యము. శ్రీ గోపాలరావుగారి నిశితఖడ్గముయొక్క దీప్తులు తమ స్సును పిదళించుచున్నవి. ఈక్రింది పద్యములలో సత్యమున్నదో లేదో మీరే నిష్పక్షపాతముగ యోజింపుఁడు?

క. "తమ యెఱుఁగని నానా విష
యములం దున్నతపదంబు లాసించి యన
ర్థము లెన్నియొ చేయుచుఁ బె
ద్దమనుష్యుల మనెడువారు ధరణిని లేరే?"

తే. పత్రికాధిపులెందఱో బంట్లునాకుఁ
బొగడుదురు వారు బట్టులపగిదినన్నుఁ;
బరులు నాగుట్టు వెలిసేసి వ్రాయునెడలఁ
దీసి ప్రకటింప కదినాకుఁ దెలుపుచుంద్రు."

తే. "ఆర్జితమొ గృహీతమొ మఱి యపహృతంబొ
స్థితి యవశ్యము లౌకికోన్నతికి నెందు;
అట్టి స్థితి లేనివారు దాస్యమునమ్రగ్గి
నీచులై యజ్ఞతను మరణించుటొప్పు."

తే. "విద్యయు మతంబు ధర్మంబు వృత్తిమాత్ర
మహితకారణంబులయి యమ్మఁబడుటొప్పు;

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధర్మశాస్త్రంబు నీశ్వరేతమును మఱియు
మూలధర్మైక బాధకంబునగుటొప్పు."

బ్రాహ్మణులకును గ్రైస్తవమిషనరీలకును సమానముగఁ దగిలెడు దెబ్బయిది:—

క. "మతమిష నొరులకు సత్త్వము
హితమని వారిఁ దమఃప్రవృత్తుల దాస్య
వ్రతుల నొనర్చుచుఁ దామ
ప్రతిహతరాజసముపూని వర్ధిలవలయున్."

ఇఁక బ్రిటిషు సామ్రాజ్యలోపమో,

ఆ. "తనదుబాన నేర్చుటను నాకు మృగరాజు
బ్రమసి పంచకాధిపత్యమొసఁగె;
ఒరులు నన్నెదుర్పనోపరా యధికార
భయమువలన; దాన జయము నిజము."

తే. "కనులు వీనులు నధికార జనులెయనుచు
మృగవిభుం డొరుదరికి రానీఁడు కనఁడు
వినఁడు, నమ్మఁడు: కాన సిగ్గును నఘూర్తి
వదలునెడ మా యొనర్పలేనిదియుఁ గలదె?"

అను పద్యములో వెల్లడియగుచున్నది. ఇఁక స్విఫ్టుగారి కవనధోరణిఁ బడినపద్యముఁ జూడుఁడు:—

తే. "భూరిదాస్యంబును సజాతివైర మమిత
నైచ్యమనియెడి సహజగుణత్రయంబు
మనుజులకు శ్వానములకు సమానమనఁగఁ,
దేటపడకున్నె వారి జ్ఞాతిత్వమిలను?"

సుమతిశతక పద్యముల యనుకరణము నిందందుఁగలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri.

తే. "పల్లెరమునఁ బాయసమున్నఁ బుల్లెనాఁకుఁ
గడవెడు జలంబులున్నను గతుకుచుండు;
ఎటులో సింహాసనము లభియించుఁగాక,
వెనుకటిగుణంబు మానునే శునకములకు?"

ఒకానొక పద్యము (౧౭౧) అసభ్యమనియు నాకుం దట్టుచున్నది. శ్రీ గోపాలరావుగారి మంచుకోపము సహజసౌకుమార్యమును దహించుచున్నది కాఁబోలు! మనవారి నీచభావనల ప్రస్తావన పుస్తకమునందంతటను నిండియున్నది. అయినను గొన్ని పద్యములను దిలకింపుఁడు :—

తే. "పత్రికలయందుఁ దమ పేరు పడఁగవలయు
శిలలపైఁ దమనామంబు చెక్కవలయు
తీవిఁ దమవిగ్రహము ప్రతిష్ఠింపవలయు
మృగపతియెతింగి బిరుదంబు లీయవలయు."

తే. "ఏవిధమునఁ జూచిన నిపుడెల్ల యెడల
నివెకదా పెద్దలనువారి యీప్సితములు!
పదవికై వారు పడియెడి పాటెకాని,
కార్యగౌరవ మింతేని కానరాదు."

ఈ కవిగారికెవ్వరు సరిపడినట్లు కానము. సంఘసంస్కర్తల మాత్రము వేఱుగఁ దిరస్కరింప నేలపూనిరో నాకర్థము కాలేదు. ఏలన, వీరి తిరస్కారమునకుఁ బాత్రులు గానివారెవ్వరును లేరు.

తే. "నిన్ననఁగనేల? కట్నమీకున్నఁ గనలి
'కులముచెడె' దని బెదరించు గురులొకింత
ప్రజకు మతమును బోధించు పాపమునకుఁ
బోవునెడ నిట్టినీతులు పుట్టఁగలవె?"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. " తేరసొత్తు పెంచిన కండతిమురుదీఱఁ
బనియొనర్పక సోమరితనముఁ బూని
మతమనుచు దేశహితవిఘ్నకృతులొనర్త్రు
వారలు దురాశచే నధికారులట్లు. "

వీరికిఁ బ్రాఁతది పనికిరాదు, క్రొత్తది మొదలేకిట్టదు ; ఇఁక నేది పనికివచ్చునో మనకుఁ జెప్పరు ! ఇఁకముందు బయలువెడలు గ్రంథములలో ఖండనముతోఁ బని చాలించుకొనక, సన్మార్గదర్శనము గొంత కలిగింతురు కాఁబోలు.

ప్రకృత మాంధ్రదేశమునఁ బ్రజ్వలించుచుండు ప్రశ్నలనేకములు వీరు స్పృశించియున్నారు. ౧౬౮ వ పద్యములో ప్రభుమార్గ సంఘసంస్కరణమును నిరసించియున్నారు. ౧౯౯ వ పద్యములో గ్రామ్యవాదముమీఁద దండెత్తిరి. ౨౨౦ భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణమునకుఁ బోషకము. ౧౨౭ జాతీయవిద్యాపరమైన శంఖారావము. గ్రంథాంతమందు రాజభక్తిఁ బురికొల్పుటకై శ్రీ చక్రవర్తిగారికి మంగళము పాడఁబడియున్నది.

మనజనులలోని లోపములు చక్కఁగ విమర్శించి యున్నారు, కాని తదుద్ధారకమార్గములను దఱచు చూపరైరి.

౨౧౩ వ పద్యమున దారిద్ర్యమును దీర్చుట సంఘసంస్కరణముకంటె ముఖ్యమైన పనియని వాక్రుచ్చిరి. సంఘనిర్మాణమునకును, దారిద్ర్యాపనోదనమునకును సంబంధములేదా ? సంఘము ప్రాచీనరీతిని దృఢమ్ముగ నుండినచో, నైరోపాయందుంబలె నైశ్వర్యమిటవచ్చి వ్రాలనేర్చునా ? ఆర్థికస్థితికిని సంఘస్థితికిని సంబంధములేదని వీరి యభిప్రాయమై యున్నయెడల, నేను భేదపడవలసిన వాఁడను.

సంఘతత్త్వపరిశీలనము వీరి యందింకను నైక్యము కామికిక్రింది పద్యమింకొక సాక్షి :—



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. "భూతదయ శీలము సువృత్తి పుస్తకోక్తు
లగుట, నసు మాన వసు రక్షణార్థ మెల్ల
రాయుధైక శరణ్యులై యడలవలయుఁ;
బశుబలంబె బలంబుగఁ బరఁగ వలయు."

'పశుబలము' వలయుననన్న, జ్ఞానబలము, ఐకమత్యము మొదలగు సుగుణజాలమ్ము లెంతఘనముగ నుండవలయునో పాశ్చాత్త్యుల నాగరకతను బరీక్షించిన వారికిఁ దెలియును. ముప్పది మూఁడు కోట్ల జనమును వశపఱచుకొని, వారికెన్నండును దొరకియుండని సౌరాజ్యమును జేకూర్చిన మూఁడు కోట్ల జనుల దిగ్విజయశక్తి కాధారము పశుబలమేనా? పశుబలముమాత్రము చాలియుండెనేని, హిందువులమంద లోకమును రొంపి చేసి యుండదా?

ఇట్లు వీరి యభిప్రాయమున నధునాతనసనాతనమార్గములు రెండును దోషదూషితములే. ఇఁక దిక్కేమయ్యా యంటిరేని, "కాలమేగతి" యని యూరార్చుచున్నారు! "సర్వసంస్కరణంబులు"ను "సహజముగ" వచ్చునఁట! కాలానుసారముగఁ దనంతట వలదన్నను వచ్చు సంస్కారము నాకుఁ జూడ నొక్కటే— అగ్ని సంస్కారము!

ఈ కావ్యమున నుద్వేగమను గొప్ప గుణమున్నది. చప్పిడి పద్యములులేవు. అన్నియు నుక్కుతునకలు; ఉడుకుఁ దాల్చినవి. ఎల్లరును జదువఁదగినవి. శ్రీ గోపాలరావుగారిఁక ముందింకను నుత్తమములగు గ్రంథముల రచింతురనుట కిది నిస్సందేహమైన తార్కాణ. వారి శక్తులు యోజనలు పరిణమించుకొలఁది భాషాభాగ్యమును దప్పక పరిణమిల్లఁగలదు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రవీరులు



శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచే విరచితమగు నీయాంధ్ర వీరుల చరిత్రము మన భాషలో నపూర్వమైన గ్రంథ మనుశ్లాఘనకు నర్హమైనది. అనాయాసముగా దేశచరిత్రమును దెలిసికొనవలయునన్నను, పామరులకు సైతము మనోహరముగా నుండునట్లు చేయవలయునన్నను, మహనీయుల జీవితముల మూలముగ దేశచరిత్రమును విశదీకరించుట యుత్కృష్టమైనపద్ధతి. పాశ్చాత్యభాషలలో జనసామాన్యమునకును, బాలికాపాఠశాలలకును నభిరుచించెడు నీవిధమున వ్రాయబడిన గ్రంథములు వేనవేలున్నవి. హైందవభాషలలో నట్టివి యరిది. కారణము లేమనఁగా:—ఒకటి, మనవారికి వచనరచనయందాసక్తి తక్కువ. సర్వవిద్యలను—తుదకు గణితశాస్త్రముగూడఁ బద్యములద్వారా ప్రకటింపఁజూచిరి. దీనిచే శాస్త్రములుగాని, జనులకు వానియందుఁగల నభిరుచిజ్ఞానములుగాని యుక్తమైనంత వ్యాప్తిని వహింపనివాయెను. రెండు, మనవారికిఁ జారిత్రకృషియందుఁ బాటవ మించుమించుగా సున్న. కవిత్వపు వేదురుగొన్నవారికి మేఘసంచార మేగాని భూసంచార మెక్కుడిది? అదృశ్యములమీఁద నిలిపినట్లు దృష్టిని దృశ్యములమీఁద నిలుపరైరి. నీళ్లనువదలి యెండమావుల నాశ్రయించిన "బుద్ధిజాడ్యజనితోన్మాదు" లలో మనవారిదే యగ్రస్థానము. ఐరోపావారి నాగరకత, విద్య, కళలు మొదలగు సత్త్వముల సంగమకారణముగ నిప్పుడిప్పుడు మనయందు జరిత్రము, ప్రకృతిశాస్త్రములు—ఇత్యాది స్థూలప్రపంచజ్ఞానశాఖలందు నభిమతము ప్రబలుచున్నది. మనప్రాచీన నేత్రములనుండి నూతనశాతనిరీక్షణములు ప్రసరించుచున్నవి. చ్యవనమహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునిరీతి దేశము పునర్యౌవనమును దాల్చుచున్నది. నవీనవసంతపు రాగములు దిశలయందుఁ దోఁచుచున్నవి. ఈ మహోత్తరపరిణామారంభమునకు నీయాంధ్రవీరులచరిత్రమువంటి గ్రంథములు బయలు వెడలుటయ యొక తార్కాణమని చెప్పవచ్చును.

ఆంధ్రవాఙ్మయమున ననేక నూతనసృష్టులకు దారిఁజూపిన వీరేశలింగముగారు కవుల చరిత్రమును దేశచారిత్రమును సమన్వయించి వ్రాసియున్నారు. అయిన నొక్క భేదము. కవుల చరిత్రములో భాషా చరిత్రము ప్రధానము; దేశచరిత్ర ముపాఖ్యానము వంటిది. మఱియు నందు నాధారపాత్రములు కవులు. రాజులు, మంత్రులు, సేనానాయకులు ప్రధానపాత్రములుగారు. ఆంధ్రవీరులచరిత్రమునందు దేశ చరిత్రలును బాత్రములును నేకజాతికిఁ జేరినవారుగారు. రాజ్యముచేసిన వీరులుమాత్రమెగాక ఇతర పదవులనుండి కీర్తిగడించినవారు గూడ నాయకులుగ గణింపఁబడియున్నారు.

దేశచరిత్ర మనఁగా నొక్క రాజులయు, రాణులయుఁ జరిత్రము మాత్రము గాదుకదా! మహాపురుషులయు స్త్రీలయు జీవిత చరిత్రములుకొన్ని యున్నవిగాని, యవి యాంధ్రదేశముతో సంబంధించినవిగాఁ గాని, కాలాదిక్రమముల ననుసరించి దేశచరిత్రమును స్ఫుటముగా వెల్లడిచేయునంత యైక్యము గలవిగాఁగాని లేవని నా యభిప్రాయము. శ్రీ భండారు అచ్చమాంబగారి "అబలా సచ్చరిత్ర రత్నమాల" దేశభాషా భూషణము. శైలియందును, విషయమునందును, సర్వసౌభాగ్యములుగలిగి హృదయమును నీరుగఁ జేయునట్టి పుస్తకము. అయినను దేశచరిత్రమునకు వ్యాఖ్యాన ప్రాయమైన నిర్మాణముగాదు. అట్లు వ్యాఖ్యానప్రాయముగా జీవితములఁ బ్రదర్శింప వలయునన్నఁ గాలక్రమము ననుసరించి పాత్రముల నేరి జూపుట సాధ్యమైనంతవఱకుఁ బాత్రములకును వారి కాలస్థితిగతులకును గల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంబంధమును వ్యక్తపఱచుట; కాలభేదముతోఁ దటస్థములైన స్థితుల భేదములకు హేతువులఁజూపి వివిధ పరిణామావస్థలకుఁగల యన్వయ మును స్థాపించుట; ఒక్క జీవితమునకును దానివెంబడి వివరింపఁబడు నింకొక జీవితమునకును మధ్యస్థములుగానుండు వృత్తాంతముల సంగ్ర హముగఁ బొందించుట—ఇత్యాది నియమములను గొన్నింటిని ననుసరించుట కర్తవ్యము. లేనిచో దశదశకును నుండు సంబంధమును, దానిద్వారా గోచరమగు చారిత్రముయొక్క నైక్యమను తత్త్వమును బోధకురావు; అంశ మేకధారగనుండదు: మఱి తెగి తునుకలై కలయికలేని కుప్పగాఁ గనిపించును. చారిత్రకుల సంప్రదాయములకు విరుద్ధముగా వ్రాయఁబడిన జీవితములు పురాణగాథలట్లు రసవంతము లుగ నుండినను శాస్త్రదృష్టిమైఁ జూచువారికి రమణీయములుగను, నర్థవంతములుగను దోఁపవు.

మహనీయజీవితములును, దేశచరిత్రలును బరస్పరావలంబన ములు. గొప్పవారి యుద్యోగములచే దేశముయొక్క చరిత్రము మార్పుఁగాంచును. మఱిఁ దమజీవితము నావరించియుండు సంఘాది దేశస్థితులనుబట్టి వ్యక్తిపాత్రముల తలంపులు, భావములు, యత్న ములు మొదలగు నడవడివిశేషములును, వారుగడించెడి సిద్ధులును, నధమపక్షము గొంతమట్టునకైన నిర్ణీతములగును. దేశము, మహ నీయుల జీవితము, ఇవి పరస్పరహేతుఫలరూపములు. అనఁగా సంపూర్ణ ముగాఁ గాదు. మఱిఁ జాలమాత్రమను సమయము గుణవాచకముగా గ్రహించునది. ఈ పరస్పరాశ్రయముండుటచేత జీవితముల సాధారణ ములుగఁ గొని చరిత్రనిర్మాణము చేయఁబూనుట సమంజసమైన యాశయము.

ఈకష్టతరమైన ప్రారంభమున సోమశేఖరశర్మగారేమాత్రము జయసిద్ధి గాంచియున్నారో చదువరులే వితర్కింతురుగాక. నాకుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూడ వీరి యీగ్రంథమెంతయు గణనీయమని తోఁచుచున్నది. ఆంధ్ర భాషానవీనపుష్పములలో వన్నె, కాంతి, పరిమళములయందు దీనికి మించినవనేకములులేవు. ఇందు నిక్కమైన చరిత్రశోధనములున్నవి. పుక్కిటి పురాణములన్నియుఁ జరిత్రములుగాఁ బొంగింపఁబడి యుండ లేదు. శైలియు మనోహరము. ఇందు వెదజల్లఁబడియుండు నానాకవుల పద్యములఁబట్టి విచారించినయెడల శర్మగారు రసజ్ఞులనియు సాహిత్య వివేచనశాలురనియుఁ దోఁపకమానదు.

దేశభక్తికిని, జరిత్రజ్ఞానమునకును నెడతెగని సంబంధమున్న దని కొందఱనెదరుగాని యది యెంతమాత్రము విశ్వసనీయమో నాకు సందేహముగా నున్నది. భక్తి జ్ఞానములు పరస్పరాశ్రయములా? జ్ఞానము హెచ్చినకొలఁది భక్తి హెచ్చునా? మూఢత్వమునకు, భక్తాగ్రేసరతకు నేబాంధవ్యము లేదా? ఈ తత్త్వశోధనమునందు నేకాభిప్రాయమింకను గుదురకున్నది. ఇఁకముందుఁ గుదురుటకు సందేహము. అయిన నీ గ్రంథము లిఖింపఁబడినరీతిఁ జరిత్రములున్నచో నవి తప్పక దేశభక్తి కుత్తేజనమిచ్చునని చెప్పవచ్చును. ఇందుఁ బూర్వము దేశరంగమున విరాజిల్లిన కాంతులన్నియు మెఱుఁగు దీఁగెల సరములట్లు కూర్పఁబడి, యాంధ్రమాతకుఁ గంఠహారములుగా వేయఁబడియున్నవి. వాని దీప్తులచే మిఱుమిట్లు చెందిన కన్నులకు దోషములున్నను నంతఁగాఁదోపవు. ఈరీతిని బూర్వయుగముల కీర్తు లను జిత్రించి మోహనమూర్తినిగాఁ జూపితిమేని, మాతృభూమిమీఁది యభిమానమును, దత్సేవామహోత్సాహమును బ్రవర్ధమానములై, మనల నుద్యోగవ్యగ్రులఁ జేయుననుట నిశ్చయము. ఎంతహీనస్థితి యందు మనము ప్రకృతమున్నప్పటికిని, మన పూర్వుల యౌన్నత్య మును దలంచికొంటిమేని, తత్సంతతివారమైన, మనకును నట్టి యౌన్నత్యము సాధ్యముకదా యను నుత్సాహము కలుగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"సాధ్యము" అను నమ్మకము హృదయముల నాక్రమించెనేని "అయోధ్యులము" అను పౌరుషమును ఒకానొక నాఁటికిఁ దప్పక వహించినవారమగుదుము. అటుపిమ్మటఁ గార్యసిద్ధి సుగమము.

ఈ యనేక కారణములనుబట్టి సోమశేఖరశర్మగారి వీరులచరిత్రము ప్రతి యాంధ్రుఁడును జదువఁదగినదనియుఁ బ్రతిపాఠశాలయందును బఠనీయముగా నియమింపబడుట కర్హమైనదనియు దృఢముగఁ జెప్పఁగలను.

ఇట్టి గ్రంథములనింకను బెక్కుల రచించి మన దేశమునకును, భాషకును వృద్ధిని జేకూర్తురని, చదువరుల పక్షమున గ్రంథకర్తగారిని బ్రార్థించుచున్నాఁడను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౬

# సునందిని



ఈగ్రంథమును రచించినవారు రాజమహేంద్రపురవాస్తవ్యులగు శ్రీ ఆచంట సత్యవతీదేవిగారు. ఈపె మంచివంశస్థురాలు. విద్యావతి. ప్రజ్ఞ, భావనాశక్తి, ఉపజ్ఞ, ఇత్యాది చిత్రకళాగుణములను మంచిశైలిని గలయదియని చదువరులే గ్రహింతురు. ముంజేతికంకణమున కద్దమేల? నాసాక్ష్యమిం దనవసరము.

ఈనవల 'రొమాంటిక్' అనఁబడు వర్గమునకుఁ జేరినది. 'సర్ వాల్టరుస్కాటు' యొక్క యద్భుతరసప్రధానములైన యాఖ్యానముల యొక్క ప్రభావమేమో, యీధోరణి తెనుఁగులోనింత వ్యాపించి యుండుట. స్వకపోలకల్పితమగు కథయైనను, అంశము లనేకము లపూర్వములైనను, మనగ్రంథకర్త్రిగా రింకను సంపూర్ణస్వతంత్రరచనకుఁ బ్రారంభించినట్లు కానము. అయిన నిందు లీనమైయుండెడు ప్రతిభా విశేషమునుబట్టి చూచినయెడలఁ ద్వరలో సమకాలికవృత్తమేదైనఁ గైకొని సహజములును, సాధారణములును నయిన సంగతులుగూర్చి కైసేసి 'జేన్ఆస్టేన్', 'ఆనటోల్ఫ్రాంసు' మొదలగువారు చిత్రించిన విధమున జీవితప్రదర్శనము చేయుదురని యాపరాని నమ్మకము నామనస్సున నుద్భవిల్లెడిని. అద్భుతలోకములకంటె సత్యలోకములు ప్రౌఢజనామోదకములు.

హిందూస్త్రీలయొక్క భావములను బరమార్థములను శ్రీ సత్యవతీదేవిగారు నిండుజ్ఞానముతోడను బూర్ణహృదయముతోడను జిత్రించియున్నారు. కాన నెల్లరమనస్సుల నీ పాత్రము తప్పక యాకర్షించును. మన ప్రాచీన—కొందఱు సనాతనమందురు కాఁబోలు—శీలాచార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూత్రములక్రిందలి నాయికానాయకు లుదాహరణప్రాయులు. హిందూ దేశముయొక్క సత్త్వము తెలిసికోవలయునన్న నిట్టి వర్ణనములం జదివి తీరవలయును.

ఇందలి వృత్తము గొప్ప తలంపులకుఁ బ్రబోధకము. మంచి నడవడికి నుత్సాహకారి. అందఱుసు జదివి యానందింపఁదగిన నిర్మలనీతికథవంటిది.

ఇట్టి యుజ్జ్వలగ్రంథమును గల్పించి మనకుఁ బ్రసాదించి యుప కారమొనర్చినవారగుట శ్రీ సత్యవతీదేవిగారు ధన్యురాలు. మనయొక్క మన్ననకుఁ మెప్పునకు సర్వవిధములఁ బాత్రురాలు. ఇంకను మేలైన రచనలచే నాంధ్రావళికి మోదమును నభివృద్ధిని సంఘటించి దేశ భాషాకైంకర్యముల నిర్వర్తింతురుగాక.

---


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧

# విద్యాప్రవృత్తి

---

మనుష్యమూలాధారప్రకృతులు రెండు : జ్ఞానము, కర్మము. జ్ఞానమనఁగాఁ దెలివి ; వస్తుస్వభావమును గనుఁగొనుట. కర్మమనఁగా కార్యము ; చేయుపని.

వీనియం దెయ్యది ప్రధానము ? జ్ఞానమా ? కర్మమా ? పర్యాయపదముల మూలముగ విచారించిన నీవిషయమింకను విశదమగును. జీవితమున నాద్యమెయ్యది ? బుద్ధియా ! నడతయా ? యోజనయా ? చరితమా ? నోటిమాటలా ? చేతియాటలా ?

సర్వముఁ దెలిసినవారయ్యును మూఢులవలె, దుర్మార్గులవలె, వర్తించువారులేరా ? అపురూపులా ? అట్టివారిని గృతకృత్యులని యెవరైన శ్లాఘింతురా ? మఱియు, నేమియుఁ దెలియనివారయ్యును సన్మార్గమునఁ దమనైజమునుబట్టి పోవువారెందఱో యున్నారు. గ్రామములలోనుండు బీదసాదలు తఱచు ధర్మనీతి తత్త్వముల నెఱిఁగినవారు గాకున్నను, వర్తనమునందుఁ బండితులకంటె మొత్తముమీఁద శ్రేష్ఠులని యనేకులనమ్మిక. జనులతారతమ్యము నిరూపించునప్పుడు చర్యలను గణింతుముగాని విద్యను గణింపము. మనలోఁ గొందఱు "సుజ్ఞానమున్నఁ జాలును, సిద్ధులు చేకూరును" అని వచించెదరు. అదియెట్లో, నాకుఁ జక్కఁగ బోధపడమికిఁ జింతిల్లవలసి యున్నాఁడను. "ధైర్యగుణమెయ్యది, దానిలక్షణము లెయ్యవి ; తన్మూలమునఁ బ్రచలించుకార్యము లెయ్యవి" యని మంచిశైలిని, ఆమూలాగ్రముగ విచారణ నడపి, ప్రసంగింపఁ గలవారందఱును ధైర్యమును నడతయందుఁ బ్రకటించుట నిత్యమా ? జ్ఞానమును బడసినమాత్రమునఁ జరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రము చక్కఁబడునేని, హిందూదేశచరిత్ర మిట్లేలయున్నది? ఇది నిష్కారణవిచిత్రమా? జ్ఞానయోగముచేఁ బరలోకమున సర్వమంగళములు తటస్థించునఁట! అవునో కాదో నాకుఁ దెలియదు కాని, యొక్కటిమాత్రము సత్యము; వట్టి జ్ఞానమీలోకమున నేసాధనకును బనికిరాదు. దీనిఁబట్టి చూడఁగాఁ బరలోకము మెత్తనిదనియు, నోటిలోని వెన్నమాదిరిఁ గరఁగునంత సరళమనియు, సూక్ష్మమనియు, నీపాడు ఇహలోకమువలె కాఠిన్యము, పారుష్యము, స్థౌల్యమునులేని దివ్యపదవియనియు, నెట్టి నమ్మికలేని వానికైనను దటుక్కునఁ దట్టకమానదు. పరలోకదృష్టితో నీవిషయముఁ బరిశీలించుట యిట నప్రకృతముగావున సామాన్యదృష్టితో నారయుదము.

ఆద్యప్రకృతి కర్మంబు. ఇటఁ గర్మంబనఁగా 'కర్మకాండ' మనఁబడుదానికిఁ జేరిన వైదికక్రియగాదు. జ్ఞానము ద్వితీయము. ద్వితీయం బనుటచే గౌరవహీనమని భావించుట తప్పు. ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాఁడికావా? జన్మాదిగా జ్ఞానశక్తి, పూర్వము కపిలుఁడు, ఘటోత్కచుఁడు మొదలగువారికి సద్యోయావనము తోడవచ్చినట్లు, ఈకలియుగములో నెవ్వారికిని లభింపదు. కాని, పుట్టినక్షణముగోలె నేవేని క్రియలు ప్రవర్తింపకుండినచో బ్రాణములు నిలువవు. శిశువు పాలుద్రావక సమాధిఁదాల్చెనేని యదియోగమా? కాదు; ప్రాణత్యాగము. ప్రాణకార్యములు నిత్యసంయోగములు; ప్రాణములున్నఁ గార్యములు, కార్యములున్నఁ బ్రాణములు నుండియే తీఱవలయును. ప్రాణములులేనిచోఁ గార్యములు, కార్యములులేనిచోఁ బ్రాణములు నుండవు. కర్మమువలె జ్ఞానమారీతిని బ్రాణాధారముగాదు. పశుపక్షివృక్షసంతానములలోఁ బ్రాణములును గార్యములును బలసియున్నను, విద్యలున్నవా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కార్యాచరణమునందలి యిక్కట్టులు, సందియములు మొదలగు నడ్డంకులు, యోజనలు ప్రభవిల్లుటకు మూలములు గాకున్నను తరుణములు. ఏకష్టమునులేక మనకు నూపిరి యాడునట్లును, హృదయము గొట్టుకొనునట్లును, స్వచ్ఛందముగా నిత్యసారళ్యముగఁ గార్యములు నడుచునేని, యే యోజనకు నవకాశమును నావశ్యకతయు నుండవు. అట్లగుట నాలోచనలు పుట్టవు. పక్షి మృగముల జీవితముల యందు వ్యాపారములు మెండయ్యును జిక్కులు లేనివి. కొన్నిగతుల సంచారములచే నవి ప్రాణయాత్ర నీడేర్చికొనును. అట్లు మనుష్యజీవితము సుసాధముగాదు; మనలనావరించియుండు స్థితిగతులు సంఖ్యయందు మిక్కిలియు నధికములు, సంశ్లిష్టములు; ఎక్కువ చిక్కును దాల్చినయవి. కావున యోజనాశక్తి నేమాత్రమును బ్రయోగింపని యెడల మనకును మనసంతతికిని బ్రదుకు దక్కదు. మనుష్యజీవిత ముత్కృష్టమును, శాశ్వతమునైనదశం జెందవలయునన్న, విజ్ఞాన మఖండముగఁ బర్వవలయును. జ్ఞానయోగవాదులలోనుండు సత్య మింతియే కాఁబోలు! అయిన నొక జాగ్రత్త: విజ్ఞానముండినమాత్రమున జన్మసాఫల్యము కలుగఁబోదు. ప్రకృతసిద్ధాంతమేమనఁగా, జన్మసాఫల్యమున కావశ్యకములగువానిలో జ్ఞానము నొక్కటియని. ఇంతకంటె నెక్కువ మాహాత్మ్యము నారోపించుట నిర్హేతుకము.

యోజనాశక్తియొక్క ముఖ్యోద్దేశము కార్యసౌలభ్యము. కార్యములు దుర్ఘటములుగనున్న, "నేరీతి నలవరించుకొనవచ్చును దైవమా!" యని భక్తియోగజ్ఞానయోగములరెంటిని బ్రకటింతుము. కార్యములు సరసరమని నిర్నిరోధముగ జరుగుచుండెనేని, యే యోజనలులేక నెమ్మదిగ నుందుము. చూఁడుడు; శిశువునకుఁ బ్రాణములెట్లు నిలుచును? పాలను గ్రోలుటచేత. ఈప్రాణాధారక్రియకుఁ గావలసిన జ్ఞానమెయ్యది? స్తన్యము గుర్తెఱుఁగుట. శిశువులయం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దింతకంటె జ్ఞాన మాదియందుఁ గానఁబడదు. త్రోవ తెలిసినవాఁడు, నడచుచుండుటయైన గమనింపక, పరచింతఁ దాల్చినవాఁడై, కాళ్లీడ్చి కొనిపోవఁ బోవుచుండును. తెలియనివాడు మాటిమాటికిని త్రోవను గూర్చిన యోజనలకుఁ గడఁగుచుండును; నాలుగుదారులు గలసిన చోటికి వచ్చెనేని 'ఏదబ్బా, ఓక్క!' అని తలబ్రద్దలగునట్లు వితర్కించును. ఏయుసాధులునులేక కార్యములు నడచునేని యోజనాశక్తికి 'రజా' యిచ్చినవారమై, శిరోభారపీడనములేని జీవనముఁ బడయఁజాలుదుము.

నాగరకత యెక్కువ యగుకొలఁది బ్రదుకుపాటుల స్థితిగతులింకను జిక్కునుదాల్చును. తళుకులు, బెళుకులు, కోరికలు, కష్టములు, సుఖములు, సాధ్యములు అన్నియు హెచ్చును. అసాధ్యములని యెన్నఁబడువాని సంఖ్యమాత్రము తగ్గును. పూర్వము దేవుఁడొసఁగిన రెండు కాళ్లతో నెల్లరుసు బ్రయాణములను మెల్లఁగఁ, దిన్నఁగ, జరపుకొనుచుండిరి. ఇప్పటి యానోపాయములెన్నియని చెప్పవచ్చును? వ్యోమయానము, భూయానము, భూగర్భయానము, సముద్రయానము, సముద్రగర్భయానము—ఓరామా! తలఁచుకొన్న నొడలు గడగడ వడఁకును! మనుష్యుఁడు సర్వసంచారప్రభావుఁడై యున్నాఁడు. ఈ సౌకర్యములతోడఁ, దోడుసేడలట్లు, కావలసినన్నియుపాధులున్నవి. పూర్వము రమారమి జనసంఖ్య ప్రకారము జాతిప్రాబల్యము, దేశగాంభీర్యము నేర్పడుచుండెడివి. ఇప్పుఁడన్ననో, ప్రకృతిశాస్త్రజ్ఞులచేఁ గనుఁగొనఁబడియెడు ఫిరంగులు, తుపాకులు, బాంబులు మొదలగు వినాశనక్రియాసాధనయంత్రములచే, జనసంఖ్యల ప్రభావము దినదినక్షయంబు గాంచుచున్నయది. గొఱ్ఱెలెన్నియున్న నేమి? ఒక్కపులిచాలదా వానిపనిఁదీర్చుటకు? యంత్రబలములేని వారెన్నికోట్లైననేమి? పురాణపురుషులుగా నున్నయెడలఁ, బ్రకృతిశాస్త్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రయుక్తకళాకోవిదులైనవారి నోటిలోఁ బడక తప్పించుకొని పోఁ జాలరు. సారముపోయిన పిప్పివంటిది సంఖ్య; దానికంటె సత్త్వము ప్రధానము. బుద్ధిబలమును గార్యశూరత్వమును ననుసరించి సత్త్వ ముండును. ఒక్క బుద్ధియున్నమాత్రముననే జాలదని యడుగడుగు నకుఁ దెల్పవలయునా? మనదేశమురొక్క దౌర్భాగ్యమునకుఁ గారణము మంచియోజనలు లేమికాదు; యోజనతోఁ దీటగు నడవడి లేమి. మాటలకు నాటలకు సంయోగములేని బ్రదుకు కడ తేరు టెట్లు? తేర్చు టెట్లు? నాగరకత వృద్ధియగుకొలఁదిని మనుష్యజీవిత మెక్కువ సంశ్లిష్టమగును; మన రక్షణముకొఱకు గమనింపవలసిన విషయముల సంఖ్య హెచ్చును. ప్రాఁతరీతి నొకటి రెండు త్రోవలలో, "గ్రుడ్డెద్దు జొన్నచేనిలోఁ బడినట్లు" పోవుచుండినఁ జేటు తప్పదు; సంఘము మునుపటికంటె నెక్కుడు క్రియలసాధింపవలయు; కార్యభారమన్ని దిక్కులను ఘనతరమగును; నిమిష నిమిషమునకు నూతనమార్గముల నవలంబింపవలసివచ్చును; ఏ మార్గము మంచిది; యెయ్యది చెడ్డది; ఇది సరియా; యది సరియా; యని క్షణక్షణమునకును సంశయము లుదయించును; చింతాపరంపరలు మిక్కుటములగును; ఈ కష్టము లకుఁ దగిన ఫలము లేకపోలేదు గాని, యూరక హాయిగాఁ గూర్చుండి కాలక్షేపముఁ జేయుటయే మోక్షమనువారికీలోక మావరప్రసాదము నే నాఁటికి నియ్యదు. అట్టివారికి పరలోకమో, పారతంత్ర్యమో, బహుశః రెండునో, గతి. వృద్ధిహెచ్చగుకొలఁది యోజనాశక్తియు నెక్కువ బలవంతమగును; కావలసివచ్చును. చూడుఁడు; ఒకటి రెండు విధముల యాగమముల ప్రకారము వర్తించు గ్రామీణులలో బుద్ధివికాసమునకు నావశ్యకతయు నవకాశమును గలదా? కావుననే వారి బుద్ధియు, నడతయు మందములై యుండును. పట్టణవాసులలోఁ జర్యావిధానములసంఖ్య హెచ్చియుండును గాన, నచ్చటివారు మాటల


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందును, మూలఁగూర్చుండి యోజించుటలందును, వలదన్నను బలాత్కారముగ నితరులకు బుద్ధిఁజెప్పుటయందును గడుసమర్థులుగానుందురు.

జ్ఞానకర్మంబులరెంటియొక్క ముఖ్యోద్దేశము ప్రాణరక్షణాభ్యుదయంబులు. మోక్షమనుట యీనాఁటి మాటగాదు; ఏనాఁటిమాటయుఁ గాదని చెప్పినఁ బాపమా? మోక్షముఁగోరువారును నేదో శాశ్వతమైనస్థితి నాశించువారేకదా! ఈస్థితి జడస్థితియా? రాళ్లఅప్పలవలె నుండవలయుననియా వారికోరిక? మఱి చైతన్యసమేతమా? అది యట్లుండె. అన్నిటికంటె మించిన మహత్తు ప్రాణము. ప్రాణము ద్వివిధము: తనయొక్కయు, తనజాతియొక్కయు నని. ఎల్లపృథక్పాత్రములయందలి ప్రాణములుఁబోయిన జాతియుండదు; ఇఁక జాతి దుర్బలమగుడుఁ బ్రతియొకనికిని ముప్పుదప్పదు. జాతియుఁ బ్రజయు నన్యోన్యాశ్రయములు. జాత్యభివృద్ధికి విరుద్ధములైన ధర్మములును, నీతులును నాత్మహత్యతో సమానములు. ప్రాణముయొక్క ముఖ్యగుణము కర్మము; జ్ఞానము భృత్యప్రాయము. జ్ఞానము పుట్టినది కర్మగర్భము నుండి; కాని బిడ్డలు తల్లిదండ్రుల నాడించునట్లు కర్మమును వశము చేసికొను ప్రభావముఁ గలయది. ఉత్పత్తి నెట్లుండినను నీనాఁటి ప్రచారములఁబట్టి చూచిన నవిరెండును బరస్పరకారణములు; ఇతరేతరోద్దీపకములు. కార్యము ననుసరించి యోజనలు సాఁగుటయు యోజనల ననుసరించి కార్యములు సాఁగుటయు, రెండును బ్రత్యక్షములు. అయిన నొక్కటి; యోజనలు కార్యములుగఁ బరిణమింపకున్న క్షేత్రమున నాటఁబడని బీజములట్లు నిష్ఫలములగును. గొడ్డువోయిన జ్ఞానమెక్కడ దట్టముగనుండునో యాదేశము మానసక్షయవ్యాధి బాధితమని దృఢముగఁ జెప్పవచ్చును.

జ్ఞానములోని జాతులు రెండు:—భూత (స్థితి) జ్ఞానము, భావ్య (స్థాతవ్య) జ్ఞానము. భూతమనఁగా నునికికి వచ్చిన వస్తువో, తప్పక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సహజముగ వచ్చునదియో; స్థితిం దాల్చినదియును, నపళ్యము దాల్చు నదియును. స్థితి త్రివిధము :—భూతభవిష్యద్వర్తమానములని. ఉదా :— మనుష్యులందఱు మర్త్యులు; అనఁగా మరణాధీనులనుట. దీనికి నిర్వచనము—పూర్వులు చచ్చిరి; ఇప్పటివారు చావనున్నారు; ఇఁక ముందటివారును దప్పక చత్తురు. శరీరియొక్క యనివార్యలక్షణములలో మృత్యువొకటి. శరీరికి మృత్యువునకు నుండు సంబంధము సర్వదా సిద్ధము. ఒక్కవేళ నిఁకముందు మనుష్యులు పుట్టరనుకొందము. పుట్టకపోయినను నీన్యాయమునకు బాధ లేదు. శరీరులుండినను సరే, లేకున్నను సరే, వారికిని మృత్యువునకు నుండు దాంపత్యము నిత్యమనుట యీ న్యాయముయొక్క నిర్వచనము. ఈ దాంపత్యము సిద్ధము. ఇప్పటి కాలముంబట్టి చూచిన నెయ్యది భవిష్యత్తో దానినిగూడ సంగ్రహించినట్లు భూతమనుపదము వాడఁబడియున్నది. ఏలన, భవిష్యత్తుగూడ స్థితికిఁ జేరినదిగాపున. మఱియుఁ గాలక్రమముగాఁ జూచిన నిఁకముందుఁ బుట్టఁబోవువారు చచ్చుట యిప్పటిపని గాకున్నను, ఏన్యాయముంబట్టి వారిమరణము మన మనుమానింపనగునో, యాన్యాయ మిఁకముందుఁ బుట్టఁబోవునది కాదు; అదియెప్పుడో పుట్టినది; శరీరితో నవతరించిన కవలబిడ్డ. ఇప్పుడు సత్యము; రేపు సత్యము; శ్రీరాములనాఁడును సత్యము. అనఁగా నియ్యది శాశ్వతము; స్వభావలక్షణము. ప్రకృతి శాస్త్రన్యాయములన్నియు నీవర్గమునకుఁ జేరినయవి. ఉదా :—ఆధారములేని పదార్థము భూమ్యాకర్షణశక్తిచేఁ గ్రిందఁబడును; అగ్నిలోఁ జేయివెట్టిన నొప్పియగును; ఉష్ణముచే వస్తువుల యాకృతులు పెద్దవగుట బహుళము, ఇత్యాదులు. *

---

* నాచే రచింపఁబడిన యర్థశాస్త్రమునందలి "న్యాయశబ్దనిర్వచన" మను ప్రకరణమున త్రివిధన్యాయములయు లక్షణములు విపులముగఁ జర్చింపఁబడియున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇఁక భావ్య (స్థాతవ్య) జ్ఞానమును విమర్శింతము. భావ్య మనఁగా, వచ్చినదికాదు; తనంతట, తప్పక, స్వభావసిద్ధముగ రానున్నదికాదు; మఱి యవశ్యము రాఁదగినది; మనచే రప్పింపఁబడవలసినది; ఎయ్యదియుండిన బాగని మనము కోరుదుమో, యెయ్యది తప్పక రాఁదగినదని మనము నిర్ణయింతుమో, యయ్యది భావ్యము. నాకు రెక్కలు రావలయుననుట భావ్యముగాదు. ఏలన, నది యవశ్యము కాఁదగినవస్తువుగాదు. భావ్యజ్ఞానమున కుదాహరణము: అందఱు సత్యము చెప్పవలయును. దీనికి నిర్వచనమెట్లనఁగా, నందఱును సత్యము చెప్పుట పూర్వము ప్రసిద్ధికివచ్చిన వృత్తాంతము గాదు; ఇప్పుడు వచ్చియుండలేదు; ఇఁకముందు వచ్చుటయు సందిగ్ధమే; అయిన నొక్కటి; వచ్చినను సరే, రాకున్నను సరే, లవమాత్రమైనను సిద్ధింపకున్నను సరే, అందఱును సత్యమును జెప్పవలయుననుట శాశ్వతన్యాయము. ధర్మములను నీతులను బోధించు న్యాయములన్నియు నిట్టివి. ఇవి బోధించునవి కృతంబులుగావు; కర్తవ్యములు. ఈ న్యాయములకును రాజశాసనములకును గొన్ని విధముల సామ్యమును గొన్నివిధముల వైషమ్యమును గలదు. అయ్యది నాయర్థశాస్త్రమున విమర్శింపఁబడియెఁ గాన, నిట ననావశ్యము. ఈ నీతి న్యాయములకును బ్రకృతిస్థితికిని నే సంబంధమును లేదా? అనఁగా నవి నిష్ప్రయోజనములా? ఏనాఁటికినిగావు. అందఱు సత్యము చెప్పకున్నను, జెప్పవలయుననుట సర్వత్రసత్యము. ఈ సత్యముండుటంబట్టియె లోకమునందుఁ గొంతకుఁ గొంతయైన సత్యము ప్రవర్తిల్లుచున్నది. సత్యము ధర్మమగుటచేఁ దత్ప్రకారము వర్తింప మనము ప్రయత్నింతుము. ఈ యత్నమునకును, దన్మూలమున సిద్ధించు ఖండమో, పూర్ణమో యైన చరిత్రస్థితికిని, ఆ నీతియే బీజము. ఆ నీతియొక్క ప్రతిబింబమట్లు వర్తమానమును దీర్పఁజూతుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆనీతిప్రభావముచే వర్తమానము మన ప్రయత్నానుసారముగ మాఱును. అట్లగుట, స్థితిని నిర్ణయించు శక్తులలో భావ్యములకును స్థానమున్నది. స్థితిస్థాతవ్యములు రెండును సత్తులే. స్థాతవ్యములు మిథ్యలుగావు. అవి, ప్రకృతిశక్తులట్లు మనుష్యప్రయత్నము లేకయు, యమోఘముగ వర్తింపనేరవు. మన శక్తిగొలఁది వాని విజృంభణముండును. కార్యసాధనమునకు భూతభావ్యజ్ఞానములు రెండును నావశ్యకములు. స్థితిజ్ఞానముచే మనయొక్కయుఁ బ్రకృతియొక్కయు శక్తులు గోచరించును. స్థాతవ్యజ్ఞానముచే నేయేయర్థములకై మన శక్తియుక్తులఁ బ్రయోగింపవలయుననుట యేర్పడును. "నాలాభార్థమై నాచాతుర్యమును వినియోగింతునా? దేశశ్రేయమునకై పాటుపడుదునా? నాకై కాక పరులకై నేనేలశ్రమింపవలయును? స్వార్థత్యాగ మేల విధియయ్యె? దేశము నశించిన నేను నాశములేకయుండుట సాధ్యమా? మనుష్యమహాసంఘములో నిమిడియుండు నణువువంటివాఁడనా నేను?" ఇత్యాదితర్కములు స్థాతవ్యపరిశోధనలకుఁ జేరినయవి. పురుషార్థముల నిర్ణయించునది నీతి. ఆయర్థసాధనకై వలయు నుపకరణముల వివరించునది ప్రకృతివిద్య. "ఉండువానిఁ గూర్చిన జ్ఞానము" వలన క్రియలయుఁ, దత్ఫలములయుఁ దెలుంగును "ఉండఁదగినవానిఁ గూర్చినజ్ఞానము" వలన యుక్తాయుక్తములును, గర్తవ్యములును దేటపడును.

ఇఁకఁ గర్మమునంగతికిఁబోదము. ప్రకృత్యాది శాస్త్రంబులలోఁ గనుఁగొనఁబడిన న్యాయంబులను, మనుష్యప్రయోజనార్థక కార్యంబులఁ బ్రయోగించు మార్గంబుల నాదేశించి, మనలసార్థకశ్రములను జేయునది కళ. జ్ఞానమునకు యోజనాశక్తి యొండు చాలును. సత్కళాసామ్రాజ్యమునకు వలయుగుణము లెవ్వియనఁగా:—(౧) యోజనాశక్తికిం జేరిన ప్రకృతి శాస్త్రజ్ఞానము. (౨) ప్రకృతి న్యాయప్రయోగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానము. (3) యుక్తాయుక్తజ్ఞానము. ఇది తెలియకున్న మనచాతుర్య మంతయుఁ జెడ్డకార్యముల కర్పింతుమే మో! వివేకములేనిది "ఇది తగు నిదితగ" దని యెట్లు నిరూపింపనగును? (౪) వివేకముండిననే చాలునా? మంచిచెడ్డల నరసియుఁ జెడ్డయేచేయు దుర్మార్గులెందఱు లేరు.? కావున ధర్మనిరతియు నావశ్యకము. (౫) ఇన్ని మనోభాగ్యము లుండినను శరీరపరిశ్రమము లేనిది యేకళయు సాగదు. ఆరోగ్యము, బాహుబలము, పట్టుదలయును భావ్యగుణమ్ములలోఁ బ్రధానవర్గములకుఁ జేరినయవి. ఆత్మకృషితప్ప నింకేకృషియు లేనియెడలఁ, గోఁతకాలము నందు బొల్లిమాటలుదప్పఁ దక్కినపంటలేవియు లభింపవు. మనః కృషి తోడ, నేత్రహస్తాదీంద్రియ కృషియు లేకున్న నేమిఫలము? దేహక్షయము, దేశక్షయముఁ బ్రాపించును. బుద్ధి నొక్కదానిని సవిస్తారముఁ జేసిన మాత్రమున నన్నివిధముల మేలులును దమంతట వచ్చినోటఁ బడునని కన్నులు మూసికొని, చేతులు కట్టుకొని, పరధ్యానముఁ జేయు వారికంటె మూఢులీలోకమున నుండరు. మనఃకృషియు, హస్తకృషి యుం గలియకయున్న నేర్పడునది "కళ" గాదు ; "కళంకము".

ఈ తత్త్వము దెలిసినవారికిఁ బ్రకృతము హిందూదేశములో నవతరించి యుండెడు సర్వకళాశాలలు పరిపూర్ణములుగావని తోఁపక మానదు. వానియందలి లోపములనేకములు. కళాకృషి మిక్కిలియు న్యూనము. ఆధునిక పాశ్చాత్యసర్వకళాశాలలు విద్యాబోధనశాస్త్ర ప్రకారనిర్మితములును, సర్వప్రజాభివృద్ధికరములును, హృదయానంద కరములునై యుండఁగా, మన కళాశాలలింకను పౌరాణికపంక నిర్మగ్నములై యుండుటఁ జూడఁ గోపతాపంబులు మనస్సును గలంచుచున్నయవి. వీనివలన మనకుపకారము లేకపోలేదు ; కాని యది చాలదు. మఱియుఁ బూర్వమెప్పుడో మంచిచేసెనని యెల్ల కాలము కృతజ్ఞతాసూచకముగ వందిమాగధస్తోత్రములు చేయుచునో,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేతులుఁగట్టుకొని, నోరుమూసికొని భక్తినమ్రతను జూపుచునో యుండుటకుఁ బౌరుషవంతుఁడెవ్వఁడును సమ్మతింపఁడు. చిన్నప్పు డక్కఱమైఁ బెంచి పెద్దవానినిగాఁ జేసిరిగదా యని జన్మమంతయు నవ్వాలకు నావాలుతిగా నియ్యఁబోలునా ? కృతజ్ఞత యెంతో మంచిగుణము ; అయినను భావికిఁ బ్రతికూలముల విధించునెడల దాని ననుసరించుట యన్యాయము. పూర్వులయెడ మనము చూపవలసిన భక్తికంటె, నిఁకముందు మనచే సృజింపఁబడు సంతతివారి పురోవృద్ధికై వలయు సన్నాహముల నొడఁగూర్పఁ బ్రయత్నించుట ప్రధానతరకృత్యము. రక్షించుటకు శక్తిలేనిచో సృష్టించుట మహాపాతకము. మన పూర్వులు మనల నీలోకమునకుఁ దెచ్చిరి ; శక్తికొలఁది భరించిరిగాఁబోలు ; అది వారి ధర్మము ; దానిని వారు చెల్లించుకొని పోయిరి ; వారు చేసిన మేలు మఱవఁగూడదు ; అట్లనుటచే మనమెవ్వారిమేలునకై యుత్తరవాదులమో యట్టి మన సంతతివారిక్షేమముల నారసి యాచరించు విధమునఁగాక, ప్రాచీనుల మతప్రకారము వర్తింపవలయునని యర్థము చేయుట మూఢభక్తి. సంతతివారి క్షేమార్థములైన ధర్మములకంటె మిక్కిలిగా నుపాసింపఁదగిన ముఖ్యధర్మము లెవ్వియును లేవు. "ఉన్నవి ; నాయాత్మను నేను గాపాడుకొనుట ప్రధానధర్మము," అనువారుందురయేని, అట్టివారు సంతానము వడయుట కనర్హులనియు హక్కులేనివారనియుఁ దోఁపకున్నె ? తనగతిమోక్షములకై సంతానముఁ బడయవలెనన్న, నాకుఁ జూడ నియ్యది పరోపకారధర్మమునకు విఘాతుకమైన తలంపుగఁ గన్పట్టెడిని. అది యట్లుండె ; వర్తమానకాలముయొక్క ముఖ్యకర్మము, భూతకాలములో వేల్వఁబడుట కాదు ; భవిష్యత్తును భూతవర్తమానములకంటె నున్నతముఁ జేయఁ ద్రికరణశుద్ధిగఁ బరిశ్రమించుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కావునఁ గృతఘ్నత యనునిందకు భయపడక, సర్వకళాశాలా సంస్కారమున కుద్యోగింపవలయును. మొదటిప్రేటునకు దీనికి మించిన లక్ష్యములేదు. ఈవిషయమై " ఆంధ్రపత్రిక " యొక్క యీ సంవత్సరాది సంచికలో నాకుఁ దెలిసినంతమట్టుకు నిదర్శనములతో వ్రాసియున్నాను. దానిం దిలకింప విద్యాసంస్కారోద్యోగులు ప్రార్థితులు. ఇఁక వేఁలుగ నిట దీర్ఘవాదమునకుం బూనుట నాకు చర్వితచర్వణమే కాదు, మీకు శ్రవణబాధకమును. కావున నింతకాలము నోపికతో నా వ్యాసము నవధరించినందులకు వందనము లర్పించుచు, మీయనుజ్ఞమై నింతట విరమించెదను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨

# స్వయంవరములు రాక్షసవివాహము లౌనా? కావా?



మన పూర్వులైన యార్యులలో స్వయంవరములు వివాహపద్ధతులలో నొకటిగా నుండెననుట ప్రసిద్ధి. అనేకులు, స్వయంవరములు కన్యకయొక్క యిష్టప్రకార మాపెచే వరింపఁబడిన వరునితోడి పెండ్లి యని యనుకొనుచున్నారు. ఇందలి సత్యనిర్ధారణకుఁ దోడ్పడఁజూచుటయె యీ వ్యాసముయొక్క యుద్దేశము. సిద్ధాంతము నాకసాధ్యమైన పని. వివేకవంతులైన పండితు లాకార్యమునకుఁ బూనుకొందురుగాక!

ఆర్యులలో నేమాత్రము స్వయంవరములు ప్రబలియుండెననుట మొదటి యంశము. నాకుఁ దెలిసినమట్టునకు రాజులలోనేకాని యితర జాతులలో స్వయంవరములు నడపఁబడినట్లు కానము. క్షాత్రధర్మము నవలంబించినవారిలోమాత్ర మీపద్ధతి యుండుటవలనఁ బరాక్రమమున నపహరించి చేసికొను రాక్షసవివాహమునకును నీస్వయంవరములకును సాదృశ్య ముండెనని యనుమానింపవలసి యున్నది కదా!

మఱియు, నిజమైన స్వయంవరము గాంధర్వము; కన్నెయు వరుఁడును బరస్పరము మోహించి స్వతంత్రముగఁ జేసికొను సంబంధము గాంధర్వము. ఇట్టి స్వతంత్రవివాహములు గాంధర్వమనుపేరఁ బ్రత్యేక విభాగముగఁ బరిగణింపఁబడినపుడు, స్వయంవరములు పారతంత్ర్యవైవాహిక పద్ధతులలోఁ జేరినవిగ నుండునుగదా!

దేవయాని యను బ్రాహ్మణకన్య యయాతిని బలాత్కారముగఁ బెండ్లాడినది. వరుని పక్షమునఁ జూచిన నెట్లున్నను, వధువు పరముగ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోజించినయెడల నియ్యది స్వయంవరము. అయినను, దీనిని స్వయం వరములో నెవ్వరుఁ జేర్చియుండలేదు. శకుంతల సమాగమము గాంధర్వ మనఁబడినదిగాని స్వయంవరమని పేర్కొనఁబడలేదు. కాబట్టి నిజమైన పరస్పరప్రీతితోఁ బరస్పరవశులైన యువతీయువకుల యానంద లీలాదాంపత్యము మన పెద్దల యెన్నికల ప్రకారము స్వయంవరము కాదు గాఁబోలు.

ఇంక స్వయంవరములు రాక్షసములనుటకుఁ బ్రత్యక్షప్రమాణ ములు కొన్ని చూపబ్టెడిని.

స్వయంవరము చిత్తానుసారముగఁ బ్రవర్తింపఁబడు పెండ్లి కాద నుట దానిపరిస్థితులను బట్టియే నిరూపించ వచ్చును. మొదలు దినము, లగ్నము, నిర్ణయించుకొని యుత్సవమును సాటింతురు. ఆనాఁడు వచ్చినవారిలోఁ గన్యకయొక్క మనస్సునకు నచ్చినవాఁడు తప్పక వచ్చియుండుననుట యేమినిజము? మఱి వచ్చినవారెల్లరును దనకేల యనిష్టులుకారాదు? ఒక్కనినైన నొల్లక పూలహారమును దనయెడ లోన వేసికొని తాను శుద్ధాంతవాసమునకుఁ దిరిగిపోవచ్చునా? నాకుం జూడ నీస్వయంవరమునందు మనోఽనుగతికంటెఁ లగ్నమే ప్రధాన మని తోఁచెడిని. ఎవరినైన నొక్కనిని దప్పక వరించుటయే విధి కాఁబోలును. లేకున్న నుత్సవపుఖర్చులన్నియు వ్యర్థమగును. వచ్చిన రాజులలో నొక్కరు దప్ప నందఱును గన్యకతండ్రిపై దండెత్తుదురు. స్వయంవరము స్వతంత్రించి కన్యక తన యిష్టప్రకారము చేసికొను వివాహము కాదనియు రాక్షసములోని యొక యుపవర్గమనియు నాయొక్క యనుమానము.

భారతములో "స్వయంవరవిజితయైన కోమలి" యను ప్రయోగం బొకానొకచోటఁ గానంబడియెడు. "స్వయంవరములో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విజిత" యనఁగాఁ బరాక్రమమున నపహరింపఁబడినది యను నర్థము గాక వేఱొక యర్థము సాధ్యమా?

"కాశీరాజు కూఁతుల స్వయంవరోత్సవంబు విని ధనుర్ధరుండై భీష్ముఁడు" పోయినాఁడఁట! స్వయంవరములకు సైన్యములతోను నాయుధములతోను బోవుట యాకాలమున ననివార్యములైన లక్ష్యములలో నొక్కటి. ఆ స్వయంవరమునకు మూఁగిన రాజలోకంబెల్ల వెఱచి చూచుచుండ భీష్ముఁడక్కన్యకలఁ దన రథంబెక్కించుకొని

"నాయనుజునకు వివాహము
సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం
బోయెద నడ్డంబగు వా
రాయతభుజశక్తి నడ్డమగుఁడా యాజిన్."

(మహాభారతము. ఆదిపర్వము. ౪వ ఆశ్వా. ౧౯౨ ప.)

అని యనుచు వెడలెను.

ఈ స్వయంవరమునఁ దుదకు వరుఁడే యగుపడుటలేదు. విచిత్రవీర్యుఁడింటినుండి బయలు దేరినట్లే కానము. ఇఁకఁ గన్యకలు వానిని వరించి రనుట రసాభాసమైనమాట. వానిపరముగ భీష్ముఁడు వీరల నపహరించికొని పోవుచున్నాఁడు. మఱియు నట్లుచేయుట సత్కృత్యమని నిరూపించుటకై "క్షత్రియులకు గాంధర్వరాక్షసంబులుత్తమంబులు" అని ధర్మశాస్త్రమును వెల్లడించెను. కాఁబట్టి చెఱపట్టుటయు స్వయంవరము. అట్లగుట రాక్షసమునకును దీనికిని భేదమేమి?

"స్వయంవరంబున జయించి వివాహంబగుట రాక్షసమునకంటె నత్యుత్తమంబు" అని వచియింపఁబడియున్నది. దీనికిఁ గారణము లేమిగానుండవచ్చును? రాక్షసమనఁగా నొక్క తండ్రినో యొక్క యన్నదమ్మునినో యోడించి కన్యను గొనిపోవుట. స్వయం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వరమున నానారాజులు యుద్ధసన్నద్ధులై వచ్చియుందురు; వారినందఱి నోడించి కన్యను గొనిపోవుట తన యత్యుత్తమత్వంబును—అనఁగా బలపరాక్రమంబుల నగ్రగణ్యత్వంబును స్థాపించుటగాదె! రాక్షసము చిల్లరబేరమువంటిది. స్వయంవరము ప్రబలమైన మొత్తపుబేరము.

దుర్యోధనుఁ డొకస్వయంవరమునకు వెళ్లినాఁడఁట. కళింగ రాజగు చిత్రాంగదుఁడు శుభాంగియను నిజపుత్రికకు స్వయంవరము చాటించఁగా, శిశుపాలుఁడు, నీలుఁడు, జరాసంధుఁడు, లోనుగ రాజు లనేకులు "సముచిత చతురంగబలసమేతులై" వచ్చిరి; ఆ నాఁటి స్వయంవరములలోఁ గత్తులు కటారులు దట్టముగా లేనిది వరము మనస్సునకు నింపుగాఁ గుదురదు గాఁబోలు. దుర్యోధనుఁడు వచ్చెను. శుభాంగి

"... ... ... సఖులు
దాదులు పేర్పేర ధరణీపతులఁజూపి
చెప్పంగఁజూచుచుఁ జేతఁబువ్వ
మాలికయొప్పఁ దన్మధ్య వీథికినల్ల
నడచుచోఁ గురుపతిఁ గడచిపోయె
నతఁడల్గి యచ్చపలాక్షిఁ బోనీకాఁగి
పట్టి రథంబుపైఁ బెట్టఁబనిచి
యేగుచున్న, రాజులెల్ల సంక్షోభించి
కూడుకొని యుదగ్రఘోరభంగిఁ
దాఁకి రవ్విభుండుఁ దలఁకక బలశౌర్య
ములు పొగడ్తకెక్కఁబోరె నధిప!"

(మహాభారతము. శాంతిపర్వము. ౧వ ఆశ్వాసము. ౨౫వ పద్యము.)

ప్రతి స్వయంవరమును సమరవరముగా మాఱుట యాయుగధర్మము లలో నొక్కటి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొట్లాట యేట్లాట లేని స్వయంవరములు చాల తక్కువ; దమయంతీ స్వయంవరము నిజమైన స్వయంవరమేమో; పరిశుద్ధ గాంధర్వముఁ గాదు, రాక్షసమును గాదు. బహుశః ఇంద్రాది దేవతలు ప్రత్యక్షముగ వచ్చి కూర్చున్నందుచే శాంతి నిర్వహింపఁబడెనేమో! అచ్చట మూఁగినరాజు లొక్కరి నొక్కరు చంప నుద్యమింపక యూరకొన్నందుల కా దేవతల సన్నిధి తప్ప వేఱు కారణము మృగ్యము.

దమయంతీ స్వయంవరము యథార్థస్వయంవరము కాదని నా యభిప్రాయము. నలదమయంతులు, తత్పూర్వమే "మనఃప్రభవానల దహ్యమానులై" వేఁగుచుండిరి. ఆ తాపమును దీర్చుటకునై భీమరాజుచేఁ గల్పించఁబడిన యవకాశము కాని, యాస్వయంవర మదివరలో మనసిజ మమకారముఁ జెందనట్టి కన్యక కోరికొనుటకునై చాటించఁబడిన యుత్సవము కాదు. పరువు తెలుగకుండునట్లు దమయంతికి నలుని సమకూర్చుటకునై చేయఁబడిన నెపము; మిష. అందలి సత్యము గాంధర్వము. ఆగాంధర్వమును విరచించుటకునై పన్నఁబడిన కృత్రిమరంగ మాస్వయంవరము.

ఇంక ద్రౌపదీ సీతా స్వయంవరములు స్వయంవరములు కావు. నిర్దిష్టకార్యముఁ జేసినవానికిఁ గన్యనిచ్చెదమే తీరవలయునన్న సమయము ప్రకార మావివాహములు జరిగెను. కాన వానియందుఁ గన్యక స్వయముగ వరించి చేయునది గాని, చేసినది గాని యొక్కటియు లేదు. తుదకు జయశీలుఁడైనవాఁడు "నాయన్నదమ్ముల నందఱిని బెండ్లాడు" మని కోరఁగా నట్లును జేయుట ద్రౌపదికిఁ దటస్థించినది. ద్రౌపదియు సీతయుఁ బణములవంటి వస్తువులు; వైవాహిక స్వాతంత్ర్యము వారికిసి లేదు. ఈనిర్దిష్ట కార్యములును బరాక్రమ సూచకములు గాన ఈ వివాహములును రాక్షసకృత్యములే!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాక్షసము రాజులకు శ్రేష్ఠమైన పద్ధతిగ నిర్వచింపఁబడి యున్నది. మనుష్యులయొక్క పురోఽభివృద్ధి కనుకూలించిన హేతువులలో రాక్షస వివాహములు చేరినవనియు, నవి యొకానొక దశయందుఁ బ్రాకృతజనులలో సర్వత్ర వ్యాపించి యుండెననియు సంఘశాస్త్రసిద్ధాంతములు. అండమాను దీవులలోని వనచరులైన మనుష్యులలో నరులను వేటాడి పుఱ్ఱెలను గానుకగాఁ దెచ్చినఁగాని యేకన్యయుఁ బురుషుని వరింపదు. పుఱ్ఱెలెక్కువగాఁ దెచ్చినకొలంది వరుని పౌరుషమును శ్రేష్ఠత్వమును గన్యకయొక్క తలకును హృదయమునకును నెక్కును. కన్యాపహారణము సాంఘికశాస్త్రప్రకార మన్నిజాతులయందు నొకానొకప్పుడు ప్రబలముగా నుండిన పద్ధతి. ఇది క్షాత్రతత్త్వమునకుఁ జేరిన కృత్యము. కాలక్రమేణ పోలీసుబందోబస్తులు మెండగుకొలది అపహారణము తగ్గుచువచ్చినది. ఇప్పుడును మన యిండ్లలో జరుగు వివాహకార్యములలోఁ బూర్వకాలమునాఁటి కన్యాక్రమమును సూచించు చిహ్నసంస్కారములు కొన్ని నడపఁబడుచున్నవి. "కొడగు" జిల్లాలో వరుఁడు సపరివారముగ వచ్చి యరఁటిబొండెలను బదిపండ్రెండింటిని గత్తితోనఱికి పిమ్మట వధువునింటఁ బ్రవేశించుచున్నాఁడు. ఈ యరఁటిబొండెలు స్వయంవరమునకు మూఁగిన వైరిరాజులు! రెడ్లలో వధూవరులు కూర్చుండు పీటముందట నొక స్తంభమునకు నొక యరఁటిబొండెను బిగించికట్టి దానిముందు మట్టిపాత్రలో దీపమును వెలిగించి యుంతురు. పాపము! ఈబొందియు స్వయంవరమునకు వచ్చిన వైరియే. జయశీలుఁడైన వరునికి దీపము మోయువాఁడాఁయెను. ఇవన్నియు రాక్షసవివాహపరిణామ ప్రకరణములకుం జేరిన యంశములు.

రాక్షసమనఁగా సర్వజనులయందు సర్వకాలముల యందును సర్వదశల యందును జెడ్డదియైన పద్ధతి యని యెంచుట గొప్పతప్పు; దానియందును గుణము, తేజస్సు లేకపోలేదు. కాబట్టి పూర్వరాజు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలో నది శ్రేష్ఠమైన పద్ధతిగఁ బరిగణింపఁబడినది. స్వయంవరములు రాక్షసము లగుటచే గాఁబోలు నవి కాలక్రమేణ నశించి నామమాత్రావశిష్టము లైనవి. గాంధర్వములు స్త్రీపురుషుల యాద్యప్రకృతికిఁ జేరిన దాంపత్యములు. అవి యమంత్రకము లని మనవా రనుకొని యెదరు. అనఁగా మంత్రములు వేదములు పుట్టకపూర్వమునుండియు మనుష్యులలో ననాదిగ వ్యాపించిన తంత్రము గాంధర్వము. స్త్రీ పురుష పరిపూర్ణ స్నేహసూత్రమునకు సహజమును నిరంతరములైన యుదాహరణము. మనుష్యప్రకృతి యెంతకాల మనశ్వరమో యంత కాల మదియు నశింపదు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3

# హిందూమత పరిణామములో భజనకూటముల ప్రాముఖ్యము.



మన దేశములోఁ బ్రతిగ్రామమునందును భజనమందిరము లున్నవి. వీనియొక్క చరిత్ర మేమి? వీనికిని హిందూమతములోని యితర సంప్రదాయములకును గల సంబంధ మేమి?

హిందూమతముయొక్క పరిణామములో ముఖ్యదశ లెవ్వి? మనమతమునకు వైదికక్రియ లాద్యములు. ఈక్రియలు జనసామాన్యమున కెప్పుడును సాధ్యములైనట్లు కానము. యాగములు — యజ్ఞములు ధనాఢ్యులకేగాని ప్రజాసామాన్యమున కనుకూలింప నేరవు: కావుననే యీవైదిక కర్మలవిరచన రాజులచేతను, రాజసాహాయ్యముచే ఋషులచేతను జేయఁబడినట్లు మన గ్రంథములలోఁ జెప్పఁబడియుండుట! మఱియు వీనియం దింకొక్క న్యూనత: యజమానుఁడైన యేవ్యక్తియొక్కయో కోరికల నీడేర్చుటకై చేయఁబడు తంత్రములేకాని, వైదికక్రియలు సమస్తమైన ప్రజకు నైహికముగాఁ గాని, యాముష్మికముగాఁ గాని పనికివచ్చునవిగావు; పుత్రులఁ గోరినరాజులు పుత్రకామేష్టి నొనరించుట — ఇత్యాదులు దీనికి నిదర్శనములు. కొన్ని యాగములు రాజులయొక్క జయచిహ్నములు; సార్వభౌమత్వమును క్షాత్రబలముచే స్థాపించిన పిమ్మట నశ్వమేధమో రాజసూయమో ప్రకటించుట వైదిక కాలపు టాచారములలో నొకటి. వీనిచేతను బ్రజలకుఁ గలుగు లాభ మేమియు లేదు — బహుళః కొన్నివిందులు వడయుటతప్ప; అనగా — బ్రాహ్మణులకై మిగిలినయెడల.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హిందువులలో జాతీయతాభావము పాశ్చాత్యులలోవలె లేదని యందఱు నెఱుంగుదురు. దీనికి మనమతమును హేతుఫలరూపంబుగ నున్నది; మనమతము జాతీయతాభావమును బెంపొందించునదిగాదు; స్వాభిమానము — కులాభిమానము — ఈరెండే మనముఖ్యమైన మానములు. ఈయల్పమైన దృష్టితో నేర్పఱుపఁబడిన నానాచారప్రకృతులలో వైదికమతమును నొక్కటియై యున్నది.

వైదికక్రియలు శక్తులయొక్క వశీకరణమునకై చేయబడుఁ బ్రాకృతక్షుద్రతంత్రములలోఁ జేరినవా యనియు సంశయించుట కవకాశము లేకపోలేదు. యాస్కుఁడు వేదములయొక్క ప్రామాణికత్వమును నిరాకరించినవారిలోఁ బ్రథమగణ్యుఁడు; తన న్యాయశాస్త్రము నందు గౌతముఁడును వేదమును ఖండించెను. ఉపనిషత్తుల కాలమునకే వైదికక్రియలాధ్యాత్మికముగాఁ బ్రశస్తములుగావని యేర్పడి పోయినట్లున్నది. హింస ప్రధానముగాఁ గలవియగుటచేత బౌద్ధులును, జైనులును వానిని నిరసించిరి.

ఈనానాసంస్కార ప్రభావములచేత వైదికక్రియలయొక్క స్వరూపము చాలవఱకు మాఱి, యవి సాత్వికక్రియలుగఁ గాలక్రమేణ పరిణమించినవి. క్రియాస్వరూపమెట్లు మాఱినను వాని యుద్దేశములు మాఱలేదు: ఉద్దేశమేమి? ఎవ్వఁడేని యొక వ్యక్తికో, వానికులమునకో యభివృద్ధిని సమకూర్చుట; రాగభోగాదులయందలి కోర్కులను సిద్ధికివచ్చునట్లు చేయుట. ఇంతేకాని, సంఘసామాన్యము యొక్క శీలము, పురోవృద్ధి — మొదలగు జాతీయతా ప్రయోజనములు వాని యొక్క పరమార్థములు గావు.

వేదములయొక్క పరిణామము రెండుమార్గముల ననుసరించెను: అందొక్కటి పూర్వమీమాంసాపద్ధతి; ఇందుఁ గర్మలనఁబడు యజ్ఞహోమాదిక్రియలు ప్రధానములు. ఈక్రియలకుఁ దమంతనే యితర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాహాయ్యము లేకయ శక్తులున్నవని వాదించువారు వేదములపౌరుషేయము లనియుఁ దుదకు దేవుఁడు నియతము లేఁడనియు, నొకవేళ నుండినను నతఁడు సాక్షియే కాని, కర్తగాఁడనియు వాదించిరి. దేవుఁడు కర్తయైనచోఁ గ్రియలమూలముననే సిద్ధులఁ దప్పక సంపాదింప వలనుపడునని సిద్ధాంతీకరించుట యసాధ్యమగును; ఇఁక నితరమార్గము లున్నయెడలఁ గర్మలయొక్క ప్రాధాన్యము వికల్పమగును. కాఁబట్టి తీవ్రకర్మకాండవాదు లీకాలమునాఁటి ప్రకృతిశాస్త్రవేత్తలట్లు నిరీశ్వరవాదులైరి.

అన్నిమతములకును వచ్చిన, విడఁదీయరాని చిక్కులలో నిదియొకటి. దేవుఁ డుండినయెడల నడవడి మొదలగు న్యాయమార్గములలో సంపూర్ణమైన సత్త్వ మెట్లుండును? మన మీక్రియచేసినయెడల నీఫల మీయవలసినదని దేవునికి విధియున్నదా?: విధియుండినచో నతఁడు స్వాతంత్ర్యుఁ డెట్లగును? మఱి స్వాతంత్ర్యుఁడైనచో మనము ధర్మమార్గము నవలంబించుటచే నిత్యముగ మేలు కలుగునని యేమినిజము? మఱి, క్రియలఁజేసి సర్వశక్తిసమేతునియెదుట, వానికి స్వాతంత్ర్యము లేనియట్లు హక్కులను స్థాపింపఁజూచుటకంటె, వానిని భజించి, యారాధించి, కాళ్లుపట్టుకొని భక్తిమార్గమున నతని యవ్యాజకరుణను సంపాదింపఁ జూచుట మేలుకదా? ఇదియ భక్తిమార్గముయొక్క యాధారతత్త్వము.

కర్మకాండకుఁ దదనంతరము హిందూమతములోఁ బ్రాబల్యమునకు వచ్చినది జ్ఞానకాండము. అనఁగా—ఉత్తరమీమాంస. కర్మకాండమునందలి లోపములను స్ఫురించుకొని, దేవుఁడన నెవఁడు? ప్రకృతియననేమి? జీవునిలక్షణ మెట్టిది? వీనికింగల సంబంధము లెవ్వి? అని చేసిన, యిత్యాది విచారములు జ్ఞానకాండకుఁ జేరినవి. వీనియందుండు లోపమేమనఁగా—ఇవి యాత్మతృప్తిని సంపూర్ణముగాఁ జేకూర్పఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాలవు. మనుష్యుఁడు వాంఛాపరుఁడు; ఈవాంఛల నెఱవేర్పుకొనఁ జూచుట వానియొక్క స్వభావము. తత్త్వశాస్త్రముచేత వాంఛలెట్లు నమకూడును? కావుననే భగవద్గీతాది గ్రంథములలో బౌద్ధులతత్త్వము ననుసరించి వాంఛలేమాత్రము లేకుండనుండుటయు మోక్షమని సిద్ధాంతము చేయఁబడి యుండుట. వాంఛలేమాత్రమును లేకుండిన యెడల ధర్మము—కర్మము, చేయుబడు టెట్లు? ఈప్రశ్నకు సమాధాన మేమనఁగా—వాంఛలు లేకయ చేయవలసినదని. లోకయాత్ర జరుగుట కొఱకును, మోక్షమబ్బుటకొఱకును ఫలాపేక్షలేక పనులఁ జేయవలయునఁట! ఈ "కొఱకులు" మాత్రమపేక్షలలోఁ జేరినవి కావా? ఇది చప్పిడి సిద్ధాంతము—ముసలివాండ్రకుఁ బనికివచ్చును. తదితరుల జిహ్వాకేమాత్రము గిట్టదు.

నిష్కామ వ్యవహార తత్త్వమునకు మూలపురుషులు జ్ఞానవాదులు. కర్మయోగ భక్తియోగములందు దీనికి స్థానము లేదు.

కాఁబట్టి, మతములుగా ననుష్ఠానమునకు వచ్చిన మార్గములు రెండే. నిరీశ్వరమార్గమైన కర్మమార్గము—భక్తిమార్గమును.

ఈమార్గములలో రెండుపద్ధతు లున్నవి: వ్యక్తిపద్ధతి, సాంఘికపద్ధతి. అనఁగా—కర్మలను, బూజలను నెవఁడైన నొక్కఁడు తన మేలును మాత్రమాసించి స్వయముగనో, పురోహితునిగుండనో చేయుట. ఇదియ హిందువులలో సనాతనమైన పద్ధతి. పాశ్చాత్యుల లోను, మహమ్మదీయులలోను నీపద్ధతి యున్నది గాని,—(ఇది యే మతమునందును లేకపోఁజాలదు)—దీనితోఁగూడ దీనిని మించినదగు సాంఘికపద్ధతియుఁ గలదు. మనము దేవాలయములలో జరుపు పూజను, క్రైస్తవులు, మహమ్మదీయులు వారియొక్క గుళ్లలోను, మసీదులలోను జేయు పూజలను, దారతమ్యదృష్టితోఁ బరిశీలించిన నీభేదము మభోధ్యమగును. మనము దేవాలయమునకుఁ బోయి యర్చనమో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యభిషేకమో చేయించునప్పు డూరివారి నందఱి నాహ్వానించుట మర్యాద. అయినను బూజాసమయములలో యజమానుని కులగోత్ర నామములను మాత్రము, వాని "కాయురారోగ్య పుత్రపౌత్రాభి వృద్ధి రస్తు"గా దేవునికి నివేదింతురు. తక్కినవారలమాట దేవుని చెవిలోఁ బూజారి వేయఁడు. మఱి, టెంకాయ, పువ్వులు మొదలగు పూజా ద్రవ్యములను యజమానుఁడు మాత్రము సమర్పించును. తక్కినవా రర్పింపవలసిన విధిలేదు. ఇఁక నందఱును గలిసి యేకసమూహముగాఁ జేయు భగవత్సంకీర్తన మసలే లేదు. యజమానుని పరముగా, వైదిక క్రియలలో ఋత్విజుఁడట్లు, మన గుళ్లలోఁ బూజారి కంఠపాఠముగా స్తోత్రములను వల్లించును. ఇది హిందువులయొక్క పూజావిధానము — దేవునితోఁ బూజారిద్వారా చేయఁబడు వ్యక్తి బేరము.

క్రైస్తవులలోను, మహమ్మదీయులలోను విధానము వేఱు. అందఱును గుళ్లయందు సమావేశము కావలసిన కాలనియతి ప్రకార మచ్చటఁ గలిసి సమష్టిగా దైవారాధనము చేయుదురు. పూజారి యొక స్తోత్రమును జెప్పిన వెంటనే, యారాధకు లందఱు వల్లవిస్తోత్రము నేకకంఠముగ ఘోష యొనర్పఁ, బ్రతివాఁడును బరోక్షపూజనే కాక, ప్రత్యక్షపూజను సలుపును. అట్లు సలుపుటయ యందఱును గలిసి చేయుపని. వ్యక్తియు, సమష్టియు నీరీతి నభేదభావమును బ్రతి దినమును దాల్చుచుండుటచేత వారలలో సంఘముయొక్క దృఢత్వమును, బలమును నెక్కువవై యున్నవి. మనయందివి మిక్కిలియుఁ దక్కువ. మహమ్మదీయు లేదేని యాందోళనము జరుపవలయునన్న, మసీదులే యాకార్యమునకు సులభమైన స్థలములు. మనయం దిట్టి సమావేశరంగములు లేవు. మొత్తముమీఁదఁ దాను, దనకులము— వీనికంటె మించిన ప్రకృతులు లేవని యుండువారము మనము. జాతి ప్రధానమనియుఁ, గులము దానికుపకరణప్రాయ మనియు భావించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రవర్తించువారు పాశ్చాత్యులు. ఈస్వభావభేదము మనయొక్కయు వారియొక్కయు మతాచారములందెట్లు ప్రతిబింబితమై యున్నదో గమనింపుఁడు!

హిందువులలోని యీగొప్పదోషమును గనిపెట్టి దానిని వారింపఁ జూచిన వారిలోఁ బ్రథమగణ్యుఁడు శీకుక్కల మతస్థాపకుఁడైన నానక్ మహాగురువు. నానకు పంజాబు దేశస్థుఁడు. మహమ్మదీయులచేత హిందువులు ప్రతిచోటను బ్రతియేఁటను బరాజయమునొంది యసహ్యములు నవాచ్యములునైన యవమతులకుఁ బాల్పడవలసినవారై, తమకుల స్త్రీల మానమునైతము కాపాడలేనియట్టి దుర్బలులై యుండుట, కన్నులు, మనస్సు పగులునట్లు చూచినవాఁడు. హిందువులయొక్క దుస్థితికి సంఘీభావము లేకయుండుట మూలకారణము; ఇది తెలిసినవాఁడై తాను స్థాపించిన మతమునందు భజనలకుఁ బ్రధానస్థానమిచ్చి, తద్ద్వారా మహమ్మదీయుల నోడింపఁజేయునంతటి శక్తిని శికుక్కలకుఁ గలుగఁ జేసెను. నేను 1924 సంవత్సరమున గాంధిగారిచే నొకానొక రాజకార్యార్థమై పంజాబునకుఁ బంపఁబడినప్పుడు హిందువులలో లేని యైకమత్యము మనసోదరులైన శికుక్కలలో నెట్లు కలిగెనోయని, దీర్ఘముగ విచారింపఁబూనితిని. అకాలీశిష్యులనాయకులు నాకు మిత్రులగుటచేత వారిద్వారా అనేకసంగతుల గ్రహించితిని. అందులో ముఖ్యము వారి పూజావిధానము—

శికుక్కలయొక్క గుళ్లు చాలఁ జిన్నవి. గర్భగృహము, మూలగృహము—ఇత్యాది గృహభేదము లందు లేవు. తఱుచుగా నవి యొక్కటే గదిగ నిర్మింపఁబడి యుండును. ఈసభ (Hall) సుమారు నూఱు, నూటయేఁబదిమంది కూర్చుండుటకుఁ జాలినదిగా నుండును. కాని, యట్టే వి.స్తీర్ణము కలది కాదు. ఇందుఁ బ్రతిదినము నుదయమున 5½-6 గంటలకును, సాయంకాలము 7-8 గంటలకును నాఁడిలోనుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శిక్కులందఱును, స్త్రీలు సయితము, సమావేశము కావలయుననుట వారియొక్క ముఖ్యవిధి; కొంతసేపాదిగ్రంథమునుండి పూజారి పారాయణముచేయును; అందుఁ బల్లవివంటి స్తోత్రముల నందఱు కలిసి ఘోషింతురు. పిమ్మట నందఱు కలిసి యొక్కతంబుర, యొక్కమద్దెల సహాయముగ భజన సేతురు. ఈభజనకు వారలలోఁ దఱుచు వాడఁబడు పేరు "సంకీర్తనము." అనఁగా— భగవన్నామసంకీర్తనము. ఇట్లొకగంటచేసి వారివారి కార్యములకై వెడలిపోదురు. ఇదియ శిక్కులయొక్క యమోఘమైన సాంఘికశక్తికి మూలబీజము.

మహమ్మదీయులనుండి యీసూత్త్రమును నానకుమహాగురువు గ్రహించి, మన దేశమందుఁ దన మతము ద్వారా వ్యాప్తికిఁ దెచ్చుటకుఁ బ్రయత్నించెను. తదనంతరము కొంతవఱకు హిందూమతమీపద్ధతి నవలంబించెనుగాని, శిక్కులందుఁబలె మనయందది ప్రధాన సంస్కారముగఁ బరిణమించలేదు. అట్లు పరిణమించి యుండినచో హిందువులు తమ దుస్థితి నెప్పుడో తరించియుందురు.

హిందువుల భజనలలోని విశేషాంశములెవ్వి? ఒక్కటి:— ఇందారాధింపఁబడు దేవతలు ప్రజాసామాన్యముయొక్క హృదయము నాకర్షించిన రాముఁడును, గృష్ణుఁడును. వీనిలోను రామమందిరములే యెక్కువ. ఈదేవతలు మనుష్యులవంటివారు; మనయొక్క సుఖదుఃఖముల ననుభవించి యెఱిఁగినవారు; జన్మమునందును అగ్రులుగారు: ఒకఁడు క్షత్త్రియుఁడు, ఇంకొకఁడు శూద్రుఁడు గాఁబోలు! రెండు:— పూజావిధానము జనులందఱు కలిసిచేయు సంకీర్తనము. అర్చనలు, అభిషేకములు లేవు; క్రియలు, కర్మలులేవు; వైదికసంప్రదాయము లేమాత్రమును లేవు; వేదములయొక్క వాసన యిందు ముక్కునెంత నలిపినను దొరకదు; పూజారులులేరు. ఇది సామాన్యప్రజల కనుకూలించినపూజ! మఱియు, సమష్టిగా సంఘముచేఁ జేయఁబడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూజ. భక్తిమార్గప్రధానము. జనుల కమృతమునంటిది; అనఁగా—త్రాగవలయునను బుద్ధియు, రక్తియు వారియందుండిన యెడల.

భక్తికిఁ బూజారి యనుచితుఁడు. యాగాదికర్మలకును వానిని బోలిన యితరపూజావిధానములకును వాఁడు ప్రధాని. భక్తియన్ననో కలపడములేని మానసికధోరణి. ఈయోగమునందు మంత్రములు—స్వరముతోఁడి యుచ్చారణ—పవిత్రధారణము—ఇత్యాదిక్రియ లనుష్ఠేయములుగావు. ఈ యోగముయొక్క సాంఘికపద్ధతి భజనకూటము; కర్మలను సాంఘికముగా నడుపుట దుస్తరము.

భజనమందిరములలో మూలస్థానము, మాలస్థానము—అని స్థలాంతరములు లేవు. అందఱును సమానముగఁ గూర్చుందురు.

మఱియు, దేవుఁడిచటఁ బతివ్రతవలె నంటరానివాఁడు కాఁడు. మఱి, సామాన్యుఁడు; అందఱును సులభముగఁజేరి చెందఁదగినవాఁడు. అందఱును దేవునిపటమును సమీపించి పూలహారముల స్వహస్తములతో వేయవచ్చును. ధూపదీపాదులు సమర్పింపవచ్చును.

ఈ ధూపదీపనైవేద్యాదులు గుళ్లలోని కృత్యముల యనుకరణములు. నిజముగ భజనలకు సంబంధించినవికావు. భజనలకుఁ బ్రాణమంచఱు కలిసిచేయు సంకీర్తనము! అన్యము లనావశ్యకములు.

గుళ్లలోఁ గర్మకాండవాసన ప్రబలియున్నది. గుళ్లకుఁగేవల మనుబంధప్రాయమైనదికాదు భజనకూటము. వానికిఁ గొంతవఱకు విఱుగుడువంటిది.

హిందూమత పరిణామదశలలోఁ జివరవచ్చినవి భజనలు. హిందూమతదశలలో భజనలుత్తమోత్తమములు, పరిపక్వఫలములు.

అయిన, మనజాతియొక్క దురదృష్టము మనల నిందును విడిచినదికాదు. మన దేశములో నేపైగుపెట్టినను జీడపట్టకమానదేమో! అనేక గ్రామములలో భజనపూజకని బ్రాహ్మణపూజారులఁ బెట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండుట భజనల మూలతత్త్వమునకు విచ్ఛేదకరము. నేను జిన్నవాఁడనుగా నున్నప్పుడు మాతండ్రి కట్టమంచిలో స్థాపించిన భజనకు బ్రాహ్మణులు వచ్చుటయే లేదు. సాధారణముగ వారు భజనలకు రారు. ఏకారణముచేతనో కాలక్రమేణ కొన్ని గ్రామములలో నూరివారే ప్రతిసాయంకాలము భజనచేయుట మానుకొనినారు; అట్లు మానుకొనిన గ్రామములలో నేవిధముగానైనఁ బూజ నిలిచిపోక యుండవలయుఁగదా యను భ్రమచేతఁ బూజారులు నియమింపఁ బడినట్లు తోఁచుచున్నది. ఇది బుద్ధిలేనిపని. భజనలలో జరగవలసిన క్రియ యొక్కటియ—సమష్టిగాఁ జేయు సంకీర్తనము; అదిలేనిచో నదిభజనకాదు. మఱి, పూజారులర్చనల కారంభించిరేని గుళ్లలోగుడిగా మాఱిపోవును. భజనమందిరముఁ గట్టియు దానివల్లఁ బొందవలసిన ఫలమును మనము చెందకపోవుటయేగాక, యింకొక గుడిని నెత్తిని వేసికొన్నవార మగుదుము.

భజనకూటమును గుడిగా మార్చుట దేవునికి దేశమునకుఁ దక్కువతనము. గుడిని భజనకూటముగా మార్చినయెడల దేవునియొక్కయుఁ బ్రజలయొక్కయు ఘనతను బెంపొందించినట్లు.

సంపూర్ణము.

---

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7506
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# Andhra University Publications

## ECONOMICS AND POLITICS

No. 1. THE BEGINNINGS OF LOCAL TAXATION IN THE MADRAS PRESIDENCY—A STUDY IN INDIAN FINANCIAL POLICY—1868-71—by M. Venkatarangaiya, M.A., Reader, History, Economics and Politics Department, Andhra University. (Rs. 2—4—0)

No. 4. THE WORLD ECONOMIC DEPRESSION—A PLEA FOR CO-OPERATION—by Sir J. C. Coyajee, B.A., LL.B, formerly Professor and Head of the Department of History, Economics and Politics, Andhra University. (Re. 0—12—0)

No. 5. INDIA AND THE LEAGUE OF NATIONS—by Sir J. C. Coyajee. (Rs. 2—4—0)

No. 12. FEDERALISM IN GOVERNMENT—by M. Venkatarangaiya, M.A. (Rs. 2)

No. 17. INDIAN POLITICS SINCE THE MUTINY—by Dr. C. Y. Chintamani, Editor, 'Leader', Allahabad. (Rs. 2)

No. 19. MODERN CHINESE HISTORY (POLITICAL, ECONOMIC AND SOCIAL)—by Prof. Tan Yun Shan (Chief Organizer, Sino Indian Cultural Society, Nanking). (Re. 0—8—0)

## HISTORY

No. 3. BUDDHIST REMAINS IN ANDHRA AND THE HISTORY OF ANDHRA BETWEEN 225 AND 610 A.D.—by Dr. K. R. Subrahmanian, M.A., Ph.D., Lecturer in History, Maharajah's College, Vizianagaram. (Rs. 2)

## PHILOSOPHY

No. 9. ANDHRA MIMAMSA NYAYA MUKTAVALI—A TREATISE ON PURVA MIMAMSA DARSANA—by K. Gopalakrishnamma, M.A., L.T., Lecturer in Oriental Languages, Govt. Arts College, Rajahmundry (in Telugu) (Re. 1—8—0)

No. 16. MAN—by Dr. Rabindranath Tagore. (Re. 1)

## SCIENCE

No. 14. VISWARUPAMU (IN TELUGU)—by K. Kondayya, M.Sc., Department of Chemistry, Hindu University, Benares. (Rs. 2)

No. 20. TELUGU EQUIVALENTS OF TECHNICAL TERMS IN PHYSICS—by A. Balankeswara Rao, B. Sc. (Hons.), Department of Physics, J. V. D. College of Science and Technology, Waltair. (Re. 0—12—0) (Inclusive of Postage)

## SANSKRIT

No. 6. CHITRAPRABHA—A COMMENTARY ON HARIDIKSHITA'S LAGHU-SABDARATNA—by B. Hari Sastri—Edited with notes by Mahamahopadhyaya Tata Subbaraya Sastri, Maharajah's Sanskrit College, Vizianagaram. (Rs. 3)

No. 7. SANGAMESWARAKRODUM—ON JAGADISA'S SIDDHANTALAKSHANAM—by G. Sangameswara Sastri. (Re. 0—12—0)

Nos. 10 & 13. HISTORY OF SANSKRIT LITERATURE—PART I AND II—(IN TELUGU) by M. Suryanarayana Sastri, Pandit, University College of Arts, Waltair. (Each Part Rs. 2—4—0)

## TELUGU

No. 2. THE UNIVERSITY LECTURES ON VEMANA—by R. Anantakrishna Sarma, Lecturer, Maharajah's College, Mysore. (Re. 0—12—0)

No. 8. KAVITHWATHATHWAVICHARAMU—by C. Ramalinga Reddy, M. A. (Cantab), Hon. D. Litt. (Andhra), M. L. C., Vice-Chancellor, Andhra University. (Re. 0—12—0)

No. 11. A DESCRIPTIVE CATALOGUE OF THE TELUGU MANUSCRIPTS IN THE TANJORE PALACE LIBRARY—Edited by P. P. S. Sastri, M.A., M. R. A. S., (Cantab) Govt. Oriental Manuscripts Library, Madras. (Re. 1—8—0)

No. 15. VAIYAKARANA PARIJATAMU—by V. Ch. Sitaramaswami Sastri, Pandit, University College of Arts, Waltair. (Rs. 3)

No. 18. HISTORY OF TELUGU LANGUAGE—2 Vols.—by Dr. C. Narayana Rao, M.A., Ph.D., L.T., Lecturer, C. D. College, Anantapur. (Rs. 12)

No. 21. VYASAMANJARI—by Dr. C. R. Reddy, M.A. (Cantab), Hon. D. Litt. (Andhra), M.L.C., Vice-Chancellor, Andhra University. (Re. 1—8—0)

*Note—Copies of the above publications can be had either from the Registrar or from any leading book-sellers.*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri